# ఆంధ్రప్రదేశ్

జనవరి, 1971

పుష్యం. - మాఘం 1892 శా. శ

సంపుటి: 15 సంచిక: 3

ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు


## సంక్రాంతి ప్రత్యేక సంచిక




పేజీ





రెండో అట్ట : లేపాక్షి బసవన్న

మూడో అట్ట : నిజామాబాదులో విమానంద్వారా మందుల చల్లకం.

నాలుగో అట్ట : ధవళేశ్వరం కాలువలో పడవలు.


**వెల : 50 పైసలు**

**సాలు చందా: 6 రూపాయలు**

రిజిస్టర్డ్ నెం. 133

# "రోజుకో కొత్త పరిశ్రమ"

కొత్త సంవత్సరం వచ్చింది. గడిచిన ఏడాది మనం సాధించిన విజయాల దృష్ట్యా చూచినట్లయితే, యీ యేడు కూడా యితోధిక విజయసాధన విషయంలో ఆశాజనకంగానే కన్పిస్తోంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి 1970 సంవత్సరం అదృష్ట సంవత్సరంగా గడిచిపోయింది. అభివృద్ధి శరవేగంతో జరిగింది. ప్రశాంత వాతావరణం రాష్ట్రమంతటా వెల్లివిరిసింది. శాంతి పరిస్థితులు నెలకొని వున్నట్లయితే, ప్రజాసంక్షేమం ఎంతగానో సాధించవచ్చుననీ, దీర్ఘకాలిక ఆర్థిక, పారిశ్రామిక ప్రగతి సాధనకు అవసరమైన చర్యలు తీసుకునే అవకాశం కలుగుతుందనీ, ఆ విధంగా జరిగినప్పుడే అధికంగా వృత్తి, ఉపాధి అవకాశాలు లభ్యమవుతాయనీ ఋజువయింది.

ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలో సేద్యపు నీటి పారుదల రంగంలోనూ, పరిశ్రమల రంగంలోనూ గత సంవత్సరం ప్రారంభించబడిన ప్రగతి పథకాలను గురించి పదేపదే ప్రస్తావించ వలసిన అవసరం లేదు. వీటితో, రామగుండంలో బొగ్గు ప్రాతిపదికగా ఏర్పాటైన ఎరువుల ఫ్యాక్టరీ, విశాఖపట్టణంలో తలపెట్టిన ఉక్కు కర్మాగారం మాత్రం మనం సాధించిన ఘనవిజయాలుగా ప్రత్యేకంగా పేర్కొనదగినవి. ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు యిచ్చిన ''రోజుకు ఒక కొత్త పరిశ్రమ'' అనే నినాదం అప్పుడే పరిశ్రమదారులను ఆకర్షించడం ఆరంభించింది. మన రాష్ట్రంలో కొత్త పరిశ్రమలు స్థాపించడానికి యిప్పుడున్న అనుకూల వాతావరణం యింతకు ముందెన్నడూ లేదనే చెప్పాలి. ప్రభుత్వం యిస్తోంటున్న ప్రోత్సాహంవల్లా, రాష్ట్రంలో నెలకొనివున్న సుస్థిరతవల్లా దేశం నలుమూలల నుండి పరిశ్రమదార్లు వచ్చి యిక్కడ కొత్తగా పరిశ్రమలు స్థాపించుకొనే వాతావరణం ఏర్పడింది.

  

డిశెంబరు, జనవరి నెలలు సాధారణంగా కాన్ఫరెన్సులూ, మహాసభలూ జరుగుతుండే రోజులు. హైదరాబాదుకు పుష్కలంగా దేశ, విదేశ యాత్రికులు వస్తుండే రోజులు. ఎక్కడ చూసినా కనులపండువుగా, వీనుల విందుగా నృత్యాలూ, నాటకాలూ, సంగీత కచేరీలూ జరుగుతుంటాయి. గడిచిన కొలది సంవత్సరాలలో యీ కార్యక్రమాలు జోరుగా కొనసాగాయి. సాంస్కృతిక సంబంధాలు వృద్ధి పొందాయి. ఇటీవలనే రాష్ట్ర రాజధాని, హైదరాబాదులో హంగరీనుండి వచ్చిన సాంస్కృతిక బృందంవారు 3 రోజుల పాటు నృత్య ప్రదర్శనలు యిచ్చిన సందర్భంలో వేలాది ప్రజలు తిలకించారు. వివిధ జాతులమధ్య దృఢమైన స్నేహ వాతావరణం ఏర్పడడానికి యిటువంటి కార్యక్రమాలు తోడ్పడతాయి. చిత్రలేఖనం, సంగీతం, నృత్యం మొదలగు కళలు పరస్పర అవగాహనను పెంచి, అభిరుచులను పెంపొందించి మానవ హృదయంలో ఉదాత్తతను రేకెత్తింపజేస్తాయి.

భౌతిక సంపద ఒక్కటే మానవుడికి ఆత్మశాంతి కలిగించలేదు. నృత్య సంగీతాది కళలు కేవలం నయన, శ్రవణేంద్రియాలకు ఉల్లాసం కలిగించడానికీ, ఉద్రేకం కలిగించడానికీ మాత్రమే వుపయోగపడేవని భావించడం పొరపాటు. ప్రజల మంచికి ఏది కావాలో దానిని మనం సమకూర్చాలి. అంతేకాని వారు దేనికై ఆరాటపడతారో దానిని కాదు. నృత్య సంగీతాది కళలకు ఏ విధమైన ఎల్లలూ లేవు. అవి మానవజాతి అంతటికీ ప్రపంచానికంతటికీ చెందినవి. సుబ్బులక్ష్మి పాట కచేరీ అమెరికాలో ఎంత ప్రజారంజకంగా వుంటుందో, ఎహూదీ మెనూహిన్ ఫిడేలు సంగీతం భారత ప్రజానీకాన్ని అంతగా రసానందాంబుధిలో ముంచి ఎత్తుతుంది. "ఆపాత మధురమైన" సంగీత రసాస్వాదన చేయడానికి భాష అడ్డంకి కాదు. అదేవిధంగా, దేశ దేశానికీ మారుతూవుండే నృత్య రీతి కూడా మనలో రసస్ఫూర్తి కలగడానికి అడ్డంకికాదు. నృత్య సంగీతాది కళలు-లలిత కళలన్నీ కూడా ఆయాజాతుల ప్రత్యేక ప్రజ్ఞా ప్రాభవాలకు ప్రతిబింబాలుగా వుంటాయి.

మన దేశం, యితర దేశాల మధ్య సాంస్కృతిక బృందాల రాకపోకలు విరివిగా జరుగుతూ వుండడం ఆనందదాయకమైన విషయం. హైదరాబాదులో ఏటేటా మనం యూరప్‌లోని వివిధ దేశాలనుండి వచ్చిన కళాకారుల బృందాల నృత్య ప్రదర్శనలు తిలకిస్తూ వుంటాం. గతసంవత్సరం రష్యా దేశపు నృత్య ప్రదర్శనలు చూశాం. దేని ప్రత్యేకత దానికి వున్నప్పటికీ, తూర్పుయూరప్ దేశాల నృత్య ప్రదర్శనలలో కొట్టవచ్చినట్లు కన్పించే సామ్యభావం ఏదో మనకు స్పష్టంగా గోచరిస్తుంది.

**- పి. వి. ఆర్**



# జాతీయ సమైక్యత ద్వారా సోషలిస్టు లక్ష్యాల సాధన

పద్నాలుగేండ్ల క్రిందట ఈ రోజున ప్రధానమంత్రి కీ. శే. శ్రీ జవహర్లాల్ నెహ్రూ ఆంధ్రప్రదేశ్ అవతరణకు ప్రారంభోత్సవం చేశారు. ఈ కాలంలో రాష్ట్రం అనేక గడ్డు సమస్యలను యెదుర్కొని, వాటిని అధిగమించింది. అనేక రంగాలలో పరస్పరం చేదోడు వాదోడుగావున్న ప్రాంతాలలో కూడిన విశాలరాష్ట్రమే అందరికీ శ్రేయస్కరంగా వుంటుందని గత 14 ఏండ్లలో సాధించిన సర్వతోముఖాభివృద్ధి చాటి చెబుతున్నది.

గడచిన సంవత్సరం అనేక విషయాల దృష్ట్యా చాల ప్రాముఖ్యతగలది. ప్రజల శ్రేయస్సును ఆకాంక్షిస్తూ, రాష్ట్రాభివృద్ధికి దోహదం కలిగించే ముఖ్య పథకాలను చేపట్టడం జరిగింది. రామగుండం రసాయనిక ఎరువుల కర్మాగారం, అగ్నిగుండాల రాగి–తుత్తునాగం కర్మాగారం, ధవళేశ్వరం వద్ద సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజి, శ్రీకాకుళంలో వంశధార ప్రాజెక్టు, పోచంపాడు ప్రాజెక్టు నుంచి జలాల విడుదలకు ప్రారంభోత్సవం చాల ముఖ్యమైన ఘట్టాలు. ఈ ప్రాజెక్టులు మన రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని పటిష్ఠం చేయగలవు. విశాఖపట్నంలో నెలకొల్పబడుతున్న ఉక్కుఫ్యాక్టరీ మన రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధికి చాలా తోడ్పడుతుంది.

తెలంగాణా ప్రాంతీయ సంఘం ఉత్తరువుకు సవరణ, ప్రధానమంత్రి అష్టసూత్ర ప్రణాళిక అమలు, రాయలసీమ ప్లానింగు, అభివృద్ధి సంఘం ఏర్పాటు మున్నగు చర్యలు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలు పరిపూర్ణంగా అభివృద్ధి చెందడానికి దోహదం కలిగిస్తాయి. ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణలను అమలుపరిచింది. బీద ప్రజలకు 23 లక్షల ఎకరాల భూమి పంచి పెట్టింది. గత కొంత కాలంగా నక్సలైట్ల దాడులకు గురియైన శ్రీకాకుళం జిల్లాలోని కొన్ని ప్రాంతాలు ఇప్పుడు ఈ బెడద నుంచి విముక్తి పొందడం హర్షదాయకమైన విషయం. గిరిజన ప్రాంతాలలో గిరిజనుల సంక్షేమంకై అనేక చర్యలు తీసుకోవడం వల్లనూ, పోలీసులు సమర్థవంతంగా తగిన చర్యలు తీసుకోవడం వల్లనూ, ఈ ప్రాంతాలలో ఇప్పుడు శాంతి నెలకొన్నది.

భారతదేశం సోషలిస్టు లక్ష్యాలను సాధించేందుకు కృత నిశ్చయంతో ముందడుగు వేస్తున్న ఈ తరుణంలో, జాతీయ సమైక్యతను పెంపొందించవలసిన ఆవశ్యకతను గురించి నొక్కి చెప్పనవసరంలేదు. ఉత్తర దక్షిణ భారత దేశాలకు వంతెనగావున్న ఆంధ్రప్రదేశ్ జాతీయ సమైక్యత విషయంలో ఎంతో కీలకపాత్ర వహించగలదు. ఇంత వరకు మనం సాధించిన విజయాలను సమీక్ష చేసుకొని, భవిష్యత్తులో రాష్ట్రాభివృద్ధికి ఇంకా యెక్కువ కృషిచేయాలని అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాను.

—కాసు బ్రహ్మానంద రెడ్డి




ఉదయాద్రి మీద సూర్యభగవానుడు దర్శనంయిసే నే జగతికి ప్రబోధం ఆకాశంలో ఆదిత్యుడు విరాజమానుడైతేనే జగతికి జీవమూ, జీవనమూ. ఆయన లోకబాంధవుడు. మనకు ప్రత్యక్షదైవం. ఆ అంశుమంతుడు అదృశ్యుడైతే అంతా శూన్యమే. మన భూమండలానికి సంబంధించినంత వరకు సృష్టి స్థితి లయ కారకుడు ఆయనే.

సూర్యుడు అంతరిక్షంలో నక్షత్ర మండలంద్వారా పయనించే మార్గానికి క్రాంతివృత్తం అనిపేరు. నక్షత్రాలు ఇరవై ఏడు. వాటికి 108 పాదాలు. ఈ పాదాలలో తొమ్మిదేసి పాదాల ఆకారాన్ని బట్టి మేషం (మేక) వృషభం (ఎద్దు), మిథునం (దంపతులు), కర్కాటం (ఎండ్రకాయ), సింహం, కన్య, తుల, (త్రాసు), వృశ్చికం (తేలు), ధనుస్సు, మకరం (మొసలి), కుంభం (కుండ) మీనం (చేప) అనే రాసులు ఏర్పడ్డాయి.

సూర్యుడు ఒకరాశిని విడిచి దాని తరువాతి రాశిలో ప్రవేశించడాన్ని సంక్రాంతి అంటారు. సంక్రాంతి లేక సంక్రమణం అంటే చక్కగా నడుచుట, ప్రవేశించుట, సంయుక్తమగుట అని అర్థం. సూర్యుడు మేషరాశిలో ప్రవేశించే సమయం మేష సంక్రాంతి. ఇదేవిధంగా తక్కిన సంక్రాంతులూను. కర్కాట సంక్రాంతి నుండి ఆరునెలలు దక్షిణాయనం. మకర సంక్రాంతి నుంచి ఆరునెలలు ఉత్తరాయణం. ఈ రెండు సంక్రాంతులూ అయన సంక్రాంతులు.

సంక్రాంతినాడు ఉదయమే స్నానం చేసి శ్రీ సూర్యనారాయణ మూర్తి ప్రీతికోసం దాన జప హోమాది కర్మలు చేస్తున్నాను అని సంకల్పం చెప్పాలి.

సంక్రాంతి పుణ్యదినంనాడు స్నానం చేయనివాడు చిరకాల రోగిగానూ, నిర్ధనుడుగానూ ఉంటాడు, సంక్రాంతినాడు దేవతలకూ పితరులకూ పెట్టినవానికి జన్మ జన్మాలవరకూ సూర్యుడు ప్రసాదిస్తాడు. సంక్రాంతినాడు ఉదయంస్నానం చేసి స్నాన గంధ పుష్ప ధూప నైవేద్యాలతో సూర్యనారాయణ మూర్తికి పంచోపచారం చేసినవారికి కోరికలు ఫలిస్తాయి–అని శాస్త్రాలు చెప్పుతున్నాయి.

ఈరీతిగా సంక్రాంతి పర్వం సూర్యారాధనతో సంబంధపడి ఉన్నట్లు స్పష్ట మౌతూ ఉంది. ఏడాదిలో మేష సంక్రాంతి మొదలుకొని మీన సంక్రాంతి వరకూ పండ్రెండు సంక్రాంతులు వస్తాయి. అన్ని సంక్రాంతులు పుణ్యప్రదాలే. ఐతే సూర్యుడు ధనూరాశి నుంచి మకరరాశిలో ప్రవేశించే మకర సంక్రాంతి సమయానికి ఒక విశిష్టత ఉంది. మకర సంక్రాంతితో ఉత్తరాయణం ప్రారంభం అవుతుంది. ఉత్తరాయణం దేవతలకు ముఖ్యమైనది. కనక అది విశేషించి ఉత్తమ కాలం. ఉత్తరాయణంలో మరణిస్తే ఉత్తమగతి ప్రాప్తిస్తుంది అంటారు. "ఉత్తరాయణం వచ్చింది ఉరి పెట్టుకో" అనే సామెత కూడా ఉంది. కురుక్షేత్రయుద్ధంలో భీష్ముడు నేల కొరిగాడు. అప్పుడు దక్షిణాయనం జరుగుతూఉంది. అందువల్ల పితామహుడు ఉత్తరాయణం వచ్చేదాకా వేచి ఉండి, ఆ పుణ్యకాలం వచ్చిన తరువాతనే ప్రాణం విడిచాడు.

తక్కిన మన పండుగలన్నీ సాధారణంగా ఒకరోజు పండుగలే. మకర సంక్రాంతి మాత్రం ముఖ్యంగా మూడు రోజుల పండుగ. భోగి, సంక్రాతి, కనుము అని. ఆమాటకు వస్తే మకర సంక్రాంతి నెల రోజుల పండుగ. సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించిన నాటి నుంచి ధనుర్మాసం. ఆనాటి నుంచి మకర సంక్రాంతి నాటి వరకూ పండుగనెల అనే అంటాం.

ధనుర్మాసం అంతా విష్ణ్వాలయాలలో సంబరమే. ఈ మాసంలో మధుసూదన దేవునికి పొంగలి నైవేద్యం పెడతారు.

పొంగలికి బియ్యం ఎన్ని పోస్తే అంత పరిమితిలో పెసరపప్పు వేసారు. దీనిలో మిరియాలు పప్పు ఇంగువా చేరుస్తారు. నెయ్యి బాగా పోస్తారు.

చలికాలంలో ఉదయం పెసరపప్పు. అన్నం—అంటే పులగం తినడం వైద్యశాస్త్రరీత్యా మంచిది. అది అందరికీ సాధ్యపడదు కనుక మనపూర్వులు పెరుమాళ్లకోవెలలో పులగం వండి పంచి పెట్టే పద్ధతి ఏర్పాటు చేశారు.

ఈనెలలో భక్తులు ప్రతిరోజూ తెల్లవారు జాముననే లేచి చలిలో చన్నీళ్లస్నానం చేసి పట్టుబట్టలు కట్టుకొని తిలకాలు దిద్దుకొని చిట్టితాళాలు చేత పట్టి మంగళగీతాలు పాడుతూ భగవత్సం కీర్తనం చేస్తూ వీధుల వెంట పోతూఉంటారు.

ఇలాంటి హేమంతంలో ఎముకలు కొరికే చలిలో ఉదయం పూట యమునానదిలో జిల్లు మనే నీళ్లలో స్నానం చేస్తూ ఒకనెల పాటు కాత్యాయనీ వ్రతం చేశారు గోపికలు శ్రీకృష్ణుని అపేక్షించి.

ఈ నెలలో చిదంబరంలో ఆర్ద్రా దర్శనం జరుగుతుంది. అక్కడ శివునికి చన్నీళ్లస్నానం జరుగుతుంది. అది చాలనట్లు చందనం కూడా పూస్తారు. ఆయన చంద్రమౌళి. అంటే శిరస్సులో చల్లని చంద్రుడున్నాడు. చల్లని గంగకూడా ఉంది. ఆయన శరీరం నిండా చల్లనిపాములున్నాయి. ఎడమ పార్శ్వంలో పార్వతీదేవి ఉంది. ఆ తల్లి మంచుకొండ కూతురు. దానికితోడు ఆఅమ్మ దయతో తడిసిన అమ్మ. మరి ఈ విపరీతమైన చల్లదనాన్ని స్వామి ఎలా భరిస్తున్నాడు? ఒకకవి చమత్కారంగా ఇలా చెప్పాడు. ఎల్లప్పుడూ నిర్వేదంచేత సలసల కాగిపోతున్నానామనస్సులో నీకు నిత్యనివాసం లేకపోతే ఈరీతిగా ఈ విపరీతమైన చల్లదనాన్ని ఓర్చుకొనేశక్తి నీకు ఎక్కడిది..." అన్నాడు ఆ భక్తుడు. సుఖదుఃఖాలూ, శీతోష్ణాలవంటి ద్వంద్వాలకు అతీతంగా ఉండడానికి చేసేసాధనకు ధనుర్మాస ఉషఃస్నానం సహాయకారిగా ఉంటుందన్నమాట.

## పంటల పండుగ

సంక్రాంతి ముఖ్యంగా సూర్యునికి సంబంధించిన పర్వం. అది పంటల పండుగకూడా. "ప్రాణులు అన్నంనుంచి పుడుతున్నాయి. ఆహారం మేఘాలవల్లఉత్పన్నం అవుతుంది. మేఘాలు యజ్ఞంవల్ల కలుగుతున్నాయి. యజ్ఞం కర్మసముద్భవం అంటుంది" భగవద్గీత.

ఆనాటి మంత్రాలూ యజ్ఞయాగాది కర్మలు ఈ నాడు లేవు. వాటిలో నమ్మకం కూడా లేదు. ఈ నాడు మేఘాలను గురించి అందరూ నమ్మేవిషయం ఒకటి ఉంది. భూమిమీద జలాశయాలలోని నీరు సూర్యుని వేడికి ఆవిరియై ఆకాశంలోకి పోయి మేఘాలు ఏర్పడుతున్నాయి. మేఘాలవల్ల వర్షం కురుస్తుంది. వర్షంవల్ల పంటలుపండుతున్నాయి. పంటలకు ముఖ్యంగా కావలసిన నీటిని ప్రసాదించే వాడు సూర్యుడన్నమాట. ఈరీతిగా మనం పంటల పండుగ చేసుకొనేటప్పుడు సూర్యుణ్ణి ఆరాధించడం కూడా సమంజసమే అవుతుంది.

## మనోహర దృశ్యాలు

సంక్రాంతి నెలలో ఎక్కడ చూచినా సస్యలక్ష్మీవిలాసమే. ఊరి వెలుపల బంగారు పంట పండిన చేలు. తోటలలో కెంపుల వంటి వంగపిందెలు. నిండుగా కనబడే గుమ్మడి, బూడిదగుమ్మడి పాదులు. చెట్లమీద ముత్యాలవంటి మంచు బిందువులు. వాటికి తోడుగా రత్నాలవంటి వింత రంగుల పువ్వులు. వన్నెవన్నెల చుక్కచుక్కల పిట్టలు బారులు కట్టి ఆకాశంలో ఎగురుతూ చేలపై వాలుతూ ఉంటే పొలాలలోని జవరాండ్రు ఒడిసెలలోని రాళ్ళుపెట్టి బరాబర తిప్పుతూ కేకలు వేస్తూ పక్షులను అదిలిస్తూ ఉండే దృశ్యాలు మనోహరాలు!

ఆ తరువాత గ్రామీణ వనితలు జట్టుకట్టి కమ్మని కంఠంతో పాడుతూ కొడవళ్ల చేత బట్టి వరిచేలు కోసేదృశ్యం ఎంత ముచ్చటగా ఉంటుంది! పచ్చగా విస్తరించి ఉన్న వరి కళ్లంలో తెల్లని ఎద్దులు కంకుల ధాన్యం రాలుస్తూ గుండ్రగా తిరిగే దృశ్యం ఎంత ఆహ్లాదకరమైనది!

ఇక ఊరిలోని దృశ్యాలు సుద్ద, సున్నం, జేగురు ఎర్రమట్టి పూత మెరుగులతో నున్నగా ఉన్నగోడలు, అలుకులు ముగ్గులతో అలంకరింపబడిన అరుగులు, పసుపు కుంకుమలతో కలకలలాడే గుమ్మాలు, బంతి చేమంతి పువ్వుల తోరణా కాంతులతో విలసిల్లే ద్వారాలు. ఇక వీధులలో వింత వింత ముగ్గుల గొబ్బిళ్లు, గొబ్బిల్లలో బంతి చేమంతి బీర పొట్ల గుమ్మడి పువ్వు గొబ్బిళ్ల చుట్టు గుంపులు కట్టి చిట్టిపొట్టి పడుచులు చేతులు తట్టుతూ పాడే పాటలు, ఇంటిలోపల కొండపల్లి బొమ్మలు నక్కపల్లి లక్కపిడతలు, తాటిఆకు బొమ్మలు తిరుపతి చందనపు బొమ్మలతో తీర్చిన కొలువు!

పరిశ్రమ, ప్రతీక్షలతో కూడుకొన్న మహాప్రయతనము సేద్యం. భూమి కాఠిన్యాన్నీ, వాతావరణ సాఫల్యాన్నీ, మేఘాల కార్పణ్యాన్నీ సహించుకోవాలి కర్షకుడు. ఎండ అనక వాన అనక కష్టించాలి. ప్రకృతి ముఖం చిట్లించుకొంటెరైతునకు కన్నీరు ప్రకృతి ప్రసన్నంగా ఉంటే అతనికి ఉల్లాసం. ఇంతశ్రమ, ఇంత శోధన ఫలితంగా పైరుమొక్కలకు పసిడి వన్నెవచ్చి గింజ పండినపుడు విజయోత్సాహము, ప్రమోదమున్నూ.

( తరువాయి 16వ పేజీలో )

# రజతగీతం

శశాంక

యుద్ధోన్మాదం పెరిగి
ఉర్విని వణికించిం దొకప్పుడు
యు. ఎన్. ఓ. పుట్టి
ఉపశాంతిని కలిగించిందప్పుడు.
మానవత్వంలో దానవత్వాన్ని
ప్రతిష్ఠించింది యుద్ధం
కనుగుడ్లని పీకి
కార్పణ్యాన్ని ప్రకటించింది యుద్ధం
కాళ్ళు తెగగొట్టి
కర్కశత్వాన్ని ప్రదర్శించింది యుద్ధం
కమ్మగా సాగే బతుకుమీద
కారాలూ మిరియాలూ నూరింది యుద్ధం
మనుషు లెవరినీ
మంచిగా బతకనియ్యలేదు యుద్ధం
అందరినీ అడివి మృగాల్ని చేసి
ఆడించింది యుద్ధం
మతాలు చెప్పిన మంచిమాటల నన్నిటినీ
మట్టిలో కలిపేసింది యుద్ధం
అణుబాంబుల్ని కురిపించి
ఆగ్రహావేశాల్ని ప్రకటించింది యుద్ధం
ఇళ్లిల్లు వల్లకాడుగా
మార్చివేసింది యుద్ధం

అప్పుడు—
మానవుడు దిక్కుమాలినవాడయాడు
అప్పుడు
దేవుడు బిక్కమొగం వేశాడు
అప్పుడు—
ప్రళయం వచ్చి
ప్రపంచమంతా మునుకుపోతోన్నప్పుడు
మర్రి ఆకుమీద బాలకృష్ణుడిలాగా
యు. ఎన్. ఓ. ఒక్కటే
లీలగా పైకి తేలింది
విలయాన్ని వారించి
విశ్వసృష్టిని పొడిగించింది.
స్నేహ దీపాల్ని వెలిగించి
జగత్తు నంతనీ కాంతివంతంచేసింది.
యుద్ధ భూముల్ని పంటభూములుగా మార్చి
శాంతి సస్యాన్ని పండించడానికి
సర్వవిధాలా కృషిచేసింది.

అయితే యు. ఎన్. ఓ. ధర్మమా అని
అంతా బాగానే జరుగుతోందని
అందరూ కులాసాగానే బతుకుతున్నారని
అబద్ధం ఆడకూడదు.
సూయజ్ సమస్య
సూటిగా పరిష్కరించబడక పోవచ్చుగాక
ఆ సందర్భంగా కత్తులు దూసుకున్న దేశాలు
అక్కడే తల పగలగొట్టుకు చావకుండా
యు. ఎన్. ఓ. కాపాడింది.

వియత్నామ్ విషయం
విషయంగానే ఉండవచ్చుగాక
విలయం వచ్చి వినాశం ముంచెత్తకుండా
యు. ఎన్. ఓ. అడ్డుకుంది
ప్రపంచశాంతికి భంగం కలిగించే
ప్రతి బెదరింపునీ దీక్షగా ఎదుర్కొంది.
సర్వ దేశాల స్వాతంత్ర్యాన్నీ
సమానంగా గౌరవించింది.
సమైక్యతను సాధించడానికి
సర్వవిధాలా ప్రయత్నిస్తోంది
విద్యా వైజ్ఞానిక దీపాలు వెలిగించి
విద్వేషాంధకారాన్ని రూపుమాపుతోంది.

దరిద్రాన్ని తొలగించి
సిరి సంపదలని పెంచుతోంది
వెనుక బడ్డ దేశాల వెన్నుతట్టి
అన్ని రంగాల్లోనూ అభివృద్ధిని సాధించడానికి
ఆస్కారం కల్పిస్తోంది
మశూచీ విషూచీ జాడ్యాలను మట్టుపెట్టి
మానవుణ్ణి ఆయుష్మంతుణ్ణి చేస్తోంది
వసుధైక కుటుంబమన్న మానవుని కల
ఎప్పటికైనా నిజమైతే
యు. ఎన్. ఓ. చలవవల్లనే కావాలి.

అందుకే ఆశగా ఎదురు చూస్తున్నాను
ఆకాశంలోకి అస్త్రులు చాస్తున్నాను
రాగ వీణను మీటుతున్నాను
రజత గీతాన్ని పలికిస్తున్నాను!

# కళ సమాజమూ వ్యక్తి

—సంజీవదేవ్

పుష్పాలను ఒకచోట రాశిపోసినంత మాత్రాన అవి పుష్పమాల కాజాలవు. అక్షరాల సమూహం మాత్రమే సాహిత్యం కాజాలదు. సప్తస్వరాలను ఒకచోట చేర్చినంత మాత్రాన సంగీతం కాజాలదు. వ్యక్తుల సమూహం మాత్రమే సమాజంకాదు. పుష్పాలను ఒక క్రమబద్ధ రూపంలో గ్రుచ్చినపుడు మాల అవుతుంది. అక్షరాలను ఒక సక్రమ మార్గంలో పెట్టినపుడు సాహిత్యం అవుతుంది. స్వరాలను ఒక లయాత్మక రూపంలో కూర్చినపుడు సంగీతం అవుతుంది. వ్యక్తులు ఒక సామూహిక జీవన విధానానికి అంటివున్నప్పుడు సమాజం అవుతుంది. ఈ సమాజం జీవించే విభిన్న రీతులే సభ్యత అనీ, సంస్కృతి అనీ వేరువేరుగా పిలవబడుతూన్నాయి.

---

కళ అంటే ఏ పనినైనా చేయటంలో ప్రత్యక్షమయే కౌశలం. మానవుని ద్వారా సృజించబడని సృష్టిలోని కౌశలాన్ని ప్రకృతి అంటాం, మానవుని ద్వారా సృజించబడే కౌశలాన్ని కళ అంటాం. కళ మానవుని చేత సృష్టించబడుతుంది. మానవుడు చాలా భాగం సమాజజీవి. కనుక కళ చాలాభాగం సమాజగతం. అంతేకాదు, సమాజం మానవనిర్మితం. మానవుడు కళను సృజిస్తాడు, కనుక సమాజం కళాగతం. అంటే, కళ తన పోషణ నిమిత్తం సమాజంమీద ఆధారపడినట్లే సమాజం కూడా తన వికాసం నిమిత్తం కళమీద ఆధారపడుతుంది. సమాజంతో సంబంధంలేని కళ జీవితం నుంచి దూరమై మిథ్యాజగత్తులో మిణుకు మిణుకుమంటూ ఏకాకిగా సంచరిస్తుంది. కళతో సంబంధంలేని సమాజం ఎండిపోయిన మోడుఅయి, ప్రాణ స్పందనను కోల్పోయి, హృదయంలేని నీరస అస్తిత్వంగా రూపొందుతుంది.

## ఆదిమ యుగంలో సామాజిక ప్రయోజనం

సమాజ ప్రభావం కళమీదా, కళ ప్రభావం సమాజం మీదా ప్రసరిస్తయి. ఆదిమ మానవుల్లో కళ అనేది సామాజిక ప్రయోజనాలతోనే ప్రాదుర్భవించింది. అప్పటినుంచి కొన్ని దేశాల్లో కొన్నికాలాల్లో సమాజాన్ని కళ మార్చటం, మరికొన్ని దేశాల్లో మరికొన్ని కాలాల్లో కళను సమాజం మార్చటం, తిరిగి దీన్ని అదిమార్చటం, మళ్లీ దాన్ని ఇది మార్చటం జరుగుతూ వచ్చినయి, జరుగుతూ వస్తున్నయి, జరుగుతూ వస్తుంటాయి.

## కళాకారుడు

కళకూ సమాజానికీ మధ్య వుంటాడు కళాకారుడు. కళాకారుడు సృష్టించనిదే కళ వుండదు. కళాకారుడు వ్యక్తి కనుక వ్యక్తి లేనిదే సమాజం వుండదు. కనుక కళ అస్తిత్వానికీ, సమాజ అస్తిత్వానికీ కూడ కళాకారుడైన వ్యక్తి ముఖ్యుడు. నిజానికి కళాకారుడు తన ఆనందం నిమిత్తమే కళాసృష్టి చేసుకొంటాడు. చేసుకొన్న కళాసృష్టిని సమాజం ప్రశంసించటమో నిందించటమో జరుగుతుంది. కళ సృష్టించబడేంత వరకూ అది వ్యక్తిగతం, సృష్టించబడిన తరువాత అది సమాజగతం.

అయితే ఆదిమ మానవుల సమాజంలో కళాసృష్టి కూడ వ్యక్తిగతంగా వుండక సామూహికంగానే వుండేది. ఆ రోజుల్లో రసానందం నిమిత్తం కాక సామాజిక ప్రయోజనాల నిమిత్తం కళాసృష్టి జరిగేది. వేటకుపోబోతూ ఆ వేటలో దొరకాలసిన జంతువును చిత్రించటం, వర్షాలు కురవబోయేముందు ఆ వర్షాలను గురించిన పాటలు పాడటం ఆటలు ఆడటం, ఇంకా ఇదేవిధంగా గింజలు నాటే సమయాన, పైర్లను కోసే సమయాన, పిల్లలు పుట్టిన సమయాన, మనుషులు మరణించిన సమయాన నృత్య గీతాదులద్వారా సామూహికంగా తమ ఆనందాన్నో, విషాదాన్నో అభివ్యక్తపరిచేవాళ్లు.

## వైయక్తిక కళలు, సామూహిక కళలు

నేటికీ కొన్ని కళలు వైయక్తిక సృష్టికి అనుకూలిస్తే మరి కొన్ని కళలు సామూహిక సృష్టికి తప్ప అనుకూలించవు. కవితా

**ఒకనాటి నవ్యకళ మరియొకనాటి ప్రాచీనకళ అవుతుంది. నిత్యనూతన కల్పనే కళ**

కళ పూర్ణంగా వైయక్తిక సృష్టి. ఒక కవితను ఒక కవి మాత్రమే సృష్టిస్తాడు, కొందరు కవులు కలిసి సృష్టించరు. వాస్తు కళను ఏ ఒక వ్యక్తీ సృష్టించటానికి వీలులేదు. అది సామూహిక సృష్టి. ఎందరో పనివాళ్ల వల్లకాని సౌధనిర్మాణం జరగటానికి వీలుండదు. ఇక చిత్రరచనా, శిల్ప నిర్మాణమూ ఒక వ్యక్తి ద్వారానూ, ఎక్కువ వ్యక్తుల ద్వారానూ జరగటానికి అవకాశం వున్నది. మొగలాయీ చిత్రరచన సామూహిక సృష్టికిందకే వస్తుంది. మొగలాయీ దర్బార్ చిత్రకారులు ఒకరు రేఖాంకనం చేస్తే, మరొకరు వర్ణలేపనం చేస్తే ఇంకొకరు చిత్రం చుట్టూ లతలనూ పుష్పాలనూ చిత్రించేవారు. శిల్పాన్ని కూడా ఒకరు చెక్కటమూ జరుగుతుంది, కొందరు కలిసి చెక్కటమూ జరుగుతుంది. నాట్యకళ కూడ సామూహిక సృష్టియే. ఎవరి నిమిత్తం కళ అనే ప్రశ్నకు ఒకే ఒక సమాధానం ఇవ్వబూనటం అసమగ్రంగా మాత్రమే నిలచిపోతుంది. దానికి కొన్ని సమాధానాలు ఇచ్చినప్పుడే అది సమగ్రం అవుతుంది. కళ నిమిత్తం కళ; కళాకారుని నిమిత్తం కళ; జీవితం నిమిత్తం కళ; సమాజం, నిమిత్తం కళ దేని నిమిత్తం కళకాదు? అన్నిటి నిమిత్తం కళ. కళ ఎవరినిమిత్తం అనే ప్రశ్నయే తప్పు, ఆ ప్రశ్న అనవసరం.

## ఎట్లా వున్నది, ఎట్లా వుంటే బాగుంటుంది ?

కొన్ని కాలాల్లోని కళా సృష్టి నాటి సామాజిక జీవితానికి ప్రతిబింబంగా రూపొందింది; మరికొన్ని కాలాల్లో అందుకు వ్యతిరేకంగా రూపొందింది. దేశంలో ప్రశాంత వాతావరణం అల్లుకొని వున్న కాలంలో ప్రశాంతతను తెలిపే కళ రూపం తాల్చినట్లే అశాంతిని తెలిపే కళకూడ రూపొందింది. అదే విధంగా అశాంత వాతావరణం అలముకొని వున్న కాలంలో ప్రశాంతినీ, అశాంతినీ కూడ తెలిపే కళ రూపొందింది. ఇదంతా ఆనాటి మానవుల సామూహిక అచేతన (Collective unconscious) మీద ఆధారపడి వుండేది. మనో వైజ్ఞానిక రీత్యా కొందరు తాము నివసిస్తున్న పరిస్థితుల పట్ల ఇష్టం కలిగివుండటమో, అయిష్టం కలిగి వుండటమో ఇందుకు ప్రధాన కారణం. దేశం ప్రశాంతంగా వున్నప్పుడు ఆ ప్రశాంతంగా వుండటం కొందరికి ఇష్టంగా వుంటే కొందరికి అయిష్టంగా వుంటుంది. ఇష్టంగా వున్నవారు తమ కళా సృష్టిలో అప్పటి ప్రశాంత వాతావరణాన్ని అభివ్యక్త పరిచే కళా సృష్టిని చేస్తే, యిష్టంలేనివారు తమ కిష్టమైన అశాంత వాతావరణాన్నీ, అల్లకల్లోలాన్నీ అభివ్యక్తపరిచే కళా సృష్టి చేసేవాళ్లు. మొదటివాళ్లు సామాజిక వాస్తవికతను రూపొందిస్తే రెండవ వాళ్లు తమ వైయక్తిక యిష్టా యిష్టాలను రూపొందించేవారు. ఈ సత్యమే అశాంత పరిస్థితులు అల్లుకొని వున్న కాలాల కళా సృష్టికి కూడ వర్తిస్తుంది. ఒకళ్లు, ఎట్లావున్నదీ అనేదాన్ని ప్రతిబింబింప చేస్తే, రెండో వాళ్లు ఎట్లావుంటే బాగుంటుందీ అనే దాన్ని ఊహాగానం చేశారు.

## చారిత్రికంగా . . .

వాస్తవానికి, సమాజంలో అశాంతంగానూ, అల్లకల్లోలంగానూ, యుద్ధాలతోనూ రక్తపాతంతోనూ, వున్న కాలాల్లోనే ప్రపంచం అంతటా ఉత్కృష్టమైన కళా సృష్టి జరిగింది. మౌర్య చంద్రగుప్తుని సైన్యాలు భారత దేశాన్ని ఒక పాలన క్రిందకు తీసుకొచ్చే ప్రయత్నంలో రక్తపాతం జరుగుతూన్న రోజుల్లో, వైదిక యజ్ఞాల్లో వేల పశువుల బలులద్వారా తడసిన భూముల నుంచి ప్రథమ బౌద్ధకళకు సంబంధించిన విషయాలూ, ప్రతీకలూ ఆవిర్భవించినయి. అయిదవ శతాబ్దంలో చైనాలోకూడ ఇటువంటి రక్తపాతాల మధ్యనే గొప్పకళ ఆవిర్భవించింది. మహాయాన బౌద్ధపు ఉన్నతాదర్శవాదం, దానితో ఉద్భవించిన భారతీయ కళల స్వర్ణయుగం నాలుగవ శతాబ్దంనుంచి ఏడవ శతాబ్దంవరకు వ్యాపించి వున్నాయి. ఈ కాలంలోనే పాటలీ పుత్రంలోనీ, అయోధ్యలోనీ, ఉజ్జయినీలోనీ గుప్తులూ, థానేశ్వరం, కన్నౌజ్ (కన్యా కుబ్జం)ల లోని వర్ధనులూ, మగధలోని మౌఖరీలు తమ రాజ్యాలను విస్తీర్ణ పరచుకొనే నిమిత్తం హత్యాకాండలు సాగించారు. దక్షిణ పూర్వ ఆసియాలో భారతీయ కళలు ప్రవేశించిన కాలంకూడ అల్లకల్లోలంతో నిండిన కాలమే. శకులూ, హూణులూ భారతదేశం మీద దండయాత్రలు జరుపుతూంటే భారతీయులు పోయి దక్షిణ పూర్వ ఆసియా దేశాల్లో తమ వలస రాజ్యాలను స్థాపించే అశాంత సమయం అది. ప్రాచీన గ్రీకుల కళా వికాసం కూడ అంతర్యుద్ధాల మధ్య, పెలోపొనిషియన్ యుద్ధ బీభత్స కాలంలోనూ జరిగింది. ఇటాలియన్ పునర్జాగృతి (Renaissance) కళా వికాసం కూడ ఇటువంటి అశాంత వాతావరణంలోనే జరిగింది. యూరప్‌లో జర్మనిక్ దండయాత్రలు విలయ తాండవం చేస్తున్న సమయంలో ప్రజలు గోథిక్ శిల్పాల్లో మానసిక శాంతిని పొందసాగేరు. ఈ విధంగా కళా వికాసానికి ప్రతికూలం అని నమ్మబడే అశాంత పరిస్థితుల్లోనే ప్రపంచం అంతటా గొప్ప కళా వికాసం జరిగింది! నిర్మూలనం నుంచి నిర్మాణం జరిగింది!!

## గమ్యం పూర్ణ మానవత్వం

సమాజానికి ప్రతిబింబం మాత్రమే కాక సమాజాన్ని ఉపయుక్త పంథాలో నడిపిస్తుంది కళ, కొంత భాగం సమాజం చెప్పినట్లు తాను వింటుంది, మరికొంత భాగం తాను చెప్పినట్లు సమాజంచేత వినిపిస్తుంది కళ. కేవలం సమాజం చెప్పినట్లు వినే కళకాని, తాను చెప్పినట్లు కేవలం సమాజంచేత వినిపించే కళకాని

కళ సృష్టించబడేంత వరకూ అది వ్యక్తిగతం,
సృష్టించ బడిన తరువాత అది సమాజగతం.

ఉత్తమ కళకాదు. ఒకోసారి కళాకారుడు సమాజం విధించే నిబంధనలను విప్లవాత్మకంగా ఉల్లంఘిస్తాడు. లేనిచో అతని కళాసృష్టి సాంప్రదాయిక నిబద్ధతతో ప్రగతిని కోల్పోతుంది. బ్రాడ్లీ అంటాడు "Man is not man at all unless social; but he is not above the beasts unless more than social" మానవుడు సామాజికుడుగా వుండనిదే మానవుడే కాడు; కాని సామాజికుని కంటే మించిపోనిదే మానవుడు జంతువుల కంటే పైవాడేమీకాడు. మానవుడు సమాజగతుడై వుంటూనే సమాజ పరిధుల్ని దాటాలి. సమాజం ఎందుకున్నదీ అంటే మానవుణ్ణి సమాజానికి అతీతుణ్ణి చేయటానికే. సమాజం అనేది పూర్ణ మానవత్వం అనే గమ్యానికొక సాధన మాత్రమే కాని అది గమ్యం కాదు. ఇదే సత్యం కళకు కూడ కొంతవరకు వర్తిస్తుంది. ప్రాచీనాలంకారికులు కూడ కళా స్రష్టకు అపారమైన స్వేచ్ఛను ప్రసాదించారు:

"అపారే కావ్య సంసారే
కవిరేవ ప్రజాపతిః
యథా స్మై రోచతే విశ్వం
తథేదం పరివర్తతే."

ఈ అనంతమైన కావ్య జగత్తులో కవియే సృష్టికర్త. తన కిష్టమైన తీరున ఈ ప్రపంచాన్ని మలుస్తాడు. దీని తాత్పర్యం కళాకారుడు నిరంకుశుడు, తాను సమాజం చేత మలచబడక తానే సమాజాన్ని మలుస్తాడని, ఇది కళ యొక్క చరమ లక్ష్యమే కాని వ్యావహారిక లక్షణం కాదు.

## కళాకారుడి ఆర్థిక అవసరాలు

కళాకారుడు కేవలం రసజీవిగా మాత్రమే జీవించజాలడు. ప్రతి కళాకారుడూ కూడ మానవుడే, ప్రతి మానవుడూ కళాకారుడు కాకపోయినప్పటికీ. కనుక అందరు మానవుల వలెనే కళాకారుడైన మానవునికి కూడ మనసుతోపాటు ఎముకలూ, మాంసమూ, రక్తమూగల శరీరం వుంటుంది. అందువల్ల అందరిమాదిరే కళాకారునికి కూడా ఆకలి, దప్పిక, చలి, కామం వుంటాయి. ఈ అవసరాలు తీరటానికి ఆర్థికావసరం ఎంతో వుంటుంది. కనుక కళాకారుడు ఆర్థికజీవి కూడ. తన దంతపు శిఖరంమీద తాను కూర్చుంటే ఆర్థికావసరాలు తీరతవా? తాను సమాజ జీవిగా వున్నపుడే ఆర్థికావసరాలు తీరేది. అందుకని జీవితంలో ఆర్థిక విషయాలనే ప్రధానాదర్శంగా పెట్టుకొంటే మాత్రం అనర్థకాలు తప్పవు. ఆర్థికాలు లేనిదే జీవించజాలడు. కాని ఆర్థికాలతో మాత్రమే జీవించజాలడు కళాకారుడు.

## ఆధునిక కళ

నేడు ఆధునిక కళ అని పిలువబడే చిత్రరచనా, శిల్పనిర్మాణమూ కూడ సమాజాన్ని ప్రతిబింబించటం లేదు అని అనటం వాడుకలో వున్నది. అంతర్ దృష్టితో పరిశీలిస్తే ఇది సంపూర్ణంగా యథార్థం కాదు. సమాజంలో జరుగుతూన్న సంఘటనలను ఆధునిక కళ ప్రతిబింబించక పోవచ్చుకాని నేటి సమాజపు మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తూనే వున్నది. నేటి సమాజం సంప్రదాయాలను, బంధనలను, నియమాలను ఉల్లంఘించటంలో ఆనందం పొందే సమాజం. స్థూలత్వం నుంచి సూక్ష్మత్వం వైపుకు పురోగమించే సమాజం. పరమాణు యుగపు సమాజం. మానసిక స్థిమితత తక్కువైన సమాజం. వివిధ ఆందోళనలతో ప్రశాంతిని కోల్పోతున్న సమాజం. ఒక్క మాటలో మనది మనోవైజ్ఞానిక సమాజం. మన ఆధునిక కళ ఈ తత్వాన్నే ప్రతిబింబిస్తున్నది. నేటి సమాజం వలెనే నేటి కళ కూడ స్థూలత్వం నుంచి సూక్ష్మత్వంలోకి రూపాంతరం చెందిన మనోవైజ్ఞానిక కళ. కనుక ఆధునిక కళ సమాజానికి ప్రతిబింబం కాదనేది సత్యంకాదు. అసలు ఏకాలంలోనైనా ఉత్తమ కళ తన కాలానికంటే ముందు నడుస్తుంది, తన కాలపు సమాజాన్ని ప్రతిబింబిస్తూనే. కళ పయనించే వేగాన్ని సమాజం అందుకోలేదు. నేడూ అంతే. ఆధునిక కళలోని రూపం లేని రూపాలు (Abstract Forms) ఆధునిక సమాజ మనస్తత్వాన్ని ప్రతిబింబించటమేకాక భవిష్యత్తుకు కూడా ప్రాతినిధ్యం వహిస్తున్నవి. కళ నేడు అందుకొన్నదాన్ని సమాజం రేపుకాని అందుకొనదు; రేపే అందుకొన జాలక ఎల్లుండి కూడ అందుకొంటే అందుకొన వచ్చు. ఇక్కడే సమాజానికి కళ పథప్రదర్శకురాలు అయేది.

## కళ ఎవరికోసం?

కళాకారుడు తన స్వీయానందం నిమిత్తమే కళాకృతులను సృష్టిస్తే సమాజం వాటిని అర్థం చేసుకోలేక పోవచ్చుకూడ. అందుకని సమాజం నిమిత్తమే కళాకృతులను సృష్టించటం ఏ విధముగా కుదురుతుంది? సమాజం అంటే ఒకే విధమైన, ఒకే మానసిక స్థాయి కలిగిన వ్యక్తుల సమూహంకాదు; వివిధ స్థాయిలుగల వ్యక్తులుంటారు సమాజంలో. ఎటువంటి స్థాయిగల వ్యక్తుల నిమిత్తం కళాకారుడు తన కళాసృష్టిని చేయాలి? ఒక స్థాయికి చెందిన వ్యక్తుల నిమిత్తం కళాసృష్టిచేస్తే ఆ స్థాయికంటే తక్కువ

(తరువాయి 53వ పుటలో)

# ముఖేముఖే సరస్వతీ

— కాళోజీ

నోట నోట మాటమ్మ !— లేనినాడు
నాల్గుదిక్కులందు వెలయు
నాలుగు మొగములు తలలు
కనులు చెవులుయెనిమిదేసి
(కనులెనిమిది చెవులెనిమిది)

కాని మాటలేనప్పుడు—లేనినాడు
వా వా వా వాల వాడు
వాక్కులేక అల్లల్లాడు
వాణిపుటుక తోనెవాడు
బ్రహ్మై భాషించినాడు

వాణి బైటబడెను ముందు
జ్ఞానమొదలె వాణియందు
వాణిబైట బడక ఆగ
నాల్గు నోళ్ళవాడు మూగ

తాతనోటి నాటినుండి
నా నాటికి నోటి నోటి
వాడుక వేడుక వాణికి
పరిమితి పూజ్యము దానికి

ముఖే ముఖే సరస్వతీ
నోట నోట మాటమ్మ

అక్షరశ్రీ విభూషా వాణీ!
నా నా వర్ణమాలినీ వాణీ!
అనంత పదశోభినీ వాణీ!
రసస్రోతస్విని, బ్రహ్మాణీ వాణీ!

భారతీ, శారదా, వాణీ
వీణా పాణినీ రాణీ

సంగీత సాహిత్య స్తనీ
మాతా రసమయీ, బ్రహ్మాణీ

ముఖే ముఖే సరస్వతీ
నోట నోట మాటమ్మ.

వడ్ల వంగడాలకన్న
మాట వంగడాలు 'తాన'
తాత తాన, నాతాన
నీతాన వాణి 'తికాన'

(వాని తాన)
(నోరే వాణికి తికాన)
(నోట నోట మాటమ్మ)

గిరిజనులకు గిరిజకన్న
మాటమ్మే కడు దగ్గర
జనతా జనార్దనునకు
చంచల శ్రీలక్ష్మి కన్న
మాటమ్మేకడు దగ్గర

చుట్టపు చూపుల వేడుక
'మాటమ్మ'ది
సర్వమంగళ పార్వతి
'దయాదృష్టి' వినుటెకాని
కనిఎరుగము.

మాటమ్మ మనుజులపై
ఎల్లప్పుడు మమత గలది
చనుబాలతో అబ్బి, మనము
చనిపొయ్యేదాక మనది.

ముఖేముఖే సరస్వతీ
నోటనోట మాటమ్మ

చెవిసోకిన వాణి 'శ్రుతి'గ
తల జొచ్చిన వాణి 'స్మృతి'గ
తాత నోటి నాటి నుండి
నానాటికి చలామణి

నిత్యనూతన సనాతన
వైభవోపేత వాణి
స్నేహ శీలా వరదాయినీ
ప్రసాద హృదయ శోభినీ,

ఎరుకలది,
తాతకెరుకజెప్పపాటి
ఎరుకలది,
మాటలది,

తాతనుమాటాడించిన
మాటలది,
నేర్పులది;
తాతకు వేదాలనేర్పు
నేర్పులది;
విద్దెలది,
నాటి నేటి రేపటివగు
విద్దెలది;

వేద, వేదాంగములందున
విదితమైన వేడ్కతోనె
జానపదుల నాల్కలపై
నాట్యమాడు నడవడిది.

రంగు రూపు వ్యత్యాసము
చేయక స్నేహించువాణి
కలిమిలేములను గనక
చనుకుడిపెడి తల్లి వాణి

పండిత పామర భేదము
ఎరుగని సహృదయ వాణి
అర్థాంతర లావణ్యము
చిందించెడి జాణ వాణి

గణపతికి, బృహస్పతికి
ఆదిశేషునకు, బ్రహ్మకు
మాటలు నేర్పిన మమతయె
మనయెడలను చూపెడిది.

పుట్టించుట ఘనమా? మాట
పుట్టించుట ఘనము, కాన
బ్రహ్మకన్న బ్రహ్మణి యె
ఘనురాలు ముమ్మాటికి.

నోటమాట లేక మనెడి
తాతయ్యకు, మాటలన్ని
నేరిపి, వేదము చెప్పగ
జేసిన ఘనురాలు వాణి

పుట్టి, మూగనోట మనుట
గిట్టుట కన్నను ఘోరము
ఆ పట్టున ఆదుకొన్న
వాణి కరుణ అపారము

అక్షరశ్రీ విభూషిత
పదవిన్యాస విలాసిని
పుటుకతోనె నాల్గునోళ్ళ
రాణించిన మారాణి.

అన్ని వర్ణములు వాణివి
పదములన్నియును వాణివి
గురులఘువుల లాఘవము
గుంభన, గుంఫన, వాణిది

అక్షర రమ్యత వాణిది
అమృత వర్షము వాణిది
తాతమాట, మాటతేట
పరచిన జ్ఞానము వాణిది

ముఖే ముఖే సరస్వతీ
నోట నోట మాటమ్మ.

పుటుకతోనె నాల్గునోళ్ళ
రాణించిన రాణి వాణి
యాసల విన్యాస విలాసిని
వాణీ సర్వత్ర సుభాషిణి

నానావర్ణములమాలతో
అనంత పదముల శోభతో
అర్థవంతమగుచు, వివిధ
రసము లొలుకజేయునది.

తాత నోటినుండి బైట
పడిన దాది నానాటికి
నోటనోట బైట పడుచు
నిగ్గు దేలు పరిపాటిది.

ప్రతినోటికి పట్టుబడియు
ఏ నోటను పడియుండక
రకరకాల యాసలతో
బైటపడెడి వైనాలది.

బహువిధ రూప విలాసిని
యాసల వయ్యారాలది
రామ చక్కదనాలది
పలుక్కుల సింగారాలది

తాతనాటి గోలె, కోట్ల
కోట్ల గొంతుకలు పెరలగ
జిహ్వాగ్రము నాట్యభూమి
జేసుక నర్తించు వాణి.

యాసల వయ్యారాలతో
అంద చందములు పుంజుక
వ్యంజన, వ్యంగ్యము, కాకువు
ప్రాభవమున వెలయురాణి

ఏమాటకు ఆమాట
ఒకటె కాని, దాని ఆట—
కోటి తీర్లు; మాటాడెడి
నోళ్లు కోట్లు, కోటాన కోట్లు

ముఖే ముఖే సరస్వతీ
నోట నోట మాటమ్మ

మాట 'చమక్కు'లకోగొని
చుక్క చుక్క తళుక్కుమను
సింగిణియును నేల ముట్టి
వర్ణమాల సొగసులగను.

తాత నోటి పలుకుల పస
నుడి కారము వాడి, వాడి
నానాటికి నుడుల వడితో
ముఖే ముఖే సరస్వతీ
నోట నోట మాటమ్మ

పండించిన పంటంతయు
తల, తల, తలపుల తీరు
వండించిన వంటంతయు
జిహ్వ జిహ్వరుచుల తీరు

వ్యంజనముల వెలితి ఏది
లేకుంటెనె సాహిత్యము
వలచిన రసమును తనదిగ
జేసి కొనుట రసికత్వము

తమ తమ రుచులను బట్టి
వడ్డన జేసిన విస్తరి
నుండి ఎన్నుకొని తినుట
విందుల సభ్యత—మాన్యము

అదిలోపము, ఇది అధికము
అని వగచుట అధమత్వము

ముఖే ముఖే సరస్వతీ
నోట నోట మాటమ్మ.

సర్వమంగళ సమేతుడు పరమేశుడు
శ్రీయుతుడు శ్రీమన్నారాయణుడు
సకల సృష్టికర్త బ్రహ్మ యిత్యాదులు
అక్షరాల వాగీశ్వరి పద జనితులు.

పదముల పదును చెమర్చగ
నుడికారము ఘాటొప్పగ
వడి, వాడి, వాడుక బడి
మాటల వేడుక తీరగ

నోట నోట మాటమ్మ
ముఖే ముఖే సరస్వతీ—











## నగర వార్తా చిత్రాలు

—న : పబ్లిక్‌గార్డెన్స్‌లో నవంబరు 14న జరిగిన బాలల దినోత్సవానికి ముఖ్య అతిథిగా ముఖ్యమంత్రి హాజరయ్యారు. ఆ సందర్భంలో శ్రీమతి రాఘవమ్మ బ్రహ్మానందరెడ్డి బాలబాలికలకు బహుమతులు పంచిపెట్టారు.

ఎడమవైపు : ముఖ్యమంత్రి నవంబరు 12 న స్వర్గీయ మాడపాటి హనుమంతరావుగారి భౌతికకాయంమీద పుష్పమాలను వుంచుతున్న దృశ్యం

కుడివైపు మధ్యలో : ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు నవంబరు 2న రెండవ అఖిలభారత హోంగార్డులు పౌరరక్షణ ఉద్యోగుల సమావేశాన్ని ప్రారంభించారు.

సమాచార, పౌరసంబంధశాఖామంత్రి, భారీ నీటిపారుదల శాఖామంత్రి, చిన్న నీటివనరుల శాఖామంత్రి తమ విదేశ పర్యటనానంతరం నవంబరు 13న హైదరాబాదు చేరుకున్నప్పుడు వారికి ఉపముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి స్వాగతం పలికారు.









## నగర వార్తా చిత్రాలు

ఎడమవైపు : ఆంధ్రప్రదేశ్ గవర్నరు నవంబరు 4న ఎగ్జిబిషన్ క్లబ్బులో జరిగిన స్వర్గీయ సేట్ జమనలాల్ బజాజ్ 81వ వార్షికోత్సవ కార్యక్రమంలో జ్యోతిని వెలిగించారు.

ఎడమవైపు మధ్యలో : రాష్ట్రగవర్నరు నవంబరు 14న శాంతి థియేటర్‌లో బాలల చలనచిత్రోత్సవానికి ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్ర సమాచార, పౌరసంబంధశాఖ మంత్రి యీ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

ఎడమవైపు క్రింద : భారతదేశంలో ఘనారాయబారి బౌసూన్‌షా నవంబరు 11న ముఖ్యమంత్రిని కలుసుకున్నారు.

పైన : ముఖ్యమంత్రి శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డి నవంబరు 1న రవీంద్రభారతిలో ఆంధ్రప్రదేశ్ నాటకోత్సవాలకు ప్రారంభోత్సవం చేశారు.

క్రింద : బెల్జియం పర్యాటక బృందం నవంబరు 2న గోలకొండ కోటను సందర్శించారు.



# నాగరికత : కొన్ని సమస్యలు

— కొడవటిగంటి కుటుంబరావు

మనం సాధారణంగా సంస్కృతి పట్లచూపే శ్రద్ధ నాగరికత గురించి చూపం. నిజానికి సంస్కృతి, నాగరికతలు జంటకవుల లాంటివి; ఒకదానినొకటి పూరిస్తాయి. సంస్కృతిలో చెప్పుకోదగిన మార్పులు రాకుండా నాగరికతను మార్చుకోవటం సాధ్యం కాదు. ఆటవికుణ్ణి తెచ్చి మన మధ్య తరగతి నాగరికతలో జీవించమంటే వాడికది సాధ్యం కాదు. మన మధ్యతరగతి వాణ్ణి ఏ రాజాంతః పురాలలోనో పెడితే ఉక్కిరి బిక్కిరయిపోతాడు. ఇందులో వింత ఏమి లేదు.

నాగరికతకు డబ్బు అనేది ఒక సాధనంగా పనికి వస్తుందన్నదీ భ్రమే. "నడుమ సిరివచ్చి కలసిన వెడగు బుద్ధు" లే కాలంలోనూ ఉన్నారు. ఈ కాలంలో అలాంటి వాళ్లు తమ సంస్కారాన్ని అడుగడుగున బయటపెడుతున్నారు. "రాతి గోడలు జైళ్లు కావు; ఇనుప కమ్మలు బోనూ కావు" అని ఇంగ్లీషులో ఒక పద్యం ఉన్నది. అలాగే ఏర్‌కండీషనింగ్ గల ఇళ్లూ, ఖరీదైన కారులూ, సారాబుడ్లూ, నైట్ క్లబ్బులూ సంస్కృతి కావు—నాగరికతా కావు.

## కృత్రిమ నాగరికత

కృత్రిమ నాగరికతకు మరొక అడ్డదారి పదవులు. ఇందుకు సాహిత్యంలో శాశ్వత నిదర్శనంగా నిలచి ఉన్నవాడు "మృచ్ఛకటికం" లోని శ్యాలకుడు. మనిషియొక్క సంస్కార హీనతను డబ్బుకన్నకూడ పదవి మరింతగా బట్టబయలు చేసేటట్టు కనిపిస్తుంది. డబ్బున్నవాడు తాగుతాడు, తందనాలేస్తాడు, భ్రష్టాజులను చేర్చుతాడు, విర్రవీగుతాడు. వాడి పీడ చాలావరకు వాడితోనే పోతుంది. కాని ఆ డబ్బుతో వాడు పదవులనుకూడా సంపాదిస్తే వాడు నిర్వహించే సాంఘిక పాత్ర దుర్భరంగా తయారవుతుంది.

పూర్వం ఒక స్కూలు సెక్రటరీగారు, "టెస్ట్ ట్యూబులు గాజువి కొంటే పగిలిపోతున్నాయి. రేకుతో చేయిస్తే సరిపోదా?" అని అడిగాట్ట. అది హాస్యాన్ని మించిపోలేదు.

కాని ఇంకా పెద్ద అధికారాలతో కూడిన పదవులు, ప్రజా జీవితాన్ని తీర్చిదిద్దదగినవి, ఏ కారణంచేత సంస్కారహీనుల చేతిలో పడినా తీవ్రమైన పరిణామాలు తప్పవు.

వ్యక్తుల విషయం వదిలేసి దేశం విషయం చూసినట్టయితే మన భారతదేశం మొత్తంగా సంస్కారంలేని నాగరికతను, కృత్రిమంగా తెచ్చిపెట్టుకున్న నాగరికతను, చాలా అనర్థాలను ఎదుర్కొంటున్నది.

మనం ఏర్పరచుకున్న రాజ్యాంగం మన ప్రజలలో నూరింట ఇద్దరికిమించి అంతుబట్టేదిగా కనబడదు. ప్రజాస్వామ్యంలో ప్రతి ఒకడికీ గల రాజకీయ హక్కులను ఎంతమంది ఎరుగుదురు? తమ ప్రతినిధిగా వెళ్ళేవాడికి ఉండదగిన అర్హత లేలాటివో ఎంత మందికి తెలుసు?

పార్లమెంటరీ డెమోక్రసీలో కులతత్వాలకూ, మతావేశాలకూ తావులేదు. దానివెనక నిజమైన బూర్జువా సంస్కృతి ఉంటేనేగాని పార్లమెంటరీ డెమోక్రసీ కొంచవరకైనా సక్రమంగా పని చెయ్యదు. బూర్జువా సంస్కృతిలో నిరక్షరుంకు తావులేదు.

## భౌతిక దృష్టి

భౌతిక దృష్టి పెరిగినకొద్దీ నాగరికత పెరుగుతుందన్న విషయం కూడా చాలామందికి తెలిసినట్టు కనబడదు. తన ఆహారంమీదా, ఆరోగ్యం మీదా, ఉత్పత్తి శక్తిమీదా, తన పరిసరాల మీదా, నిసర్గ వాతావరణం మీదా మానవుడికి అధికారం పెరిగినకొద్దీ నాగరికత పెరుగుతున్నది. మానవుడు తన జీవితాన్ని పూర్తిగా తానే శాసించుకునే రోజు ఏనాటికీ రాకపోవచ్చు. కాని ఒక దశలో తీరని సమస్యలుగా ఉన్నవాటిని మానవుడు మరొక దశలో తేలికగా పరిష్కరించుకొనగలుగుతున్నాడు. ఉదాహరణకు, నా చిన్నతనంలో మా కుటుంబాలవాళ్లు ఆయుర్వేద మందులే వాడేవారు. వాటితో నయంగాని రోగాలతో తీసుకునేవారు; చనిపోయేవారు. వాళ్ల ప్రాణాలు తీసిన అనేక రోగాలకు ఈనాడు మందులున్నాయి. అయినా ఈనాడుకూడా ఆనాడులాగే—అంతకంటెకూడా ఎక్కువగా రోగం రాగానే దేవుడికి మొక్కుకుని ముడుపులు కట్టేవాళ్లున్నారు; ఆధునిక ఔషధాలలో ప్రతిబింబించే నాగరికత అలాటి వాళ్ళ సంస్కృతిలో ప్రతిబింబించటం లేదు.

## మూఢ విశ్వాసాలు

మూఢ విశ్వాసాలనేవి ఏవి? భౌతిక విజ్ఞానం స్పష్టంగా ఖండించగలవి. భౌతిక విజ్ఞానాన్ని విసర్జించి మూఢ విశ్వాసాలనే

ఏర్ కండిషనింగ్ గల ఇళ్లూ, ఖరీదైన కార్లూ,
సారాబుడ్లూ, నైట్ క్లబ్బులూ సంస్కృతి కావు. నాగరికత కావు.

అంటిపెట్టుకుని ఉండేవాళ్లు సంస్కృతి నాగరికతలను వదిలేసుకున్న వాళ్లే. నిత్య జీవితంలో ఇలా మూఢ విశ్వాసాల మీద తమ జీవితాన్ని నడుపుకుంటూ వస్తున్న అభాగ్యులు కోట్ల సంఖ్యలో ఉన్నట్టు కనిపిస్తారు.

## తగినన్ని యిళ్లు లేవు

రాజకీయ. యంత్రాంగం పరిష్కరించదగిన సమస్యలతో మన దేశం తీసుకుంటున్నది ఇది తప్పనిసరి అని ఎవరూ అనలేరు. మన దేశంనిండా నూరేసి ఇళ్ళ ఖరీదు చేసే సినిమా హాళ్లున్నాయి, హోటళ్లున్నాయి; వెయ్యి ఇళ్ళ ఖరీదుచేసే హోటళ్లుకూడా ఉన్నాయి. తగినన్ని ఇళ్లే లేవు. పొలాలు చేసేవాళ్లు రెండు పూటలా తిండికి నోచుకోకపోయినా, నాగరికతకు దోహదం చేసే కార్మికులు హీనమైన అనాగరిక జీవితాలు జీవిస్తున్నా దేశంలో ఉన్నది కృత్రిమ నాగరికతే అనుకోవాలి. ఎక్కడో అమెరికాలో పాకీపని చేసేవాళ్లు కూడా సొంత కార్లలో పోతారనీ, ఇంగ్లండులో కార్మికుల సగటు ఆదాయం వారానికి 400 రూపాయల సమానమనీ, ఆ దేశాల లాగే మనమూ అభివృద్ధి అవుతున్నామని అనుకోవటం హాస్యాస్పదం. ఆ దేశాలు నాగరికతను క్రమబద్ధంగా నిర్మించుకున్నాయి. మన దేశంలో మనం ఆటవిక లక్షణాలను సైతం ఆచారాల పేర పట్టుకు వేళ్ళాడుతున్నాం.

## ప్రజా చైతన్యం

సోషలిస్టు దేశాలు మరొక రకం నాగరికతను అవలంబించాయి. దేశం మొత్తంగా అభివృద్ధిలోకి శీఘ్రంగా రావటానికి ఈ నాగరికత ఉపకరిస్తుందని గుర్తించి మననాయకులు "సోషలిజం" మన ధ్యేయమని ప్రకటించారు. కాని మనం దాన్నికూడా కృత్రిమంగానే అమలు జరుపడానికి పూనుకున్నాం. సోషలిస్టు వ్యవస్థ ఏర్పరచటానికి ప్రజా చైతన్యం అపారంగా కావాలి.

మన దేశాన్ని నడిపిస్తున్నది ఏ ఒక సంస్కృతీ కాదు. మనకు ఒక నాగరికత అంటూ లేదు. ఉన్న నాగరికత అంతా ఎరువు సరకు. మనకున్న సమస్యలు ఆ నాగరికతకు సంబంధించినవి కావు.

## నాగరిక దేశాలలో సమస్యలు

ప్రతి నాగరికతకూ దానికి అనుగుణమైన సమస్యలుంటాయి. ఈనాడు నాగరికత దేశాలను పీడిస్తున్న ఒక ప్రముఖ సమస్య వాతావరణ కాలుష్యం (Air Pollution), ఇతర కాలుష్యాలూ. కార్లూ, ఫ్యాక్టరీ గొట్టాలూ గాలిలోకి అపాయకరమైన పదార్థాలను పంపకం చేస్తున్నాయి. జెట్ విమానాలు రొదచేసి పౌరుల నరాలు తెంచుతున్నాయి. రేడియో ధార్మిక శక్తి వచ్చాక వాటి తాలూకు కాలుష్యం ఒకటి సమస్య అయింది. క్రిమిసంహారకాలు వచ్చాక ఆ విషాలు మానవ శరీరాలలోకీ, మానవులు తినే జంతువుల శరీరాలలోకీ ప్రవేశించి జన సామాన్యానికి ప్రమాదం కలిగిస్తున్నాయి. ఈ విధంగా మనం అత్యుత్తమ నాగరికత అనేది కొన్ని తీవ్ర సమస్యలను ఎదుర్కొంటున్నది. ఏ నాగరికత అయినా తాము తెచ్చిపెట్టుకున్న సమస్యలను తానుసాధించిన విజ్ఞానంతోనే పరిష్కరించుకుని ముందుకు పోవాలి. లేనిపక్షంలో అది వినాశనానికి గురికాక తప్పదు.

## మన సమస్యలు

మనకున్న సమస్యలు—దారిద్ర్యమూ, అజ్ఞానమూ, నిరక్షరతా, అనారోగ్యమూ, తిండిలేమీ, గమ్యంలేని రాజకీయాలూ, మూఢమైన విద్యావిధానమూ, అంతకన్న మూఢమైన జీవిత విధానము—ఇవి ఏ సంస్కృతి నుంచి ఏర్పడిన సమస్యలో ఊహించటం కష్టంగా ఉన్నది. ఇవ్వన్నీ మన దేశంలో ప్రజాతంత్రంలేని కాలంలో ఉన్నవే.

చిత్ర మేమిటంటే దాదాపు అన్నిసమస్యలూ ప్రజా తంత్రం వొచ్చాక మరింత తీవ్రమయాయి. మతోన్మాదమూ, కుల తత్వాలూ లంచగొండితనాలూ మొదలైనవి అనేకరెట్లు పెరిగాయి. జాతీయోద్యమంలో కులమత భేదాలు దాదాపు పోవటమూ, దారిద్ర్యం ఇంతదుర్భరంగా తోచక పోవటమూ నాతరం వాళ్లం ఎరుగుదుము. అనాడున్న సంస్కృతిలో ఈనాడు సగంకూడ ఉన్నట్టు కనబడదు. నాగరికత మాత్రం పెరిగినట్టు కనబడుతుంది. ఇది ఎలా సాధ్యమయింది?

దీన్ని గురించి మేధావులందరు ఆలోచించవలసి ఉన్నది. మన జాతీయ జీవితవృక్షానికి వేరుపురుగులు చాలాచేరాయి. వాటిని విజ్ఞానంతో నిర్మూలిస్తేగాని ఈ చెట్టు బాగుపడదు. జీవితం అన్ని రంగాలలోను వైజ్ఞానిక దృక్పథము, భౌతిక వాదమూ ప్రవేశించి తన ప్రభావాన్ని చూపాలి. లేని పక్షంలో అవ్యవస్థ తీవ్రతరం కాక తప్పదు.



సంస్కృతి, నాగరికతలు జంటకవుల లాంటివి.
ఒకదాని నొకటి పూరిస్తాయి.

# ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన సంక్షేమం

ఆంధ్రప్రదేశ్‌లో గిరిజనుల జనాభా సుమారు 15 లక్షలు వుంది. ఈ ప్రజల సాంఘిక ఆర్థిక పరిస్థితులు భిన్నంగాను దుర్బలంగాను వుండడంవల్ల, వారు ఇతర ప్రజలతో లాభసాటిగా లావాదేవీలు జరుపుకోలేకపోతున్నారు. అందువల్ల గిరిజనులను అభివృద్ధిచెందిన ప్రజలు స్వార్థప్రయోజనాలకు ఉపయోగించకుండా వుండేవిధంగా గిరిజన సంక్షేమ కార్యక్రమాలను చేపట్టవలసి వుంటుంది.

గిరిజనులు సాంప్రదాయికంగా సేకరించే ఆటవికవస్తు సంపదను విక్రయించే విషయంలోనూ, ఇతరచోట్లనుంచి వారికి కావలసిన వస్తువులను సమకూర్చే విషయంలోనూ, గిరిజనుల ప్రయోజనాలను కాపాడే ఉద్దేశంతో ప్రభుత్వం గిరిజన సహకార సంస్థను ఏర్పాటుచేసింది. ఈ సంస్థకు రెవిన్యూబోర్డు సభ్యులు అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు. ప్రాథమిక సహకార సంస్థలలో గిరిజనులు మాత్రమే సభ్యులుగా ఉంటారు. ఇట్టి సంఘాలు ఆంధ్ర ప్రాంతంలో 11, తెలంగాణా ప్రాంతం లో 6 వున్నాయి. గిరిజన సహకార సంస్థ కార్యకలాపాలను తెలంగాణాలోని ఆదిలాబాదు మహబూబునగరం జిల్లాలకుకూడా విస్తరింపచేయాలని సంకల్పించ బడింది.

## సంస్థ నిధులు

గిరిజన సహకార సంస్థ గిరిజనులు నిర్ణీత అడవులనుంచి సేకరించే వస్తువులను అనుబంధ సహకార సంఘాలద్వారాకొని మార్కెటులో వాటి విక్రయాలకు తగిన ఏర్పాట్లు చేస్తుంది. ఈ సంస్థ గిరిజనులకు కిరసనాయిలు, సుగంధద్రవ్యాలు, అగ్గిపెట్టెలు, ఎండుమిరపకాయలు, ఉప్పు, బియ్యం, చిన్నకాయధాన్యములు వగైరా పదార్థాలను సరసమైన ధరలకు సరఫరా చేస్తుంది. అంతేకాకుండా, గిరిజనులకు రు. 5 ల నుంచి రూ. 50 ల వరకు రుణ సౌకర్యం కూడా కల్పిస్తుంది. గిరిజనులకు జీవనోపాధి కల్పించే వివిధ కార్యక్రమాలను అమలు జరుపుతుంది. గత మూడేండ్లుగా ఈ సంస్థ సాలీనా సుమారు కోటి రూపాయల విలువగల వ్యాపారం కొనసాగిస్తున్నది.

గోదాముల నిర్మాణం, బియ్యం సబ్సిడీ మున్నగు వాటికొరకు ప్రభుత్వం ఈ సంస్థకు 1969-70 లో సుమారు 16.70 లక్షల మేరకు ఆర్థిక సహాయం చేసింది. అంతేకాకుండా గిరిజనులకు స్వల్పకాలిక రుణాలు ఇచ్చేందుకు రూ 25 లక్షల గ్రాంటు కూడ ఇచ్చింది. ప్రభుత్వ హామీపైన రాష్ట్ర సహకార బ్యాంకు నుంచి ఈ సంస్థకు రూ. 15 లక్షల రుణం లభించింది. గిరిజనులకు రుణాలు మంజూరు చేసేందుకు ఈ సంస్థకు నగదు పరపతి సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం కృషిచేస్తున్నది.

ప్రయివేటు రుణదారుల పీడలనుంచి గిరిజనులకు తగిన రక్షణ కల్పించే ఉద్దేశంతో 1960 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ గిరిజన రుణ నివారణ శాసనాన్ని తయారు చేయడం జరిగింది. ఈ శాసనం ప్రకారం అప్పులను తగ్గించి, చెల్లించవలసిన వడ్డీ రేటుకు పరిమితి నిర్ణయించబడింది. అంతేకాకుండా గిరిజనులు తాకట్టు పెట్టిన వస్తువులను విడుదల చేసి, అప్పులివ్వడానికి లైసెన్సింగు పద్ధతి ప్రవేశ పెట్టబడినది. గిరిజనులకు ఇతోధిక సహాయం చేసేందుకై, వారు చేసిన అప్పులకు వడ్డీ లేకుండా, కేవలం అసలుమొత్తం మాత్రమే చెల్లించడానికి వీలుగా ప్రభుత్వం ఒక కొత్త నిబంధనను రూపొందించింది. ఈ నిబంధన అమల్లోకి వచ్చిన తేదీ నాటికి చెల్లించవలసిన వడ్డీ మొత్తం చెల్లించినట్లుగా పరిగణింప బడుతుంది. ★

---

( 5వ పేజీనుండి )

ధాన్యపు దినుసులు, అపరాలు పుష్కలంగా పండి గాదెలు నిండే సమయం మకర సంక్రాంతి సమయం. బంతులు, చేమంతులు దివ్యశోభతో మనస్సులో మధురం చిందించే మంచి సమయం మకర సంక్రాంతి సమయం. ఆవులు పొదుగులు నిండి తువ్వాయిలు నులివెచ్చని ఎండలో ఉల్లాసంతో తుళ్ళగింతలు పెట్టుతూ ఉంటాయి. గునపాలూ, పారా, కొడవలీ, బడితే మొదలైన పనిముట్లకు పని తీరుతుంది. దుక్కి, నూర్పిడి పనులు చేసిన ఎద్దులకు ఆటవిడుపు. కృషి ఫలించినందుకు కార్యసిద్ధివలన కలిగే ఆనందం, భగవంతుడు అనుగ్రహించిన సమృద్ధికి కృతజ్ఞత: దయాదరణలకూ, దానధర్మాలకూ దోహదం కలిగే కల్యాణవేళ సంక్రాంతివేళ.

"ఈ నువ్వులూ, ఈ పంచదారా తీసుకొండి. మధురంగా మాట్లాడండి." అని సంక్రాంతినాడు మహా రాష్ట్రులు అనడం సంప్రదాయం. నువ్వులలో నూనె ఉంది సంస్కృతంలో స్నేహం అనే శబ్దానికి నూనె అని అర్థం ఈనాడు సౌహార్ద్ర పూర్వకంగా నువ్వులూ, పంచదారా పంచిపెట్టి అవి స్నేహ పూరితమైన సంబంధాలకు దోహదం చేయాలని కోరుకొందాం. సంక్రాంతి పుణ్యదినాన్ని పురస్కరించుకొని సంఘంలో అపేక్షింపవలసిన ఆనందం, అనురాగం కంటె అధికమైనది ఇంకేముంటుంది ?

# వందేమాతరం

## ముదిగొండ వీరభద్రమూర్తి

[ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ వీరుల తరువాత భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించిన తొలి విప్లవ వీరుడు పూనా నివాసి. శ్రీ వాసు దేవ బలవంతఫాడ్కే. ఇతనిని అక్కడి ప్రజలు "బాబా" అని పిలిచేవారు. రోహిలా సైన్య సమీకరణ కోసం గుల్బర్గా జిల్లాలోని "గాండ్గాపూరు" పోయి అచ్చట జరిగిన రహస్య సభలో ఆ వీరుడు చేసిన ఉపన్యాస ఘట్టం యిది. "వందే మాతరం" అనే అముద్రిత కావ్యంనుండి గృహీతము]

ఆడువారికి పతిభక్తి తోడుగ మగ
వారికిన్ దేశభక్తిని నూతిపోయ
రైరి భారత మేధావు లటుల గాగ
దేశవిద్రోహి సంఖ్య విస్తీర్ణ మయ్యె.

చితి నెక్కించిరి సతులన్
మతిహీనులు తొల్లి వారి మారుగ నీ ద్రో
హితతిని గాల్చిన నెపుడో
స్వతంత్రత లభింపకున్నె ప్రజ కీ మహిపై.

మరియు భేష్ భేషటంచు పొంపిరి ధ్వనించు
వారితో నిట్లు పలికె బాబా, పరాయి
యేలు బడి క్రింద నుండుట యెపుడు నగ్ని
పర్వతము మీద నుండుట వంటి కీడు.

ఇట్టి కీడు స్వతంత్రత యెనయ పోలియు
నెండచే వాన పడి పంట పండు, పంట
వలన ప్రజ, ప్రజ నేకభావము రహించు
దాన శక్తి, శక్తిన్ స్వతంత్రత జనించు.

రాజకీయ దాస్యమ్మున మ్రగ్గినంత
కాలమును శక్తి సామర్థ్య ఘనత లేదు
మబ్బు పట్టిన యెడ దిన మధ్యకాల
చండ భాను సంధృష్ణియు చవట కాదె!

ఇనుపగని భరత ఖండా
వనిగర్భము నందె కలదు ప్రజరొమ్మిపు డా
గని యగుచు ఖంగు ఖంగున
నినదింపన్ వలె పరాసి నిహితక్షతులన్,

గ్రామ గ్రామ పురీ పురీ పథ పథాఖండ స్థలీ భండనో
ద్దామంబై ప్రజమారు కొట్టి ప్రభుతన్ దాటించుచుచో నీ రసా
సీమన్ శాంతి సజీవ శాంతి యపుడే సీద్రమ్ము గేహమ్ములో
సీమై శాంతి శ్మశాన శాంతియ కదే! యెన్నాళ్ళు జీవించినన్.

ఐదవవంతుగా జగతినైన జనమ్ము త్రయోద శాంశ మౌ
మేదిని నుండు వారలకు మేకొని సేవలు సేతకన్న నిం
కేది తృతీయ పుంబ్రకృతికిన్ తగు మూదల? నేటికేని యే
కాదృత బుదితో తఱుముడా! పగఱం బ్రజలార! శస్త్రులై.

తొలుతన్ గ్రీకులు మత్తు రోమనులు తద్దోస్సారముల్ ద్రొంక నాం
గ్లుల మూదృక్పరపాలకా వశికి మ్రొక్కుల్ మ్రొక్కి తచ్చాసన
చ్ఛల పల్యంకిక మోయుటల్ తగునె యార్యశ్రీలకున్? లెండు సూ
రులు! పాతాళమునందు ద్రోయుదము సర్వోగ్రమ్ము నీ యేల్బడిన్.

నేనింద్రుండను మీరు దేవతలు లెండీ? త్రుంపగా నన్య మౌ
ఘూనా థత్వము పేరి వృత్రతనువుం బోరన్ జయం బందనో
నేనే నాటి దధీచి నా యొడలి వెన్నెమ్మున్ శతారమ్ముగా
బూనన్వచ్చు జయింపవచ్చును చమూముఖ్యం దెవండేనియున్.

ఈ యావేశ మనన్య
స్సాయ మనుచు బ్రతుకదు పరపాలన మెన్నా
ళ్లో యనుచు గేకిసలతో
మాయురె యను వారికి కడమాటగ బాబా.

ఎంత ప్రగతి నొందె? నింత లేదు జపాను
పరకబంధపాణి పట్టు పడక
భారతమ్ము నటులె పఱగింత మీరెల్లి
తోడుపడుడు భటులతోడ నాకు.

# తిరుపతి వెంకటకవులు : ప్రజాకవులు

## —దివాకర్ల వేంకటావధాని

కవితా దృష్టితోఁ బరికించినచో నాంధ్రవాఙ్మయము నందలి యాధునిక యుగమునకు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులను మార్గదర్శకులని చెప్పవచ్చును. వారు విద్వత్కవివతంసులై శతాధిక గ్రంథములు రచించి ప్రఖ్యాతి నొందుటయే కాక ప్రసిద్ధులైన పలువు రాధునిక కవులకు ప్రత్యక్షముగనో పరోక్షముగనో గురువులై యుండుట కూడ నిందుకు కారణము. "చెళ్ళపిళ్ళ వెంకన గురువంచుఁ జెప్పుకొనఁగా నొక గొప్ప తెలుంగునాడునన్" అని కవి సామ్రాట్టులు చెప్పుటలో నతిశయోక్తి లేశమైనను గానరాదు.

ఆంధ్ర వాఙ్మయమున నంది మల్లయ, ఘంట సింగనలు మొదటి జంటకవులు. ఆధునిక యుగమున నాంధ్రదేశమందు పలువురు జంటకవులు వెలసినారు. వారిలో ప్రతిభా వ్యుత్పత్తులందును, అభిధా హృదయములందును శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులకు వలె సహజమైన సామరస్య సంపద సమకూడిన వారరుదు. ప్రసన్నమైన కవితాధార చేతను, అవిరతాష్ట, శతావధానముల చేతను, ఆశుకవితా ప్రదర్శనముల చేతను, నానారాజ సందర్శనముల చేతను ఆంధ్ర కవిత్వము నాంధ్రదేశమున సర్వజనాను భోగ్యమొనరించిన ప్రశస్తి వారికే దక్కును. వారు తాము దర్శించిన ఛోట్లనెల్లఁ గవితా చైతన్యమును గెరలించి వానిని సారస్వత మహాక్షేత్రములుగాఁ దీర్చి దిద్దియుండిరి. ఆ రోజులలో వారి సంపర్క భాగ్యము చేకూరిన వారెవ్వరును గవులు కాకపోలేదు. అద్యతనాంధ్రకవి ప్రపంచ నిర్మాత లన్న బిరుదము వారియెడ నన్వర్థమైనది.

### పాతకు భరతవాక్యం - నవీనతకు నాంది

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ప్రమోదూతనామ సంవత్సర శ్రావణమాసమందును, శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు ప్రజోత్పత్తినామ సంవత్సర ఫాల్గుణ మాసమందును జన్మించి యుండిరి. ఈ విధముగా వయస్సునందుఁ గూడ వారిరువురికి సార్థైక సంవత్సరము కంటె నధిక వ్యత్యాసము లేదు. ఆ రోజులలో 'కాశీ పండితులును, షట్ఛాస్త్ర పారంగతులునై ధవళేశ్వరమున విద్యార్థులకు భోజన విద్యా సత్రము సాగించిన శ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రివారి యొద్ద వారు వ్యాకరణ శాస్త్రము నభ్యసించిరి. ఈ సతీర్థ్యత్వము తొలుత సౌహృదమునకును దరువాత సహకవిత్వమునకును దారి చూపినది. వారు మొదట సంస్కృతమునందే కవిత్వము చెప్పినను దరువాత తెనుఁగు నందును కవిత్వము చెప్పుట కారంభించి కావ్యములు, నాటకములు, వచన గ్రంథములు, విమర్శలు పెక్కు వెలయించిరి. 1919 వ సంవత్సరమున శ్రీ తిరుపతి శాస్త్రిగారు దివంగతులైన పిమ్మట శ్రీ వేంకటశాస్త్రిగారొక్కరు రచించిన గ్రంథములు కూడ కొన్ని యున్నవి. కాని "ఒక్కరు రచియించిరేనియును గాదగుఁ దిర్పతి వేంకటీయమై" యని వారు చేసుకొన్న సమయము ప్రకారమన్నియు తిరుపతి వేంకటేశ్వర ప్రణీతములుగానే ప్రసిద్ధి వడసినవి. వారి రచనలో ప్రాచీన నవీన గుణద్వితయము మేళనము పొందినది. అందుచేతనే వారి కవిత్వము ప్రాచీన కవిత్వమునకు భరత వాక్యమును, నవీన కవితకు నాందీ వాక్యమును పఠించినదని చెప్పు విమర్శకుల వాక్య మత్యంత సత్యసముపేతమైనదని భావింపవచ్చును.

### సంస్కృత రచనలు

శ్రీ తి. వేం. కవులు తొలుత కాశీ సహస్రము, ధాతురత్నాకరము, శృంగార శృంగాటకము, కాళికాద్యష్టకములు మున్నగు సంస్కృత గ్రంథములు రచించిరి. తరువాత శుకరంభా సంవాదమును మొదట సంస్కృతమున నంతరించి పిమ్మట తామే యందలి శ్లోకములకు తెలుఁగు పద్యములుగూడ వ్రాసిరి. ఇవిగాక అవధాన సమయములందును, రాజసందర్శన సందర్భము లందును వారు చెప్పిన సంస్కృత శ్లోకము లనేకము లున్నవి. వారివలె సంస్కృతాంధ్రములు రెండింట ననర్గళముగాఁ గవిత సాగించినవారి సంఖ్య చాల తక్కువ.

వారి కవిత్వము ప్రాచీన కవిత్వమునకు భరతవాక్యమును,
నవీన కవితకు నాందీవాక్యమును పలికించినవి

## దేవీ భాగవతం

శ్రీ తి. వేం. కవులు సంస్కృతము నుండి ఆంధ్రీకరించిన యుద్గ్రంథములలో దేవీ భాగవత పురాణ మొకటి. ఇందలి నవమ దశమ స్కంధములలోఁ గొందఱితరుల రచన కూడా నున్నది. గ్రంథము విస్తృతమగుట చేతను. పైవారికిఁ గూడ గ్రంథకర్తృతా గౌరవము కలిగింపవలెనను వాత్సల్య ప్రేరితమైన కుతూహలము చేతను వారాయా భాగములను వారిచే వ్రాయించియుందురు. శ్రీ. తి. వేం. కవుల యాంధ్రీకరణము సరళమై సర్వసుబోధమై అనువాదమయ్యు స్వతంత్ర గ్రంథమువలె సాగిపోవును. దేవి యవతారములును, దుష్టశిక్షణ శిష్టరక్షణ పరాయణత్వమును అందు చక్కగా వర్ణింపబడినవి. మంత్రశాస్త్ర రహస్యములతో గూడిన యా పురాణమును సమర్థతతో తెనిగించి శ్రీ తి. వేం. కవులొక వంక శాస్త్రపాండిత్యమును వేరొకవంక కవితానైపుణ్యమును వెల్లడించియుండిరి.

## శ్రీనివాస విలాసం

శ్రీ తి. వేం. కవులు రచించిన పద్యప్రబంధములలో లక్షణా పరిణయము, శ్రవణానందము, పాణిగృహీత, బుద్ధచరిత్రము, శ్రీనివాసవిలాసము మున్నగునవి ముఖ్యములైనవి. ఇందు శ్రీనివాస విలాస మాపేరుగల శబ్దార్థాలంకారమయమును ప్రౌఢమునైన సంస్కృతచంపువున కనువాదము. శ్రీ ఆత్మకూరు మహారాజు గారి కోరికపై వారు క్లిష్టమైన యా కావ్యము ననతికాలముననే ప్రౌఢ సుందరముగా ననువదించి యపార గౌరవసత్కారముల నందిరి. ఈ యనువాదము శ్రీ తి. వేం. కవుల పాండితీప్రతిభలకు చక్కని నిదర్శనమయ్యు చిత్రకవితామయమైనదగుటచే దేశమున నంతగా వ్యాప్తి పొందియుండలేదు. లక్షణాపరిణయము శ్రీకృష్ణుఁడష్టమహిషులలో నొకతెయైన లక్షణను వివాహమాడిన వృత్తాంతముతోఁగూడిన ప్రబంధము. దీనిని శ్రీ తి. వేం. కవులాశువుగా జెప్పినట్లు కృతిపతివాక్యములనుబట్టి తెలియుచున్నది. ఇందు మను, వసు చరిత్రాదులందలి పద్యముల యనుకరణములు పెక్కు కనుపించును. "తా బృహత్సేనుఁడై తనరువాఁడయ్యు బృహత్సేనసుతకునై యాసచేయు", "చలమాననేల మలయాచలమారుత మావియోగ చలమానినులన్ బలమాఱఁజేయు టిదియొక బలమా" మున్నగు పద్యములిందుకు నిదర్శనములు.

## సాంఘిక ప్రబంధములు

శ్రవణానంద పాణిగృహీతలు సాంఘికప్రబంధములు. శ్రీ తి. వేం. కవులిందు సాంఘికమైన వస్తువును గ్రహించి, యనవసరములైన వర్ణనలు తగ్గించి, శబ్దాలంకారచిత్ర కవితా పద్ధతులకు స్వస్తిచెప్పి, వీనిని సహృదయ హృదయరంజకముగా సంతరించియుండిరి. వీనియందు వారు శృంగారరసపోషణమునకే యధిక ప్రాధాన్యము నొసంగినను నీత్యుపదేశములనుగూడ దృష్టి యందిడుకొనియుండిరి. "విటులకు బుద్ధివచ్చుగతి వేశ్యలకుం దలవంపుగా విశంకట పదగుంభనమ్ములనుగాక కడున్ సులభంపు శైలి" ప్రబంధము రచింపుమని కృతిపతి తమ్మడిగినట్లు వారా పాణిగృహీతలో తెల్పియుండిరి. "మనమా ! వద్దిఁకనాదుమాట వినుమా మర్యాదగాపాడుమా"యను మకుటముతోఁగూడిన శ్రవణానందము నందలి పద్యములు నీతి గర్భితములై మనోహరములుగా నున్నవి. "రైకదాటియు బనారసుకండువా దాటి గబ్బి గుబ్బల కాంతి గంతులిడఁగ" "తడఁబాటుచేత చే యొడిసి పట్టి కటాక్షముంచుమాయన నాలకించనైతి" "మొదట నేనన్నచో మొగము నెత్తనివాఁడు క్రమముగా మోమెత్తికాంచఁ దొడఁగె" మున్నగు శ్రవణానందము నందలి వర్ణనలు నూతనములు హృదయంగమములునై యింపు నింపుచున్నవి. ఈ రెండు ప్రబంధముల నొకవిధముగా సారంగు తమ్మయ వైజయంతీ విలాసముతో సరిపోల్చవచ్చును.

## బుద్ధ చరిత్రము

బుద్ధ చరిత్రము వస్తువుచేతను, వర్ణనాదులచేతను, రచనా విన్యాసముచేతను మిక్కిలి యుదాత్తమైన కావ్యము. సంస్కృతమున అశ్వఘోషుండు రచించిన బుద్ధ చరితము, ఆంగ్లమున ఎడ్విన్ ఆర్నాల్డు రచించిన "Light of Asia" అను కావ్యముల నాధారముగా జేసికొని శ్రీ తి. వేం. కవులీ ప్రబంధమును రచించిరి. సిద్ధార్థుఁడు భార్యా పుత్రులను, పురమును వీడి సన్యసించుట, తానెక్కి వచ్చిన యశ్వమును, సారథియైన చెన్నుని వీడ్కొల్పుట మున్నగు ఘట్టము లెంతో రసవంతములై పాఠకుల హృదయములను ద్రవింపజేయును.

ఒక కొంతేగును సంశయించును సముద్యుక్తత్వముంబూను వే
ఱొక కొంతేగు యథాస్థితింగను నిరుద్యోగంబు వాటించు వె
న్కకుఁదో తెంచుట కిచ్చగించునట సన్యాసార్థమే యౌనుగా
కకటా యెవ్వనికేని శక్యమగునా యర్థాంగి వర్జించుటల్

అను పద్యము భార్యనుజ్జగించి సన్యాసి కాఁబోవు సిద్ధార్థుని చిత్తవృత్తిని చక్కగాఁ జిత్రించుచున్నది. శ్రీ తి. వేం. కవుల కవితా కౌశలమున కెత్తిన కమనీయ పతాక యనఁదగు రసవత్కావ్యము బుద్ధ చరిత్రము.

## మొదటి స్వీయ చరిత్ర

ఏలా మాహాత్మ్యము తూర్పు గోదావరీ మండలమందలి యేలేరు మహాత్మ్యమును వర్ణించు తీర్థ మహాత్మ్యము. ఇది

"చెళ్లపిళ్ల వెంకన గురువంచు చెప్పుకొనగా
నది గొప్ప తెనుంగు నాడునన్"

యాకృతిని జిన్నదయ్యు రచనయందు జిగిబిగి కల్గి యొప్పారు చున్నది. "చతురాస్యుండు కళాకరుండు ... సర్వరాయనికిఁ బాటించుం జిరాయుష్యముల్" అను నారంభ పద్యమున బ్రహ్మకును చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారికిని అన్వయించునట్లు రెండర్థములు సమకూర్పఁబడినవి. పైని పేర్కొనఁబడిన పద్య కావ్యములనే కాక శ్రీ. తి. వేం. కవులు రసికానందము, శనిగ్రహము మున్నగు లఘు కావ్యములను, కామేశ్వరీ శతకము, ఆరోగ్య కామేశ్వరి యను శతకములను గూడ రచించి యుండిరి. బొబ్బిలి పట్టాభిషేకము, పతివ్రత, శివభక్తి, సుశీల, గోదేవి మున్నగునవి శ్రీ తిరుపతిశాస్త్రిగారు కీర్తిశేషులైన యనంతరము శ్రీ వేంకటశాస్త్రి గారొక్కరే రచించిన పద్యకావ్యములు. శ్రీ వేంకటశాస్త్రిగారు తమస్వీయ చరిత్రను జాతక చర్యయను పేరపద్యరూపమున రచించిరి. పద్యమయమేయయ్యు నాంధ్రవాఙ్మయమందలి మొదటి స్వీయచరిత్ర యిదియే యని చెప్పవచ్చును.

శ్రీ తిరుపతి వేంకటకవులు పలువురు రాజులను దర్శించినప్పుడు చెప్పిన పద్యములన్నియు నానారాజ సందర్శనమను పేర గ్రంథరూపమున ముద్రింపబడినవి. అవి వారిభావబంధురతను, ఆశుకవితా కౌశలమును, సమయస్ఫూర్తిని వెల్లడి చేయుచు నత్యంత రమణీయములుగానుండును. కలగూరగంప యను గ్రంథమున వారు వివిధ సందర్భములందు ప్రస్తావ వశమునఁజెప్పిన పద్యములన్నియు గ్రహింపబడినవి. వారొనర్చిన అష్టశతావధానము లందలి సమస్యావర్ణనాదులు పెక్కు శతావధాన సారమను గ్రంథము రూపమున బ్రకటింపబడినవి.

## వాగ్యుద్ధములు

శ్రీ తి. వేం. కవులరచనలలో గీరతము, గుంటూరు సీమ, విక్రమ చెళ్ళపిళ్ళ, జయంతియనునవి విలక్షణములైనవి. ఇవి సమకాలికులైన కవులతో వారొనర్చిన వాగ్యుద్ధములను వర్ణించు వీరరసప్రధానములైన గ్రంథములు. వేంకటరామకవులు, కొప్పరపు కవులు, మ. మ. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలవారు అను వారితో జరిగిన వాగ్వాదములే వానియందలి వస్తువులు. అందలి కవిత్వము ధారాళమై రసభరితమై చదివిన కొలంది చదువవలెనను నాసక్తి కలిగించుచుండును. వాగ్వివాదములు సహజముగా నిరసింపదగినవేయయ్యు పై గ్రంథములా రోజులలో నాంధ్ర దేశమున నపూర్వకవితా చైతన్యమును గలిగించి పలువురి మన్ననల నొందఁజాలినవి.

> చుక్కలురాలలేదు, రవిసోముల పోకడ మాఱలేదు, న
> ల్దిక్కులు కూలలేదు, జలధి జ్వలనంబుబుకంగలేదు, నేఁ
> డక్కట రామకృష్ణ కవులర్భకు లేగతి సేయనేరురా
> దిక్కృతవైరి వేంకట సుధీమణి మౌళికి శృంగభంగమున్

మున్నగు పద్యములు పరికించిన నా గ్రంథముల స్వభావమును, అందలి కవితారీతియు దేటతెల్లములుకాఁగలవు.

శ్రీ తి. వేం. కవుల కీర్తి సౌధమునకు మూలస్తంభము లని చెప్పదగినవి వారి నాటకములు. వారు సంస్కృతము నుండి ముద్రారాక్షస మృచ్ఛకటిక బాల రామాయణముల నాంధ్రీకరించి యుండిరి. ఇవి యనువాదములయ్యు స్వతంత్ర నాటకములవలె భాసిల్లుచు రసానంద సంధాన దక్షములై సహృదయులనలరించుచుండును. ఎడనెడ వారించుక స్వతంత్రించి అనువదించినచోట్లును, మూల శ్లోకములందలి భావములు తెలుగు పద్యములకు సరిపోనప్పుడు సొంత వాక్యములు చేర్చిన చోట్లును గొన్ని గలవు. వీనిలో మృచ్ఛకటికము పెక్కు నట బృందములచే బ్రదర్శింపఁబడి ప్రశస్తి వహించినది. "దాక్షిణ్యోదక వాహినీ విగళితా-యాతా స్వదేశం రతిః" ఇత్యాది శ్లోకమునకు అనువాదమైన దాక్షిణ్య జలమున దరులు ముంచుచుఁబాఱు పొడుపుటేరా యెండిపోతివయయ్యో, తనలోకముత్యజించి చనుదెంచిన రతిసతిపోతివటవె స్వదేశమునకు" అను పద్యమును జూచిన వారి యనువాద విధానమును స్థాలీపులాక న్యాయమున గ్రహింపవచ్చును.

## పాండవోద్యోగ విజయములు

సుకన్య, దంభవామనము, అనర్ఘ నారదము, పండిత రాజము, ఎద్వర్డు పట్టాభిషేకము, ప్రభావతీ ప్రద్యుమ్నము, వ్యసన విజయము,పాండవనాటకములు అనునవి వారి స్వతంత్రనాటకములు వీనిలో పాండవోద్యోగ విజయములకుఁగలిగినంత ప్రచారము మరే తెలుగు నాటకములకును గలుగలేదనుటలో నతిశయోక్తి లేదు. అవి యాంధ్రదేశమందలి పలునగరములలో సుప్రసిద్ధనటులచేఁబలుసార్లు ప్రదర్శింపఁబడినవి. శ్రీతి.వేం. కవులశైలి ప్రసాదగుణ భరితము, సరళసుందరము, ధారాళము, సుబోధమునై మిక్కిలి నాటకోచితముగా నుండును. వారి పద్యములు కొన్ని యాయా సందర్భములందు భారత పద్యములతో పోటీచేయుచుండును. ఆంధ్రనాటక కర్తలలో ధర్మవరము వారు సన్నివేశ కల్పనమునకును, పానుగంటి వారు సంభాషణా చాతుర్యమునకును, తిరుపతి కవులు సరస పద్యరచనమునకును పేరుపడిరనియొక విమర్శకులన్న మాటయెంతయు సత్య శోభితము. వారి నాటకములకుఁబద్యములే జీవాతువులు. "దగ్గరలేరు మామయును దండ్రియు" "వంది మాగధులు కైవారమ్ము సేయ కున్నారేల నీరజనాభ నేఁడు" "ఆరని లోతు నీటికొలనక్కట" "చచ్చిరి సోదరుల్ సుతులు" 'జెండాపై కపిరాజు' "అదిగో ద్వారక" మున్నగు పద్యము లెంత ప్రసిద్ధములో అంత భావగంభీరములు. పాండవోద్యోగమున కిరాతార్జునీయమునందలి శ్లోకములు కొన్ని సందర్భశుద్ధితోఁజక్కగా ననువదింపఁబడినవి. పాండవ రాజసూయము పద్య బహుళమైనది. ఎద్వర్డు పట్టాభిషేకము

శ్రీ తిరుపతి శాస్త్రిగారి కాశ్రయులైన పోలవరము జమీందారుగారి ప్రేరణచే ఎడ్వర్డు పట్టాభిషేక సమయమున సమగ్ర లక్షణ సంపన్నముగా రచింపఁబడిననాటకము. వ్యసన విజయము సంపూర్ణ సాంఘిక నాటకము. ఉన్నంతలోనిది వాస్తవదృశ్యములతోడను, రస వత్పద్యములతోడను ఆత్మీయాంశ ముద్రలతోడనుగూడి రమ్యముగా నున్నది. "పల్లెటూళ్ళ పట్టుదలలు" అనునది కొన్ని మూఢాచార ముల నధిక్షేపించుచు వ్రాయఁబడిన ప్రహసనము.

శ్రీ తిరుపతి వేంకట కవుల గద్యరచనలలో హర్షచరిత్రము, విక్రమాంక దేవ చరిత్రము, చంద్రప్రభచరిత్రము అనునవి యా పేరుగల సంస్కృత గ్రంథముల కనువాదములు. ఇందలి శైలి ప్రౌఢమై, శక్తివంతమై, భావగంభీరమై, రమ్యముగానుండును. వారు రచించిన టాగూరు కథలు, భారత వీరులు అను చిన్నవచన గ్రంథములంతగాఁ బ్రచారమంది యుండలేదు. "కథలు–గాథ"లను పేర నైదు సంపుటములుగా ప్రచురింపఁబడిన వ్యాసములు వారి వచనరచనలలో సమూల్యములని చెప్పదగినవి. తి.శా. గారి మరణా నంతరము వేం.శా. గారప్పుడప్పుడు రచించిపత్రికలలో బ్రకటించిన వ్యాసములివి. వ్యవహార భాషలో రచింపఁబడినను ఇవి సహజములు శక్తిమంతములునై శ్రీ శాస్త్రులవారి స్వానుభవములను, సమ కాలికులైన కొందఱు మహాపండితుల ప్రతిభా పాండిత్యములను తి.శా. గారి జీవిత విశేషములను వివరించుచు నొక విమర్శకుఁ డన్నట్లాంధ్రుల సాంఘిక సారస్వత చరిత్రమునకు రత్నఖనులై విరాజిల్లుచున్నవి.

## అవధానకళ

అవధానకళ కాంధ్రదేశమున నధికమైన ప్రచారము కలిగించిన వారు శ్రీ తి. వేం. కవులే. ఆ కళయందారితేరి యుండువారిక సదృశమైన పాండిత్యము, ఆశుధారాకవిత్వ కౌశలము, సమయ స్ఫూర్తి, ధారణాశక్తి, ప్రపంచ జ్ఞానము అనుగుణము లావశ్యక ములు. ఇవన్నియు పుష్కలముగా గలవారగుటచే శ్రీ తి. వేం. కవుల యవధానము లనన్య సామాన్యములై విశిష్టములై యల రారినవి ఆశుకవిత్వముకూడ సరసవంతమును వ్యర్థపద రహితమునై యుండుట వారియందలి విశేషము. సమస్యాపూరణ ములందు వారు చూపిన నేర్పు ప్రత్యేక ప్రశంసా పాత్రమైనది. "అంధుండర్ధ నిశీథమందుఁగనె నయ్యర్కేందు బింబమ్ములన్" అను సమస్యను వారిట్లు పూరించిరి.

పుంధర్మేత సరస్వతీ కవులతో భూపాలకుండాదితే
యాంధ స్తీక్ష్ణ గభస్తి బింబముల నుద్యద్వృత్తి వర్ణించి స
ద్గ్రంథంబుల్ రచింపుఁడీయనఁగఁద ద్గ్రంథాను సంధానని
ర్బాంధుండర్ధ నిశీథమందుఁగనె నయ్యర్కేందుబింబమ్ములన్

సమస్యయందున్నట్లు తోఁచు నసందర్భములను దొలఁగించి వారు దానిని బూరించిన విధానమద్భుతముగా నున్నది. ఇట్లు సమయ స్ఫూర్తితో వారవధాన సమయము లందుఁబూరించిన సమస్యలు శతాధికములుగానున్నవి.

శ్రీ తి. వేం. కవుల ప్రయోగ విజ్ఞాన మనితరసామాన్య మైనది. అదియే వారి కితర కవులతోఁగలిగిన వివాదములందు విజయము చేకూర్చినది. భారత 'విశేషము'లను చిన్నగ్రంథ మొక్కటే వారి ప్రయోగ పరిశీలనకేకైక సాక్ష్యముగా ముద్రింపఁ బడినది. వారి యుపన్యాసవైఖరియు, పద్య పఠన ప్రకారమును అత్యంత మనోహరములైనవి. వారు పద్యము చదువుచుండఁగా విని ఆరీతి ననుకరింపయత్నింపనివారు లేరు; యత్నించి పూర్తిగా కృతార్థులైనవారును లేరు.

## శైలీ ప్రసన్నత

శ్రీ తి. వేం. కవుల కవిత్వమునకు దేశమున నప్రతిమాన మైనప్రచారముక లిగించిన గుణము వారిశైలి యందలి ప్రసన్నత. వారు మహావిద్వాంసులయ్యు దుర్బోధములును పండితైకవేద్యములు నైన పదములను ప్రయోగించుటకు యత్నింపక జాతీయములు శ్రవణ సుభగములు సరసములు నైన పదములనే వాడియుండిరి. ఆశువుగా చెప్పినను, ఆలోచించి చెప్పినను వారి పద్యములు వియ ద్గంగా భంగ సదృశములై నిరర్గళముగాఁ బ్రవహించుచుండును. కుంటి నడకగల పద్యము విస్తృతమైన వారి రచనలో నొక్కటియు గానరాదు. వ్యాకరణ విషయమున వారి దృష్టి చాల విశాలమైనది. వ్యాకరణ సూత్రములకంటె మహాకవుల ప్రయోగములకే వారధిక ప్రాధాన్య మొసంగుచుండిరి. అట్లే శబ్దమునకంటె రసమునకే వారెక్కువ గౌరవము నిచ్చుచుండిరి. కృతకములైన యలంకారము లకుఁగాని పాతవడ్డ మారుమూల పదములకుఁగాని చోటీయక వారు నిసర్గరమణీయ పదప్రయోగముతో గవిత సాగించి దానిని పండితాపండిత జనప్రీతిపాత్రము గావింపఁజాలినారు. వారేనుఁగు నెక్కినారు. ధరణీంద్రులుచూడఁగ నిక్కినారు; సన్మానము లంది నారు; దేశమునఁబలువురు సమర్థులైన శిష్యులను సంపాదించి తమ సారస్వత కుటుంబమును దిగంత వ్యాప్తముఁ గావించినారు; జననము వచ్చినదాది మరణ పర్యంతము కవితా తపస్సొనరించి, స్వతంత్రులై, పట్టింపు వచ్చినచో దేవునైనలెక్కపెట్టక దివ్య తేజముతో విరాజిల్లినారు.

"పలు పలుకు లేల కవితా
లలితాంగికిఁ గొప్పులో నలంకరణమ్ముల్
కలిపించిరి లేజాజుల
తెలిమల్లెల తావి పెల్లు దిక్కుల వెలయన్"

# గుంటూరు జిల్లాలో పశుగణాభివృద్ధి ప్రగతి

— మేడూరి నాగేశ్వరరావు

భారత పశు సంపద ద్వారా జాతీయ ఆదాయములో 7.2 శాతము- అంటే 890 కోట రూపాయల మేరకు లభిస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయము తరువాత పశు సంపద ద్వితీయ స్థానము పొంది యున్నది. ఇందు గుంటూరు జిల్లాలోని ఒంగోలు జాతి పశువులు ప్రపంచ ఖ్యాతి పొంది యున్నవి. అమెరికా వంటి దేశములు ఒక్కొక్క పశువును రు. 32, 000/— లకు కొనుగోలు చేయుచున్నవి. తలసరి పాల అవసరము 500 M.L.S. కాగా ఉత్పత్తి 150 M.L.S. మేరకు మాత్రమే జరుగుచున్నది.

పశుగణశాఖవారు ఒంగోలు, జర్సీ, ముర్రా మేలురకపు పశువులను అభివృద్ధిచేసి, వ్యాపార సరళిలో లాభదాయకముగా చేయుటకు కృషిచేయుచున్నారు. గుంటూరు జిల్లాలో ముఖ్యముగా 19 కిలోల పాల వరకు యిచ్చునట్టి ఆవులను పనికి బాగాపనికి వచ్చు ఒంగోలు కోడెలను ఒంగోలు, వినుకొండ, నరసరావుపేట, పల్నాడు తాలూకాలలో ఎక్కువగా అభివృద్ధిచేయుచున్నారు. 1966 లెక్కల ప్రకారం గుంటూరు జిల్లాలో 18,83,326 పశుగణ ముండగా అందు 7,68,949 గేదెలు, 465,762 ఆవులు గలిగి యుండి, రాష్ట్రంలో ప్రథమ స్థానము పొంది యున్నది. వెయ్యి ఎకరముల వ్యవసాయ భూమికి 798.8 పశువులున్నవి. పందుల సంఖ్యలో ప్రథమస్థానము పొంది యున్నది. సర్కారు జిల్లాలలో గుంటూరు జిల్లాకు బీళ్ళు అడవుల ద్వారా విశాలమైన ప్రాంతము పశువుల మేతకు అనువుగనున్నది. మొత్తము 10, 97, 139 ఎకరముల విస్తీర్ణము గల ప్రతి వెయ్యి పశువులకు 612 ఎకరముల మేత భూమి కలదు. వ్యవసాయ భూమి విస్తీర్ణము పెరుగుటచే ఈ అవకాశము తగ్గిపోవుచున్నది. అందుచే హైబ్రిడ్ నేపియరు, పారా మొదలగు మేలురకపు పశువుల మేత వితనములు సరఫరాచేసి ప్రదర్శన క్షేత్రములను 1960 నుండి తయారు చేసిరి. ఇప్పుడు వందల ఎకరములలో ఈరకము మేత పెంచబడుచున్నది.

1960 సంవత్సరమునకు ముందు దేశవాళీ పశువులే పూర్తిగా యుండెడివి. సకృతుగా ముర్రా జాతి గేదెలు ఉండెడివి. అందుచే తలసరి సగటు పాల దిగుబడి 150 MLS అయి చాలా నిరాశాజనకముగా నుండుటచే క్రాస్ ప్రోగ్రాం రూపొందించి, తద్వారా పాడి పశువుల అభివృద్ధికి, పాలదిగుబడి పెరుగుదలకు శీఘ్రగతిని కృషి జరుపబడుచున్నది.

మేలు జాతి పశుగణాభివృద్ధికి, ఉత్తమ జాతి ఆబోతులను కొనుట ముఖ్యావసరము. సహజ సంపర్కము వల్ల 500 దూడలను మాత్రమే ఉత్పత్తి చేయగల ఆబోతు కృత్రిమ సంపర్కం ద్వారా 5,000 కన్న ఎక్కువ దూడల వరకు అధికము ఉత్పత్తి చేయగలదు.

## పశుసంపద

1960 సంవత్సరమునకు ముందు లాము ఫారము నుండి ఒంగోలు నుండి ఒంగోలు జాతిపశుగణమును గ్రామములకు సరఫరా చేసిరి. రెండవ ప్రణాళికా కాలములో 84 ఒంగోలు ఆబోతులను, 55 ముర్రాదున్నపోతులను సరఫరాచేయగా, మూడవ ప్రణాళికలో 31 ఒంగోలు ఆబోతులు, 38 ముర్రాదున్నపోతులు సరఫరా చేయబడినవి.

1967 సంవత్సరములో రైతులకు ఉచితముగా వాటిని సరఫరా చేయడమైనది. ఆయకట్టు అభివృద్ధి పథకము క్రింద కూడ అట్లే వాటిని గ్రామములో ఇచ్చి, వాటిమేత ఖర్చుకు నెలసరి సబ్సిడీ గూడా యివ్వబడినది. పనికిరాని ఆబోతులకు విత్తులు నొక్కి వేసి మేలుజాతి వాటిని అభివృద్ధి చేయుటకు 1940 సంవత్సరపు పశుగణావృద్ధి యాక్టు ననుసరించి 34 కీలక గ్రామ పశుగణాభివృద్ధి బ్లాకులను ఏర్పాటు చేసిరి. అందు 8 బ్లాకులు గుంటూరుజిల్లాలో స్థాపింపబడెను. 1960 నుండి సంతగుడిపాడులో ఒక 'కీ' విలేజిబ్లాకు, 6 సబ్-సెంటర్లు ప్రారంభింపబడినవి. ఇచ్చట మేలు జాతి ఆబోతుల వీర్యమును పట్టయుంచి కృత్రిమ పశుసంపర్కము ద్వారా మేలు జాతి దూడలను అభివృద్ధి చేయుచున్నారు. అట్లే 31 కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రములు, ఒక కీలకగ్రామబ్లాకు, ఒక ప్రాంతీయ పశుగణాభివృద్ధి కేంద్రము, 34 సబ్ సెంటర్లు ఏర్పాటు చేయబడెను. 1969_70 లో 48,759 పశువులకు కృత్రిమ గర్భోత్పత్తిచేయబడెను. పెదరావూరు ముఖ్యకేంద్రముగా 25 సబ్ సెంటర్లతో ఒక ప్రాంతీయ యూనిట్ ప్రారంభించిరి. ఒంగోలులో ఏర్పాటు చేయబడిన కేంద్రీయ వీర్యసిద్ధి కేంద్రము ద్వారా 2, 27, 032 MLS. వీర్యము సబ్-సెంటర్సుకు సరఫరా చేయబడెను. ఈకార్యక్రమమునకు చాల ప్రాముఖ్యతవచ్చినది. ఇంకొక వీర్యసిద్ధి కేంద్రము యొక్క ఆవశ్యకత ఏర్పడినది.

## పశువులమేత

పశుగణాభివృద్ధికి మంచి మేత అవసరము. గడ్డి, జనుప

కట్టెపెమాత్రము ఆధారపడిన ఈప్రాంతములోతగిన సమీకృతాహారమును చాలినంత పెంచుటకు 150 ఎకరముల్లో మేలు రకపు గడ్డి పెంచబడుచున్నది. బుధ్ధవరం కృత్రిమ ఆహార ఫ్యాక్టరీ ద్వారా సమీకృతాహారమును సరఫరా చేసి ఇంటిగ్రేటెడ్ మిల్క్ ప్రాజెక్టు ప్రాంతమైన గుంటూరు, తెనాలి, రెపల్లె, బాపట్ల తాలూకాలలో ముఖ్యముగా సప్లయి చేయబడుచున్నది. 20 వెటర్నరీ ఆసుపత్రులు అమ్మకపు డిపోలుగా పనిచేయచున్నవి. గుంటూరులో యింకొక ఫుడ్ మిక్సింగ్ ప్లాంటు ఏర్పాటు చేయబడుచున్నది.

## పాడి పరిశ్రమ

1530.31 లక్షల ఖరీదు గల పాలు, వెన్న మొదలగునవి ఉత్పత్తి చేసి ఈ జిల్లా ప్రథమ స్థానము పొందినది. పాల ఉత్పత్తి వినియోగములో ఈ రాష్ట్రము 5వ స్థానములో నున్నది పాల సరఫరా సంఘములు, సొసైటీల ద్వారా కూడా సరఫరా జరిగినను యింకనూ చాలా ప్రాంతములలో కొరత యున్నది. మిల్క్ ప్రాజెక్టు ద్వారా 80 వేల లీటర్ల పాలు సరఫరా చేయుట లక్ష్యమై యుండగా 9 వేల లీటర్లు మాత్రమే పోగుచేయబడుచున్నవి. అంగలకుదురు, కొల్లూరు, రేటూరులలో మూడు పాలశీతల కేంద్రములు డిశంబరు 70 లో ప్రారభింపబడును. ఒక్కొక్క దానిలో 10,000 లీటర్ల పాలు ఉత్పత్తి చేయబడును. నర్సరావు పేట, గురజాల, ఒంగోలు ప్రాంతములలోగూడా వీటి అవసరము చాలాయున్నది. త్వరలో అక్కడకూడా ప్రారంభింపబడును. 1969-70 లో షెడ్యూల్డు బ్యాంకుల ద్వారా 30 మంది రైతులకు పశుగణాభివృద్ధికి రూ 5 లక్షలు అప్పుయివ్వబడెను. కనీసం 500 ల మంది రైతులకు ఈ అవకాశము కల్పించుటకు నిర్ణయించబడినది. బీదలకు సహితము అత్యవసరమైన పాలు పట్టణములలో విక్రయింపబడుచున్నవి. గుంటూరులో ఏర్పాటు చేయు శీతలీకరణ ప్లాంటు ద్వారా బాటిల్ పాలు తెనాలి, బాపట్ల చీరాల, నరసరావుపేట, ఒంగోలు గ్రామములకు కూడా సరఫరా చేయబడును.

## గొఱ్ఱెలు, మేకలు

వీటి పెంపకము ద్వారా మాంసము, ఉన్ని వల్ల రైతునకు అధికాదాయము లభించును. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము భారత దేశములో గొఱ్ఱెల సంఖ్యలో ప్రథమ స్థానము కల్గియున్నది. రాష్ట్రములోని 5౧,00,785 జీవములలో 4,10, 742 గుంటూరు జిల్లాలోనివే. 1961-66 మధ్య 14% వీటి సంఖ్యలో అభివృద్ధి కన్పడినది. నెల్లూరు జాతి గొఱ్ఱెలు ప్రశస్తమైనవి. సత్తెనపల్లి, ఒంగోలు, పల్నాడు, వినుకొండ, నర్సరావుపేట ప్రాంతములలో ఈ జాతిఅధికము. ఈజాతిని అధికతరము చేయుటకు 1969-70 లో 64 85 మేలురకపు పొటేళ్ల సరఫరా చేయబడినవి.

## పందుల పెంపకము

1966 లో 78, 125 పందులు జిల్లాలోనున్నవి. కాని నాటు పందులు అంత శ్రేష్టమైనవి కావు. అందుచే సీమపంది పిల్లలను సరఫరాచేయచున్నారు 1969-70 లో 6 యూనిట్లను ఈ జాతి పెంపకమునకై ప్రారంభించిరి. 300 పందులను ప్రభుత్వం వారు పెంపకపు దారుల నుండి కొనియున్నారు. 22 కేంద్రములలో పంది మాంసమును విక్రయించు చున్నారు. సీమ పంది మాంసఫలహారశాల కూడా నడుపు చున్నారు.

## కోళ్ల పెంపకము

ప్రథమ స్థానము పొందిన ఆంధ్రప్రదేశ్‌లో 10,31,963 కోళ్ళు గుంటూరు జిల్లాలోనే యున్నవి. ఇందు 46,094 మేలు జాతి కోళ్లు. పరిశ్రమ యిప్పుడు వ్యాపార వ్యవస్థగా రూపొందినది. చాలా మంది పెంపకము దారులు 260 నుండి 2,000 వరకు కోళ్ళతో ఫారములను నడుపుచున్నారు. కోళ్ళ మార్పిడి పద్ధతి ద్వారా నాటు కోళ్ళను తీసివేసి జాతికోళ్ళను యిచ్చుచున్నారు. 1969-70 లో ఈ కార్యక్రమము 28 గ్రామములకు వ్యాపించినది. 2908 సీమ కోళ్ళను 11.798 గుడ్లను కోళ్ళఉత్పత్తి కేంద్రములకు సరఫరా చేయబడినవి.

మార్కెటింగుసౌకర్యముకు కోళ్ళ మార్కెటింగు కేంద్రమును బెజవాడలో స్థాపించినారు. దీనిద్వారా మన జిల్లాలో కోళ్ళకు వ్యాధినివారణ, కృత్రిమ ఆహారసరఫరా, గుడ్లు అమ్మకము జరుగుచున్నవి. దీని ద్వారా గుంటూరులోనే 7 లక్షల గుడ్లు అమ్మబడినవి. అట్టిమార్కెటింగు కేంద్రము గుంటూరులో నెలకొల్పబడనున్నది. ప్రాంతీయ కోళ్ళఫారము ద్వారా గుడ్లు, పిల్లలు సప్లై చేయబడుచున్నవి. 7,307 కోళ్ళను పెంపకమునకు 10,036 కోళ్ళను కోతకు యిచ్చియున్నారు.

## పశువుల రోగములు-వైద్యము

గుంటూరు, నర్సరావుపేట, వెటరినరీ ఆఫీసర్ల ద్వారా, చీడ పారుడు, కొక్కెర, హెచ్.ఎస్. మొదలైన వ్యాధులు పూర్తిగా నిరోధించబడినవి. 1960 తరువాత ఈనివారణ నిరోధము తీవ్రతరము చేయబడినది. 1969-70 లో 408 కేసులు మాత్రమే వచ్చినవి. 1969-70లో 14,87, 190 పశువులకు ఇంజక్షనుచేయబడినవి. 1960 61లో 25 ప్రథమ చికిత్సా కేంద్రాలు 3 చిన్నవెటర్నరీ ఆసుపత్రులు అభివృద్ధి చేయబడి, ఆసుపత్రులుగా మార్చబడినవి. 1960లో మొత్తం 99 ఆసుపత్రులుండగా ఈ నాడు అన్నిరకముల ఆస్పత్రులు 302 కు పెరిగినవి.

# మహాభారతము

తెన్నెగంటుల లక్ష్మణశాస్త్రి

రాజు:- బ్రాహ్మణా! ఇదిగో నీకు త్రోవవిడుచుచున్నాను. నీయిష్టము వచ్చిన మార్గములో పొమ్ము. నీవు బ్రాహ్మణ బాలకుడవు. చిన్న వాడవయినను ప్రభావముచేత నీ శక్తి పెద్దది. అగ్ని ఎప్పుడు కూడ చిన్నదికాదు. ఇంద్రుడు కూడ బ్రాహ్మణుల ఎదుట తలవంచి యుండును.

అష్టావక్రుడు:- రాజా! మేము ఇరువురము నీ యజ్ఞమును చూచుటకు వచ్చితిమి. మేము అతిథులము కనుక నీయజ్ఞశాలలో ప్రవేశించుటకు ద్వారపాలకుని ఆజ్ఞకావలెను. నీతో కలసి సంభాషణము చేయగోరుచున్నాము. ఈ ద్వారపాలకుడు మమ్ము నిరోధించుచున్నాడు. అందువలన మాకుకోపము వచ్చినది.

ద్వారపాలకుడు:- బ్రాహ్మణ కుమారా! నేను బందిపండితుని ఆజ్ఞాపాలకుడను. ఈ యజ్ఞశాలలో బ్రాహ్మణులైనను బాలకులు ప్రవేశించకూడదు వృద్ధులు. బుద్ధిమంతులగు బ్రాహ్మణులే ప్రవేశించవలెను. ఇది బంది యాజ్ఞ.

అష్టావక్రుడు:-ద్వారపాలా! యిది వృద్ధబ్రాహ్మణుల ప్రవేశద్వారమే యైనచో నిందులో మేము కూడ ప్రవేశించుటకు అర్హులము. మేమువృద్ధులమే. మేము బ్రహ్మచర్యపాలనము చేసినవారము, వేదాధ్యయన సంపన్నులము, గురుజనులను సేవించువారము, జితేంద్రియులము, జ్ఞాననిష్ఠులము. వయస్సులో చిన్నవారైనంత మాత్రముచేతనే బ్రహ్మణుని అవమానించుట తగదు. ఎందుకనగా అగ్నియొక్క చిన్న కణమునుగూడ తాకినచో అది దహించివేయును.

ద్వారపాలకుడు:-బ్రాహ్మణకుమారా! నీవు వేదోక్తమగు ఏకాక్షర బ్రహ్మనుబోధించు వాణిని ఉచ్చరించుము. నిన్ను బాలకుని గానే భావించుకొనుము. ఆత్మస్తుతి ఏలచేసి కొనెదవు. ఈ ప్రపంచమునందు జ్ఞానియగువాడు దుర్లభుడు.

అష్టావక్రుడు:- ద్వారపాలకా! శరీరము పెరిగినంత మాత్రముచేత అది మానవుని వృద్ధియనిపించుకొనదు. మఱ్ఱిపండు పెరిగినప్పటికిని సారహీనమగుటచేత అది వ్యర్థమగు ఫలమేయగును. ఫలములచే వంగిన చిన్న వృక్షముగూడ పెద్దదిగా భావించవలెను. ఫలహీనమగు వృక్షముయొక్క అభివృద్ధి వ్యర్థము.

ద్వారపాలకుడు :- బాలకులు వృద్ధులనుండియే జ్ఞానమును పొందవలెను. కొద్ది వయస్సులోనే జ్ఞానప్రాప్తి అసంభవము. అందుచేత నీవు బాలకుడవయ్యు వృద్ధునివలె ఏల మాట్లాడుచున్నావు.

అష్టావక్రుడు:- వెంట్రుకలు నరసినంత మాత్రమున మనుష్యుడు వృద్ధుడుకాడు. బాలకుడైనను జ్ఞానవృద్ధుడైనచో అతనినే దేవతలు వృద్ధుడనెదరు. ఎక్కువ వయస్సు, నరసిన వెంట్రుకలు. అధికధనము, అనేక బంధువర్గము ఉన్నంత మాత్రమున అతడు పెద్దవాడుకాడు. సాంగవేదాధ్యయనముచేసి వేదార్థమును ప్రవచనముచేయు బ్రాహ్మణుడే పెద్దవాడని మునులు చెప్పిరి. నేను రాజసభలో బంది పండితునితో కలియుటకు వచ్చితిని. మేము నేడు విద్వాంసులతో శాస్త్రవాదము చేయునపుడు నీవు చూచెదవుగాక ఆ వాదములో బంది ఓడిపోవుటను కూడ నీవు చూచెదవు. నేడు సభాసదులందరు చూచుచు నుండగా రాజు, మంత్రులు, పురోహితులు, విద్వాంసులు అందరుకూడ నేను చిన్నవాడనో, పెద్దవాడనో చూచెదరు.

ద్వారపాలకుడు:- సుశిక్షితులైన విద్వాంసులకు మాత్రమే ప్రవేశార్హతగల ఈ సభలో పది సంవత్సరముల వయస్సుగల నీ వంటి బాలకునకు ప్రవేశార్హత ఎట్లు కలుగును? అయినను ఏదో ఒక ఉపాయముచేత నిన్ను సభలో ప్రవేశింపజేయుటకు ప్రయత్నము చేసెదను నీవు కూడ లోపలికి పోవుటకు తగిన ప్రయత్నము చేయుచుండుము. ఈ రాజు నీమాటను వినునంతదూరములో నున్నాడు. నీవు స్పష్టమైన మాటలతో నితనిని స్తుతించుము. దానిచేత నితడు ప్రసన్నుడై నీవు లోపల ప్రవేశించుటకు ఆజ్ఞయిచ్చి నీ కోర్కెలను గూడ పూర్తి చేయును.

అష్టావక్రుడు :_ [ద్వారపాలకుని మాటప్రకారము] రాజా ! నీవు నీ వంశములో ఉత్తమ పురుషుడవు. చక్రవర్తివి. నీకు ఐశ్వర్యములు పూర్తిగాకలవు. ఈ కాలమునందు ఉత్తమ యజ్ఞకర్మలను అనుష్ఠించువారు మరియెవరును లేరు. నీ వొకడవే ఉన్నావు. పూర్వకాలమున యయాతి ఒక్కడే నీవలె యజ్ఞానుష్ఠానము చేసెను. నీ సభలో బందియను ప్రసిద్ధ విద్వాంసుడు కలడనియు అతడు అనేక విద్వాంసులను శాస్త్రవాదములో ఓడించెననియు అట్టివారిని నీ సేవకుల చేతనే నిర్భయముగా నదీ జలములో ముంచెననియు వినినాము. నేను అద్వైత బ్రహ్మమును గూర్చి వివరించుటకు ఇచ్చటకు వచ్చినాను. ఆ బంది పండితుడు ఎక్కడ ఉన్నాడు. నేను అతనితో కలిసికొని అతని ప్రభావమును సూర్యుడు నక్షత్రముల కాంతి నివలె అణచి వేసెదను.

రాజు:_ బ్రాహ్మణ కుమారా! నీవు నీ ప్రతివాదియొక్క శక్తిని తెలియకుండగనే అతనిని ఓడించగోరుచున్నావు. ప్రతివాది బలమును తెలిసినవాడే యిట్టి మాటలు మాట్లాడును. గొప్ప గొప్ప వేదశాస్త్ర విద్వాంసులు అనేకులు బందియొక్క ప్రభావమును చూచినారు. నీకు ఇతని శక్తి ఎంత మాత్రము తెలియదు. అందువలననే యితనిని ఓడించదలచుచున్నావు

అష్టావక్రుడు:_ మహారాజా! బంది పండితునకు నేటిదాక మావంటి వారితో శాస్త్ర వాదము చేయుటకు అవకాశము లభించలేదు. అందుకే అతడు నీసభలో సింహమై నిర్భయముగా మాట్లాడుచున్నాడు. నేడు నాతో వాదమునకు దిగినప్పుడు అతని సింహత్వము పోయి శవమువలె పడిపోవును. మార్గములో చక్రము విరిగిన బండివలె ఒక్క అడుగుకూడ ముందుకు వేయజాలడు.

రాజు:_ బ్రాహ్మణ కుమారా! పురుషుడు, ముప్పది అవయవములు, పన్నెండు అంశములు, ఇరువది నాలుగు పర్వములు, మూడువందల అరువది అరములు కల ఏ వస్తువును తెలిసికొనగలడో_ దాని ప్రయోజనమును తెలిసికొనగలడో-అతడు ఉత్తమ జ్ఞాని యగును.

అష్టావక్రుడు._ రాజా! ఏది 12 అమావాస్యలు, 12 పూర్ణిమలు, అనబడు 24 పర్వములు, ఋతు స్వరూపములగు ఆరు నాభులు, మాస స్వరూపములగు 12 అంశములు, దిన స్వరూపములగు 360 అరములు కలిగి సర్వదా తిరుగుచుండునో అట్టి సంవత్సర స్వరూపమగు కాల చక్రము నిన్ను రక్షించుగాక.

రాజు:_ ఏది రెండు అశ్వస్త్రీలవలె కలిసియుండునో, ఏది డేగ పక్షివలె హఠాత్తుగా పడిపోవుచుండునో, ఆ రెంటి గర్భమును దేవతలలో ఎవరు ధరించెదరు? ఆ రెండు గర్భములను ఎవరు ఉత్పత్తి చేసెదరు?

అష్టావక్రుడు:_ రాజా! ఆ రెండును నీ శత్రువుల యింటిపైన గూడ ఎప్పుడును పడకుండుగాక. వాయు సారథియగు మేఘ దేవతయే ఆ రెంటి గర్భమును ధరించును. ఆ రెండు మేఘ రూప గర్భమును ఉత్పత్తిచేయును.

[అనగా వైదిక పరిభాషలో 'రై' 'ప్రాణము' అను పేర్లతో చెప్పబడు రెండు తత్వములు కలవి. వీనినే ఆంగ్ల భాషలో 'Positive' (అను లోమ) 'Negative' (ప్రతి లోమ) అని అందురు. ఈ రెండును కలిసియే యుండును. ఈ రెంటి యొక్క వ్యక్త స్వరూపము విద్యుచ్ఛక్తి. దానిని గర్భము వలె మేఘము ధరించి యుండును. ఒరపిడిచేత అది ప్రకటితమగును. ఆకర్షణ శక్తిచేత డేగవలె క్రిందపడిపోవును. అది ఎక్కడ పడునో అక్కడ అన్ని వస్తువులను కాల్చి భస్మము చేయును. అందువలననే యిచట "అది ఎప్పుడుకూడ నీ శత్రువుల యింటిపైన కూడ పడకుండుగాక" అని చెప్పబడెను. ఈ రెండు తత్త్వముల సమిష్టి శక్తిచేతనే మేఘము ఉత్పన్నమగును, అందుచేత ఆ మేఘ స్వరూపమగు గర్భమును ఇది ఉత్పత్తి చేయును!! అనిచెప్పబడెను. ఈ విధముగా రాజుయొక్క గూఢప్రశ్నమునకు అష్టావక్రుడుకూడ గూఢముగనే సమాధానము చెప్పెను ]

రాజు :_ నిద్రించునపుడు ఏది కన్నులు మూయదు ? జన్మించిన తర్వాత దేనికి గమనము ఉండదు ? దేనికి హృదయముండదు ? వేగముచేత ఏది వృద్ధి పొందును?

అష్టావక్రుడు :_నిద్రించునపుడు కన్నులు మూయనిది మత్స్యము. పుట్టిన తర్వాత గమనము లేనిది అండము. పాషాణమునకు హృదయముండదు. వేగముచేత నది వృద్ధి పొందును.

రాజు :_ బ్రాహ్మణకుమారా ? నీ సామర్థ్యము దేవతల సామర్థ్యమువంటిది. నీవు మానవుడవుకావు. బాలకుడవుకూడ కావు. నీవు వృద్ధుడవనియే యనుకొందును. వాద వివాదములు చేయుటలో నీతో సమానుడితరుడెవ్వడును లేడు. అందుచేత యజ్ఞమండపములో ప్రవేశించుటకు అవకాశము ఇచ్చుచున్నాను. నీవు కలిసి మాట్లాడ దలచుకొన్న 'బంది' పండితుడితడే.

అష్టావక్రుడు :_రాజా ! ఈ సభలో అనేక రాజులు వచ్చి కూర్చున్నారు. వీరిలో బందిని నేను తెలిసికొన జాలకున్నాను గొప్ప వాడనని తలచుకొను బందీ! నీకు ఓడిన పండితులను నీటిలో ముంచు నియమమును పెట్టుకొని యున్నావు. కాని నేడు నాయెదుట నీకు వాగ్బంధనము అగును. ప్రళయాగ్నిముందు నదుల ప్రవాహము ఎండి పోవునట్లు నాయెదుటికి రాగానే నీవుకూడ ఎండి పోయెదవు. నీ వాదశక్తి నశించుపోవును. నాయెదుట స్థిరముగా నిలువుము.

బంది :— నిద్రబోవుచున్న సింహమును మేల్కొలుపకుము. నాలుకలు జాచిన సర్పముగా నన్ను భావింపుము. నీవు నా తలపై కాలుపెట్టి త్రొక్కితివి. నిన్ను నేను కరచునంతవరకు ఇక ఆగను. ఎవడు దుర్బలుడైకూడ అహంకారముచేత పర్వతమును చేతితో కొట్టునో అట్టివానిచేయి నఖములు చీల్చుకొని పోవునే కాని పర్వతము కొంచెముకూడ గాయపడదు.

అష్టావక్రుడు:—అన్ని పర్వతములు మైనాకమునకన్న చిన్నవైనట్లే, అన్ని దూడలు వృషభములు కన్న చిన్నవైనట్లే భూమండలములో సమస్త రాజులు మిథిలాధిపతి జనకుని కన్న చిన్న వారే అగుదురు. జనక రాజా ! దేవతలలో ఇంద్రునివలె, నదులలో గంగవలె రాజులందరిలో నీ వొక్కడవే ఉత్తముడవు ఇప్పుడు బందిని నాయెదుటకు రప్పింపుము.

"యుధిష్ఠర మహారాజా ! రాజ సభలో బంది తన యెదుటకు రాగానే అష్టావక్రుడు గర్జిల్లుచు కుపితుడై బందితో నా ప్రశ్నములకు నీవు ఉత్తరము చెప్పుము. నీ ప్రశ్నములకు నేను ఉత్తరము చెప్పెదను. అని యనెను." అని లోమశుడు ధర్మ రాజునకు చెప్పి ఆ తరువాత వాది ప్రతివాదులకు జరిగిన సంభాషణమును ఇట్లు చెప్ప దొడగెను.

బంది :— అష్టావక్రా ! ఒకటే అగ్ని అనేక విధములుగా ప్రకాశించుచున్నది; ఒకడే సూర్యుడు సమస్త జగత్తును ప్రకాశింపజేయుచున్నాడు. శత్రునాశము చేయు ఇంద్రు డొకడే వీరుడు. పితృదేవతలకు అధిపతియైన యమ రాజుకూడ ఒకడే.

అష్టా :— ఇద్దరు మిత్రులవలె ఎల్లప్పుడు కలిసి సంచరించు ఇంద్రాగ్ని దేవతలు ఇద్దరు. పరస్పర మైత్రికల దేవర్షులగు నారద - పర్వతులుకూడ ఇద్దరే. అశ్వినీ కుమారులుకూడ ఇద్దరే. రథ చక్రములు రెండే. బ్రహ్మదేవుడు పరస్పర జీవనాధారములుగా ఏర్పరచిన భార్యా భర్తలుకూడ ఇద్దరే.

బంది :— సమస్త ప్రజలు స్వకర్మానుసారముగా దేవతలుగా మనుష్యులుగా పశుపక్షి మృగాదులైన తిర్యక్కులుగా మూడు విధములుగా జన్మించెదరు. ఋక్-యజుస్ సామ అను వేదములు మూడు ఇవిమూడు కలిసి వాజపేయాది యజ్ఞములను నిర్వహించుచున్నవి. యజ్ఞములలో అధ్వర్యువులు ప్రాతస్సవనము, మధ్యాహ్నస్సవనము, సాయంసవనము అను పేర్లుగల మూడు హోమములను చేయుచున్నారు. స్వస్వకర్మానుసారముగా ప్రాప్తించిన సుఖదుఃఖముల ననుభవించుటకు స్వర్గ-మర్త్య-నరకము లనెడి లోకములు మూడే. సూర్యుడు, చంద్రుడు, అగ్ని అను జ్యోతిస్సులు కూడ మూడే యున్నవి.

అష్టా :— బ్రాహ్మణులకు బ్రహ్మచర్య- గార్హస్థ్య-వానప్రస్థ సన్యాసములు అను ఆశ్రమములు నాలుగుకలవు బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రులు అను వర్ణములు నాలుగు. ఈనలుగు రీయజ్ఞమును నిర్వహించుచున్నారు. పూర్వ - దక్షిణ - పశ్చిమ - ఉత్తర అను పేర్లుగల దిక్కులు నాలుగు. 'హ్రస్వ' - 'దీర్ఘ' - 'ప్లుత' - 'హల్' అను పేర్లతో అక్షరములు నాలుగు. 'పరా' - 'పశ్యంతీ' - 'మధ్యమా' - 'వైఖరీ' అనుపేర్లుగల నాలుగు పాదములు వాక్కునకు కలవు.

బంది :— నాలుగు దిక్కుల అగ్నులతో ఆకాశమున సూర్యుడు కలిసి అగ్నులు ఐదు. ఎనిమిదేనిమిది అక్షరములు కల ఐదు పాదములు 'పంక్తి' అను ఛంద్రస్సుకు ఉండును. 'బ్రహ్మయజ్ఞము దేవయజ్ఞము - పితృ యజ్ఞము - ఋషియజ్ఞము, - మనుష్యయజ్ఞము' అని యజ్ఞములు ఐదుగలవు. కన్నులు- నాసిక- కర్ణములు జిహ్వా-చర్మము అనుజ్ఞానేంద్రియములు ఐదు, వేదములో ఐదు జడలుగల' పంచచూడ' అను అప్సరస యొక్క వర్ణన కలదు. లోకములో 'విపాశ' 'ఇరావతి' 'వితస్తా' 'చంద్రభాగ' 'శతద్రు' అను పేర్లుగల ఐదు నదులు 'పంచనద' (పంజాబు) ప్రదేశములోనున్నవి.

అష్టా :— అగ్ని స్థాపన సమయమునందు దక్షిణగా ఇవ్వవలసిన గోవులు ఆరు. సంవత్సరమను కాలచక్రమును సిద్ధింపజేయు ఋతువులు ఆరు. మనస్సుతో గూడ జ్ఞానేంద్రియములు ఆరు. కుమారస్వామి తల్లులగు కృత్తికలు ఆరుగురు. సమస్త వేదములలో 'సాద్యస్కములు' అను పేరుగల యజ్ఞములుకూడ ఆరు.

బంది :— 'గోవు' 'మహిషము' 'మేక' 'గొఱ్ఱె' 'అశ్వము' 'కుక్క' గార్ధభము అను గ్రామ్యపశువులు ఏడు. 'సింహము', 'వ్యాఘ్రము', 'శరభము', 'ఏనుగు', 'వానరము', భల్లూకము, 'హరిణము' అను వన్య పశువులు ఏడు. 'గాయత్రి', 'ఉష్ణిక్', 'అనుష్టుప్' 'పఙ్క్తి',' బృహతి', 'త్రిష్టుప్', 'జగతి', అనుపేరు' గల ఛందస్సులు ఏడు. ఇవి ప్రతి యొక యజ్ఞమును నిర్వహించుచున్నవి. 'మరీచి', 'అత్రి', 'పులహ' 'పులస్త్య', 'క్రతు', 'అంగిరస్', 'వసిష్ఠ' అను పేర్లు గల ఋషులు ఏడుగురు. వీరినే 'సప్తరులు' అందురు. 'గంధ', 'పుష్ప', 'ధూప', 'దీప', 'నైవేద్య', 'ఆచమన', 'తాంబూల' అను పూజోపచారములు ఏడు. వీణాతంత్రులు గూడ ఏడుగలవు.

అష్టా :— 'తుల' (త్రాసు) కు కట్టబడిన దారములు ఎనిమిది, అవి నూరు మాసముల బరువును తూచగలవు. సింహమును చంపు శరభ మృగమునకు ఉన్న పాదములు ఎనిమిది. దేవతలలో ధర-ధ్రువ-సోమ-

అహస్-అనిల-అనల-ప్రత్యూషస్ — ప్రభాస - అను పేర్లుగల వసువుల సంఖ్య ఎనిమిది. యజ్ఞశాలలో యూప నిర్మాణములుచేయు మూలలు ఎనిమిది.

బంది :— పితృ యజ్ఞములో సమిధలువేసి అగ్ని ప్రజ్వలింపజేయుటకు చదువబడు మంత్రములు 'సామిధేనీ' మంత్రములనబడును. అవి తొమ్మిది. 'ప్రకృతి', 'పురుషుడు', 'మహత్తత్వము' 'అహంకారము' 'పంచతన్మాత్రలు' ఈ తొమ్మిది పదార్థముల సంయోగము సృష్టికి కారణము. బృహతీ ఛందస్సులో ప్రతిపాదమునందుండు అక్షరములు తొమ్మిది. గణనకు ఉపయోగించు అంకెలు కూడ ఒకటినుండి తొమ్మిదియే.

అష్టా :— దిక్కులు పది. వేయికి పది వందలు. స్త్రీగర్భ ధారణము చేయు మాసములు పది. 'రోగి', 'దరిద్రుడు', 'శోకార్తుడు, రాజదండితుడు', శఠుడు, దుష్టుడు, వృత్తిరహితుడు, ఉన్మత్తుడు, అసూయపరుడు, కాముకుడు అనబడు నిందకుల సంఖ్య పది. గర్భవాసము, జన్మము, బాల్యము. కౌమారము, సౌగండము, (ఆరు నుండి 16 సంవత్సరముల వయస్సుగల బాల్యము) కైశోరము, యౌవనము, ప్రౌఢము, వార్ధక్యము, మృత్యువు అను పేర్లుగల శరీరావస్థలు పది. విద్యా గురువు, తండ్రి, అన్న, రాజు, మేనమామ మామ, మాతామహుడు, పితామహుడు, తనకంటె ఎక్కువ వయస్సుగల గృహస్థుడు, పితృవ్యుడు (పెద్ద తండ్రి, పినతండ్రి) అను పూజనీయుల సంఖ్య పది.

బంది :— జంతువులకన్నిటికి ఇంద్రియవిషయములు పదకొండు. [పంచ జ్ఞానేంద్రియములు -కన్నులు అవి గ్రహించు విషయము రూపము, చెవులు అవి గ్రహించువిషయము శబ్దము, నాసిక దానికి విషయము గంధము, జిహ్వ—దాని విషయము రసము (రుచి), చర్మము అది గ్రహించు విషయము స్పర్శము. ఈలాగే కర్మేంద్రియములైదు — నోరు దాని విషయము మాట్లాడుట, హస్తము దానికి విషయము పనిచేయుట, పాదము దాని విషయము నడచుట, పాయువు దానికి విషయము మలవిసర్జనము చేయుట, ఉపస్థము దానికి విషయము మైథునము. ఈ యైదు కర్మేంద్రియముల విషయములు, ఈ పదింటిని మననముచేయునది మనస్సు]కనుక మనోవిషయము మననము. ఈవిధముగా మొత్తము పదకొండు విషయములు. ఈ విషయములను ప్రకాశింపజేయు నింద్రియములు గూడ పదకొండు. యజ్ఞశాలలో నాటబడు యూపస్థంభములు పదకొండే. ప్రాణులయొక్క వికారములగు "కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, హర్ష, శోక, రాగ, ద్వేష, అహంకార" ములు అనునవి పదకొండు. దేవతలలో రుద్రులు పదకొండుగురు. 'వీరిని ఏకాదశ రుద్రులు' అందురు. వారు మృగ, వ్యాధ, సర్ప, నిర్వతి, అజైకపాల్, అహిర్బుధ్న్యపినాకి, దహన, ఈశ్వర' కపాలి, స్థాణు, భవ" నామకులు పదకొండుగురు రుద్రులు.

అష్టా :— ఒక సంవత్సరములో నెలలు పన్నెండు, జగతీఛందస్సుయొక్క ప్రతిపాదమునందలి అక్షరములు పన్నెండు. ప్రాకృత యజ్ఞము చేయబడు దినములు పన్నెండు. జ్ఞానులు పన్నెండుగురు ఆదిత్యులను వల్లించెదరు. ('ధాత మిత్రుడు, అర్యముడు, ఇంద్రుడు, వరుణుడు, అంశుడు, భవుడు, వివస్వంతుడు, పుంషడు, సవిత, త్వష్ట. విష్ణు, అనువారు ద్వాదశాదిత్యులు).

బంధి :— త్రయోదశి తిథి శ్రేష్ఠమైనది. ఈ భూమండలమునందు ద్వీపములు పదమూడు.

ధర్మరాజా ! పదమూడు సంఖ్యకు సంబంధించిన ఈ రెండు విషయములు మాత్రము చెప్పి బంది ఆ తరువాత త్రయోదశ సంఖ్యావిషయములు చెప్పలేక ఆగిపోయెను. తరువాత అంశములను అష్టావక్రుడు ఈ విధముగా చెప్ప దొడగెను.

అష్టా :— కౌశి అను రాక్షసుడు భగవంతుడైన విష్ణువుతో పదమూడు దినములు యుద్ధముచేసెను. వేదములో "అతిచ్ఛందము" అనునొక ప్రత్యేకమైన ఛందస్సుగలదు. ఛందస్సుయొక్క ప్రతి పాదములోను పదమూడు మొదలుకొని అక్షరములు ఉండును. )అనగా 'అతి జగతి' అను ఛందస్సుయొక్క ప్రతిపాదములో పదమూడు అక్షరములుండును. 'అతి శక్వరీ' ఛందస్సునందలి ప్రతి పాదములో పదునైదు అక్షరములు ఉండును. 'అత్యష్టికా' ఛందమునందు ప్రతియొక్క పాదములో పదునేడు అక్షరములు, 'అతి ధృతిక' ఛందమునందు ప్రతియొక్క పాదము పందొమ్మిది అక్షరములు కలదిగా నుండును).

ఈ మాటలు వినగనే బందికి వాగ్బంధనము కలిగెను. ముఖము ముడుచుకొని అతడు మిక్కిలి చింతింపసాగెను. అష్టావక్రుడు ఆ తరువాత విషయములను కూడ ఆగకుండ మాట్లాడుచుండెను. ఇది చూచిన ప్రేక్షకులలో విన్న శ్రోతలలో గొప్ప కోలాహలము చెలరేగెను. జనకుని యజ్ఞమునందు కోలాహలము నలువైపుల వ్యాపించెను.

(సశేషము)

# ధర్మసత్రం

"కథక్ మిత్ర"

ఉదయకాంతిలో కరుగుతూన్న కౌశిక నది వెండిజలతారు నీరు మెల్లగా పల్లానికి ప్రవహిస్తోంది.

నదిమీద తెరచాప దించేసిన పడవ నిలబడిపోయింది.

తీరాన రావిచెట్టు చిగుళ్ళు రెపరెపలాడుతున్నాయి. పండుటాకులు రాలిపడి ఏటినీటిలో కొట్టుకు పోతున్నాయి.

పొగమంచు పైకెగసిపోతోంది.

అర్ధ నిమీలిత నేత్రాలతో మొలబంటి నీటిలో నిలబడి ధ్యాన నిమగ్నులై దివాకరునికి అర్ఘ్యమిస్తున్నారు రాధాస్వామిగారు. వారి గురించి ఎదురుచూస్తూ గట్టుమీద నుంచున్నాను.

తెల్లపట్టు పోవుల్లాంటి తల వెంట్రుకల నుండి జారి పోతున్న నీళ్ళు, పగిలి బీటలు తీసిన భూమిలాటి నుదుటి గీతల వార్ధక్యాన్నీ తేజస్సునీ తడిపి, పంచకావ్యాలనీ, పురాణేతిహాస సారాన్నీ నింపుకుని జీర్ణించుకున్న బొజ్జమీదుగా జాలువారుతున్నాయి.

స్నానం చేసి వడ్డు మీదికి వస్తూన్న వారికి పావంచాల మీద చూడగానే నమస్కరించాను.

భ్రుకుటి ముడేసి "గుర్తు చాలదు ...జ్ఞాపక శక్తి క్షీణిస్తోంది. ......ఊరు పొమ్మంటోంది మరి కాడి రమ్మంటోంది. మరేం అనుకోవద్దు...మీపేరు?" ప్రశ్నించారు రాధా స్వామి గారు.

జవాబిచ్చాను.

"ఓహో. చాలా సంతోషం. మావాడ్నికూడా తీసుకు రాలేక పోయారా. ఏమిటో లెండి. వాడిమీద నాకున్న అభిమానం వాడికి నామీద ఎందుకుంటుంది? వాడితాతగారు వాడిపేరు మీద ఆస్థిరాసేరన్నబాధలేదు నాకు. కాని వాడి మనసు ఆ ఆస్థివల్లే నాకు దూరంగా జరిగిపోతోందేమోనన్న భయం చుట్టుకుంది. అన్నట్టు యిక్కడే నిలుచో బెట్టేశాను, రండి యింటికి వెళ్దాం" అంటూ ముందుకి కదిలారు. వారిని అనుసరించాను.

ఏటి గట్టు మధ్యగా సన్నగా వంపులు పోతున్న నలిగిన కాలి బాట జీవితపు మలుపుల్ని కాబోలు సూచిస్తున్నట్టుంది.

ఎడ్లను మళ్ళించుకుంటూ నాగళ్ళు భుజాన వేసుకుని పొలాలకు వెళ్తోన్న రైతులూ, ఏటి నీటిని బిందెల్తో వయ్యారంగా మోసుకు వెడుతూన్న పల్లెపడుచులూ రాధాస్వామిగారికి తోవయిస్తూ వినయ విధేయతలుట్టిపడేలా నమస్కరించి పక్కలకి తప్పుకుంటున్నారు.

గట్టుమీద పేడ ఏరుకుంటూన్న పాలికాపు కుర్రాళ్ళు దూడల్ని పక్కవాటుగా మళ్ళిస్తూ అమాయకంగా దూరంగా తప్పుకుంటున్నారు.

గడ్డివామివార ఉత్సాహంగా పరుగులు తీస్తున్న ఉడుతలు రెండు తోవకి అడ్డంగా పరుగెత్తి తొందర తొందరగా ఏటివార వెంపు కొబ్బరిచెట్టు మీదికి పాకిపోయి వెనుతిరిగి చూస్తున్నాయి.

పాలవెల్లి పందిళ్ళలా కొబ్బరిచెట్లు నిండుగా కాయల్తో బరువుగా తలలాడిస్తున్నాయి.

ఆవలిగట్టు గున్నమామిడి గుబురులో కోయిల కూస్తోంది. పాలపిట్ట ఎగిరింది. చల్లగా గాలేస్తోంది. పై ఎత్తుగా కొంగల గుంపు ఎగురుతోంది. చిలుకలు కిలకిలారావాలు చేస్తున్నాయి.

చాలా అందమైన పల్లెటూరు! మనసును పరవశింప జేస్తోంది. వాతావరణం ఆహ్లాదకరంగా వుంది.

కాని,

రాధాస్వామిగారి మాటలు చెవుల్లో గింగుర్లు పెడుతున్నాయి. అవి మననంచేసుకొంటూ పరధ్యానంగా నడిచాను.

వక్రరేఖల కాలిబాట విడివడి ఇరుకు సందులోకి మళ్ళాం. ఇళ్ళు చూరూచూరూ రాసుకుంటూ ఒకదాన్నొకటి అంటిపెట్టుకుని వున్నాయి. ఇళ్ళముందు కళ్ళాపి చల్లి ముగ్గులు వేస్తున్నారు.

కంకరరోడ్డు వార పంచాయితీ సమితి స్వాగతం బోర్డూ, దాని పక్కనే పసుపుపచ్చ రంగుమీది తెల్లక్షరాలలో ఆవూరిపేరూ, జనాభా, విస్తీర్ణం తెలియచేసే మరోబోర్డూ నిలబడ్డాయి.

వూరు పెద్దదే.

రోడ్డు రెండువేపులా చిన్నచిన్న కొట్లూ, కిళ్ళీ బడ్డీలూ, పబ్లిక్ మార్కెట్టు షెడ్డులూ, షెడ్లల్లోకి బిచ్చగాళ్ళూ, బిచ్చగాళ్ళతో

పాటు పొక్కిళ్ళుపెట్టి వండుకొంటున్న ఇరుగుపొరుగూళ్ళ ఆడ వాళ్ళూ, వాళ్ళ పక్కలగా రోగులూ, మందు సీసాలూ, రోడ్డు వార కాళీ సీసాల కొట్లూ చూస్తూ ముందుకి నడిచాను.

"ఇది యీ వూరికి మెయిన్‌రోడ్డు. అదిగో ఆ ఎర్రడబ్బా వుందే...అది పోస్టాఫీసు. తెల్రిగాఫాఫీసూ వుందిలెండి...అవతలి చిన్నడాబా, గార్డెనూ అద్రిగామ పంచాయితీ ఆఫీసు...దానవతల్లి హైస్కూలు...దాన్ని ఓ జమీందారు కట్టించారు ఆ ఆకుపచ్చ తలుపుల గోపీచందనం మేడ కోర్టు...ఇటు వేపు చూశారా... ఆ జేగురు గోడల్లే తాలూకాఫీసు...అందులోనే సబ్‌ట్రెజరీ, పోలీసు స్టేషనూ, ప్రొహిబిషను స్టేషనూ కూడా వున్నాయి. వూరి చివర్ని పంచాయతీ సమితి ఆఫీసూ, బ్యాంకుల బ్రాంచీలూ, రూరల్ డిస్పెన్సరీ, అవతలగా రెండు పర్మనెంటు సినిమాథియేటర్లూ, వో టూరింగు టాకీసూ ఉన్నాయి." ఊరిని చూపిస్తూ చెపుతూ నడిచారు రాధాస్వామిగారు.

కాఫీ హోటళ్ళ కప్పులచప్పుళ్ళూ, బిల్లుమొత్తాల కేకలూ, ముందుమెతుల్లోంచి రికార్డులూ, రిక్షాల మువ్వ చప్పుళ్ళూ, బళ్ళు తోలుతున్నవాళ్ళ అదమాయింపులూ, ఎడ్ల మోపుగాల్లో మ్రోగుతున్న చిరుగంటలూ, రద్దీగా తిరిగే సైకిళ్ళు, కారుహారన్లూ, రోడ్డు దుమ్మూ, కొట్లాడుకుంటున్న ఊరకుక్కలూ, సైడు కాలువల్లో దొర్లుతున్న పందులూ—పట్నం వాసనలు పులుముకుంటున్న పల్లెటూరు 'యిదని' సూచిస్తున్నాయి!

మంచి బిజినెస్ సెంటర్లకి మార్గమధ్యంలో వున్నఊరుఅది.

ఊరిసెంటర్లో పెద్దరావిచెట్టుకి సిమెంటు చప్టా కట్టారు, అదే బస్సు స్టాండు!

గుళ్ళో జేగంటలు కొడుతున్నారెవరో!

"గుడి...చిన్నప్పుడు యిక్కడే ఆడుకునేవాడిని...ఆ ఎత్తైన శిఖరం, త్రిశూలంవుందే...ఆ విమానం—అదే శివాలయం" ఆనందంగా అన్నారు రాధాస్వామిగారు.

ఇంకా చిన్న చిన్న దేవాలయాలూ, శిఖరాలూ వాటిగోపురం గూళ్ళలో తెల్లగా, స్వేచ్ఛగా, అందంగా తిరుగాడుతూన్న పావురాలూ, ఒత్తుగా తెల్లగా గుత్తు గుత్తుల బిళ్ళగన్నేరు పూలూ కనబడుతున్నాయి ఎత్తైన ప్రహారీ గోడలమధ్య!

హాయిగా ఆడుకున్న బాల్యం సీతాకోకచిలుక రెక్కల్తో ఎగిరి ఎగిరి వృద్ధాప్యం గూడుచేరి నిద్రపోతూనే ఎన్నో ముచ్చట్లను కలలుగంటోంది! ఆ వూళ్ళో ఏదిచూసినా వారికి ఆనందమే!

ఇంకాముందుకి నడిచి వోగుమ్మం ముందు ఆగిపోయాం. అలాటి పల్లెపట్టున ముగ్గులులేని గుమ్మం అదొక్కటే!

"రండి...రిటైరయ్యిందగ్గర్నించీ...ఈ గది...ఆ కౌశిక స్నానం...సూర్యసంస్తుతీ... దేవదర్శనం ... నారాయణయ్యరు హోటలు మెతుకులూ, నా ఆశయంగా ఆ కట్టడమూ, ఈ ఊరూ... మాధవయ్య స్నేహమూ............గతపదమూడేళ్ళుగా ఇదే నా దినచర్య!" పురికొస పేనికట్టుకున్న మొలతాడునించి, మరో కొన కట్టిన తుప్పుతాళం చెవి విప్పి తాళం తీయమని యిచ్చారు రాధాస్వామిగారు.

దేవదారు చెక్కపెట్టెలు నాలుగూ, వాటిమీద పంచాంగాల కట్టలూ, జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలూ, భగవద్గీతా, ఆ పైన ఓకాలు లేక పురికొస కట్టుకున్న సులోచనాలూ, గోడమూల చిన్న చేతికర్రా, చిరిగి మాసికలు వేయబడ్డ గుడ్డగొడుగూ, గదిమధ్యగా సన్నని ఊచకి వేలాడేసిన అద్దాల్లాంతరూ, దాని దిగువగా కాళ్ళుచాపుకుంటే మోకాళ్ళవరకూ మాత్రమే సరిపడే మంచం, దాన్నానుకుని కాళ్ళు చాచుకుందుకు ఉపయోగపడే చిన్న చెక్కపెట్టే, ఓ చేయి విరిగిన పేంకుర్చీ—ఇవీ ఆ యిరుకు చీకటి గదిలో వారి చరాస్థి. గదికి ఒకే ఒక ద్వారబంధం. కిటికీలు లేవు.

గదిలో రెండుమూడు ఎలుకలూ, నాలుగైదు చుంచులూ కిచకిచలాడి కన్నాల్లోకి పారిపోయాయి. మేం వచ్చామని అవి పారిపోయాయి.

మంచం కింద చింకిచాప చుట్టబెట్టిన కాగితపు కట్టవారగా ఓ కాశీరాగిచెంబూ, రాగిదే పంచపాత్రా, ఉద్ధరిణీ, అరివేణం మెరుస్తున్నాయి.

అపుడే రోడ్డుమీద వెళ్ళిన కారు దుమ్ము లేపుకుపోయింది. కంకరదుమ్ము సరాసరి ఆ గదిలోకి ఎగిరి వచ్చేసింది.

కళ్ళు చికిలించారు. "అవునా......బాబూ! యింతవ న. మా వాడు చెప్పాడు—'మీరేమో నన్ను అక్కడికి వచ్చి తనతో పాటు ఉండమని అడగమంటూంటారు వాణ్ణని'. కాని, ఎలా? ఇదిగో......ఈ కాళ్ళ మీద ఇదొహటి. కాగా......డయాబిటీస్ పేషెంటుని......గుండెల్లో నొప్పి......మనవిచేస్తా......... నాకెక్కడ సాగుతుంది చెప్పండి......మొండి ఘటాన్ని...... నా పిచ్చినాకానందం......నే తల పెట్టిన పని......ఎలారానూ!"

రాధాస్వామిగారి పట్టుదల గురించి వినే వున్నాను నేను. వారిమాటల్లో స్వోత్కర్షకాదు, స్వాభిమానమే ద్యోతకమవుతుంది. వారిని చూసినపుడు నా హృదయం నిండా జాలీ, సానుభూతీ నిండిపోయాయి.

వారి కాళ్ళమీద నల్లగా మేహపొడ మచ్చలు లేచాయి పాపం! వాటితో కాళ్ళు వాచి బాధపడుతున్నారు.

మోకాళ్ళు దిగీదిగని కావిరంగు పంచె, మోచేతులు దిగిన బొత్తాలు లేని జుబ్బా, సాదా తుండూ వేసుకొన్నారు.

"అయ్యో! ఆ సంగీతం వింటున్నారా? ఏమిటి వినుపోతారు? వినలేదూ? మస్కిక సంగీతం! అబ్బోలోటు లేదు కుంచాలతో కొలవ్వొచ్చు......బెడ్‌బగ్స్......" వ్యంగ్యంగా అనేసి రాధాస్వామిగారే నవ్వేస్తున్నారు.

ఓపిక తగ్గిపోయి, ఆర్జించేకాలం తీరిపోయి, ఒంటరిగా బ్రతుకుతూ దీనావస్థలోవుండి వారలా చమత్కరించడాన్ని చూసి నవ్వలేక నవ్వాను.

పడకపైన నల్లిరక్తం మచ్చలమీద ఎఱ్ఱచీమలు తిరుగుతున్నాయి.

"ఆఁ! యిప్పుడు చెప్పండి. అంతాక్షేమమా!......ఏమిటి విశేషాలు? అన్నట్టు కాఫీకి వెళ్దాం రండి......వచ్చాక తీరికగా మాటాడుకోవచ్చు. ఊఁ! లేవండి. వ్వెధవది......కన్నాను. డెబ్భైయేడేళ్ళ వాణ్ణండీ......ఇహ ఎపుడో టక్కున చెప్పా చెయ్యకుండా ఆగిపోతుందీ యింజను......ఇహమరి మళ్ళీ కదల్దు. చాదస్తం ముండా వాణ్ణి-ఏమిటి చెప్పొచ్చాను. హేయంగా పరాధీనంగా ఒకళ్ళ వద్దిలో వుండలేనండీ......ఆడపిల్ల రమ్మంది. రానన్చెప్పేశా......మా వాడితో కూడా చెప్పేశా......దాపరికం ఏవిల్లెండి......యీ నా పని పూర్తయితే కాని రాలేనన్చెప్పేశాను......సరే......సరే......కాఫీకి......వెడదాం లెండి..."

చాదస్తమేమీ కాదు, గట్టిపట్టుదలా, కార్యదీక్ష ఎక్కువ కాగా, ఆ వూళ్ళో వారిచుట్టూ ఏర్పర్చుకున్న అనందం ఆ వూరిని వదలి ఎటూ వెళ్ళనివ్వడం లేదు రాధాస్వామిగారిని.

బస్సుస్టేండ్‌లో నారాయణయ్యరు హోటలుకి వెళ్ళాం. అక్కడ కాఫీతాగి అలా బైలుదేరాం.

మెల్లగా అలయ ప్రాంగణందాటివచ్చాం. "ఇతను మాధవయ్య అని... నమ్మిన బంటు ... నాకున్న ఒకేఒక స్నేహితుడు ... పరోపకారి శివాలయం తోటమాలిగా తన్నుతనే నియమించుకున్నాడు,... ఏదో కొద్దిగా అద్దెవస్తుంది. దాంతో జీవించే వొంటరి జీవి. " రాధాస్వామిగారు చెప్పి ఎదురుగా నడిచారు.

ఎదురుగా కనిపిస్తున్న రాతి కట్టడం కేసి తదేకంగా చూస్తూ నిలబడిపోయాను.

" బాబూ... ఈ సత్తరువు కట్టిచ్చాలని రాదాసామిగారింత కాలం రెక్కలు ముక్కలు సేసికొన్నారు... వూళ్లోవాల్లు అసూయల్తో వోర్చలేపోతున్నరు. బంధుగులు... ఆల్లకి అసలు గిట్టడం లేదు. కొడుకు సూడొత్తే ...అదంతా ఏరేకత...అసలింతకీ యీ రే ఎందుకట్టిచ్చాలడుగు... సెప్తా.. డబ్బుకోసం వొటేలోళ్ళు లాడ్జింగులు యెట్టారు గందా ..డబ్బుకోసం డాకటేరులు రోగోల్లకి గదులు కట్టిచ్చినుర్రి...గవురు మెంటోల్లు ఈ మద్దికాలంలో ఆఫీసులు కట్టుకున్నరు...వూల్లో మతపెసారం కోసం కిరత్తానోల్లు చర్చీలు కట్టినుర్రి .తురకలు మసీదులు కట్టుకున్నరు.. ఇందువులు గుల్లుగోపురాలూకట్టిచ్చింర్రు.. యిదంతా ఏటిది? మతంకోసం...బత్తులు గుల్లలో నాపరాల్లేయిచ్చి పేర్లు సెక్కించుకొని పాపం జలకడుక్కుంటున్నారు. గుడికాడ మంటపాటలు సూల్లే. వర్తక సంఘపోల్లు కట్టిచ్చింనేర్రి ఆటి ఎనకతట్టినదేవుల్ల వోహనం కొట్లు కాచిరోడ్డు మీదికి కట్టిచ్చిన కొట్టుల్లో సాపులెట్టుకున్నారు. అదేటి? ఊరా పేరా అల్లదిగో పిల్లగోల్ల సతువుకిబడి అయిస్కూలు, లోమాను చావుడు కట్టిచ్చింర్రు. అవునా ఇరుగు పొరుగు గామాలనించిసిన్నసిన్న పిల్లకాయలు సతువుకి యిక్కడికి రావాలి. ఆల్లు కారేజీలు యెట్టుకు తిండానికి నిలువనీడలేదు గందా, పల్లెల్నించి యీ పట్నానికి పురుడు పున్నేలకి పేదల్లు ఎత్తన్నారు. మందునీల్లకి వొచ్చే ఆల్లకి సెట్టునీడ, మార్కెటు సెడులు గతి తప్పితే మరేటినేదు. యాత్తర్లకొచ్చే బతులకి దర్మ సత్తరం నేదు గందా! బాబూ! సెప్పు వూరుకోసం వోరు పట్టిచ్చుకున్నరు. వూరి పేరుకోసం వోరుసేపిచ్చని పని యీ సత్తరం దరమసాల రాదాసామిగారు కట్టిత్తన్నరు వోరికి తోచిందారికి యిత్తన్నరు" వైరాగ్యం తలపండి, అనుభవాల చదువు నేర్పిన గుణపాఠాలన్నీ రాధాస్వామిగారి ఆశయాన్ని పొందికగా చెప్పాడు మాధవయ్య.

రాధాస్వామిగారు కట్టడంవార పిచ్చిమొక్కలు లాగుతుంటే తనూవెళ్ళి పిచ్చిమొక్కలు పెరికి పారేస్తున్నాడు మాధవయ్య.

నా కళ్ళముందు చాలాపెద్ద ధర్మసత్రం నల్లరాతి పునాదుల పైన గోడల యెత్తువరకూవచ్చి పని ఆగిపోయివుంది. ఇప్పటికే దాదాపు ఇరవై అయిదువేల రూపాయిలుపైబడి ఖర్చు అయి వుండొచ్చు. ఇక ఐదారువేలరూపాయిలు యించుమించుగావుంటే పెకప్పువేయవచ్చు. ఏమైనా ఆకట్టడం పూర్తయితే మాధవయ్య చెప్పినట్టు చాలామంది పేదవారికీ, అనాధులకీ, బడిపిల్లలకీ ఆశ్రయమిసుంది ఆ ధర్మసత్రం.

ఆకు వచ్చని చిన్న ఫియట్ కారు వచ్చి ఆగింది. ఫిన్లే గ్లాసో ఖద్దరు పంచీ, ఖల్లీ లాల్చీ సిల్కు కండువా వేసుకున్న చలువ కళ్ళద్దాల ఖరీదైన వూరి నాయకు దొకాయన, మరో అవధాని, మరో ఇన్‌షర్టు యువకుడూ దిగొచ్చారు.

" కాలవ మీద కట్టించిన జిల్లా పరిషత్తు వారి బళ్ళ వంతెననీ; పంచాయతీ వాళ్ళ పిల్లల పార్కునీ; హరిజన వాడలో గాంధీ కాలనీకి పునాది రాయినీ; అవధానులు గారి పుస్తకా విష్కరణనీ, మన మినిస్టరు గారి చేత చేయించ సంకల్పించాం. మరింతకీ మీరీ కట్టడాన్ని పది రోజుల్లో పూర్తి చేయించాలి ఇది వరలోనే చెప్పా.......ఎన్నాళ్ళిలా ముష్టి చందాలు పోగేస్తూ పూర్తి చేయించ లేకుండా వూరుకోవడం? ఈ వూరికి వచ్చిన దేశ నాయకులు ఈ మొండి గోడలేమిటంటే చెప్పలేక చస్తున్నాం. మేమేం సంజాయిషీ యిచ్చుకోవాలిట!? వారం పది రోజుల్లో పూర్తి చెయ్యలేపోతే చెప్పండి....సుబ్బరాజుగారు వారి దత్తుడిగ్గారి పేరు శాశ్వతంగా వుండేట్టు వారి పేర ఈ నిర్మాణం పూర్తి చేయించ దలిచారు. '' అన్నాడు చలవ కళ్ళద్దాల వూరినాయకుడు.

"సాధించ తాహతులేని పనికి పూనుకున్నావు రాధాస్వామీ! జమిందార్లూ, లక్షాధికార్లూ, గొప్పవాళ్ళూ చేయాల్సిన ధర్మ కార్యాలివి. నీ నిస్సహాయస్థితి తలచుకుంటే జాలివేస్తోంది. ......అన్నానని అనుకోకు......నీ మీద గౌరవంవున్న నాకే అసహ్యం వేస్తోంది. ఎందుకొచ్చిన అవస్త చెప్పు, హాయిగా కొడుకు దగ్గరుండి రామా కృష్ణా అనుకోక......" అంటూన్న అవధానివైపు ఓసారి చూసి దృష్టిమార్చుకున్నారు రాధాస్వామిగారు.

ఏ భావాలు ఆయన మనస్సుని చివుక్కుమనిపించాయో కాని కళ్ళల్లో నీళ్ళు నిండినట్టు అనిపించాయి.

ఫియట్ కారు వచ్చినదారంట వెళ్ళిపోయింది. మొదట కదలేక వాళ్ళు గెంటినా కదలక, మాధవయ్య చెయ్యిపడ్డాక కదిలి వెళ్ళిపోయింది. "అవిరిచ్చిందాంట్లో అత్తగారు సామెతలాగుంది. ఆళ్ళు

పూర్తి చేస్తారట. బాబూ! ఇలాటోళ్ళు బండిముందునా గుర్రం ఎనకనా కట్టి తోల్దారనుకుంటారు" అన్నాడు మాధవయ్య దూరంగా వెళ్ళిపోతున్న కారునే రెప్పాల్చకుండా చూస్తూ.

రాధాస్వామిగారి ముఖంనిండా స్వేదబిందువులు పొటమరించాయి. హృదయస్పందన తీవ్రమైంది. కంఠంవారగా ఎగిరిపడుతున్నకండరాల కదలిక స్పష్టంగా కనిపిస్తోంది.

మనిషిచేత మనిషి యీసడించబడినప్పుడు పొందే తృణీకారమూ, నిరాదరణా, హేళనా వారి మనోభావాల్లో సంచలనాన్నీ, మానసిక సంక్షోభాన్నీ, ఆందోళననీ, ఆరాటాన్నీ లేపి వారినెంత ఖిన్నుడిగా, దీనుడిగా క్రుంగదీస్తున్నాయో, పట్టుదలతో వారెలా తట్టుకోవాలని ప్రయత్నిస్తున్నారో అర్థంచేసుకుంటున్నాను.

"ఇలా చాలాసార్లు బెదిరిస్తూ వచ్చారు అవధానివాళ్ళు. ఇప్పుడిలా మౌనంగా వెళ్ళిపోయారంటే ఏదో పట్టుదలతో కదిలారన్నమాటే. ఈ వార్థక్యంలో, నేను పుట్టిపెరిగిన గడ్డవదిలి యీ బొంది ఎక్కడ రాలిపోతుందో అని యింతవరకూ ఎటూ వెళ్ళలేక పోయానుకాని యిప్పుడిక తప్పేట్టులేదు" తనలోతనే అనుకున్నట్టు అన్నారు ఆయన.

"ఏమిటండీ ?" అన్నాను.

"ఆంధ్రా బ్యాంకులో ధర్మసత్రం ఆకౌంటులో సుమారు వెయ్యి రూపాయలు నిలవవుంది. అదేం సరిపోతుందీ. వెనక నేను పనిచేసినచోట పరిచయస్తులున్నారు. బెజవాడలో, గుంటూరులో, నెల్లూరులో, మద్రాసులో యింకా గుర్తుపట్టి పలకరించి ప్రేమగా మాట్లాడే మనుషులు వున్నారు. వెళ్ళి చందాలు యివ్వండర్రా అంటే కాదనరు. ఓ రెండు మూడు రోజుల్లో బయలుదేరాలి. లేకపోతే వాళ్ళేదో చేసేట్టే వున్నారు"

రాధాస్వామిగారి పట్టుదలను గురించి వాళ్ళబ్బాయి చాలాసార్లు చెప్పాడు. లేకపోతే యీ వయసులో యింత బరువు తననెత్తిన వేసుకుని మనస్థిమితం లేక ఆరాటపడవలసిన అవసరం ఆయనకేం వచ్చింది.

వెనక ఒకసారి వాళ్ళబ్బాయితో అన్నాను. "పోనీ మీరు సర్దుబాటుచేసి ఆ పనేదో పూర్తిచేయించేసి పెద్దవారు మీ నాన్నగారిని తీసుకొచ్చి మీతోపాటు అట్టేపెట్టుకో కూడదటండీ"అని

"ఆయనలా వినేమనిషికాదండీ. అభిజాత్యం, మంకుతనం, శుద్ధనిరంకుశత్వం అన్నీ వున్న మనిషాయన. వారు అలా ధర్మకార్యాలనీ, దానధర్మాలనీ చాలా ఖర్చు చేసేవారు మొదట్నుంచీను. అందుకనే మరి మా తాతగారు ఆస్తిని నాకు చెందేలా రాశారు. మళ్ళీనేను నా పిల్లలకి అంతో యింతో ఆస్తి అప్పజెప్పాల్సిందేకదా. లేకపోతే వాళ్ళేమైపోతారు" అన్నాడు అతను. ఆ మాటలో కాస్త గడుసుదనమూ కనిపించింది. డబ్బువల్లే తన కొడుకు తనకు దూరమై పోయాడని రాధాస్వామిగారు అనుకోవడంలో నిజం లేకపోలేదనిపించింది.

మరోగంట రాధాస్వామిగారితో గడిపి శెలవుతీసుకుని వచ్చేశాను.

"ఎప్పుడైనా యిటువైపు వస్తే కలుస్తుండండి." అన్నారాయన వీడ్కోలిస్తూ.

"అలాగేలెండి మళ్ళీ నెలరోజుల్లో రావాల్సిన పనుంది. మా తమ్ముడికి యీ వూళ్ళో సంబంధం చూస్తున్నాను. ఆ పనిమీద రావాలి. వచ్చినప్పుడు మీ వాడ్ని కూడా తీసుకొస్తాలెండి" అంటూ వెళ్ళిపోయాను.

అనుకున్నట్టుగానే నెలరోజులకు ఆ వూరు వెళ్ళవలసి వచ్చింది. అంతకుముందే రాధాస్వామిగారు విరాళాలు సేకరించడానికి వెళ్ళినట్టు వాళ్ళబ్బాయి ద్వారా విన్నాను. ఆ వూరు వెళ్ళి వెళ్ళడంతోనే రాధాస్వామిగారినే కలుసుకున్నాను. హోటలు దగ్గర కనిపించారు. ఆ వుదయమే వూరునించి తిరిగొచ్చారట ఆయన. డబ్బు బాగానే వసూలు చేశారట.

"అయితే ధర్మసత్రం నిర్మాణం పూర్తి చేస్తారన్నమాట" అన్నాను నేను.

"ఇంకెక్కడి ధర్మసత్రం అండీ. నా శ్రమ ఫలితమంతా బూడిదలో కలిసిపోయింది. మొన్ననే దానికి ప్రారంభోత్సవం జరిగిపోయిందిట. నేను భయపడ్డంతా జరిగింది. ఈ వార్ధక్యంలో మన స్తిమితం లేక ప్రతివాడి దగ్గరకీ జోలిపట్టుకు వెళ్ళి యాచించి డబ్బు కూడేసి ఓ మంచిపనికి పూనుకున్న నా శ్రమయావత్తూ ఎందుకూ కొరగాకుండా పోయింది. ఇలారండి చూద్దురుగాని" అంటూ ధర్మసత్రం భవనం దగ్గరకి తీసుకెళ్ళారు. మధ్యలో ఏం అడిగినా మారు మాట్లాడలేదు.

ధర్మసత్రంయింకా ఫర్లాంగు దూరంలో వుండగానే పెద్దపెద్ద తాటికాయంత అక్షరాలో ఆధర్మసత్రం ముందుబోర్డు కనిపిస్తోంది—దానిమీద "రిక్రియేషన్ క్లబ్" అన్న అక్షరాలు అందంగా తీర్చి దిద్దబడినట్టు రంగుల్లో కొట్టచ్చినట్టు కనిపిస్తున్నాయి.

నాకు మతిపోయింది. "ఏమిటండీ ?" అన్నట్టు ప్రశ్నార్థకంగా రాధాస్వామిగారి ముఖంలోకి చూశాను.

"వూళ్ళో వాళ్ళకి ఏమీ తోచడంలేదట. కాలక్షేపంగా వుంటుందని, ధర్మసత్రం అయితే బయటివాళ్ళకే వుపయోగిస్తుంది కాని ఇదైతే వూళ్ళో వాళ్ళకి వుపయోగిస్తుందని "రిక్రియేషన్ క్లబ్బు" పెట్టేశారట. చూసేరా నేను డబ్బు పట్టుకురావడం ఆలస్యమైతే నేను లేకుండా చూసి ఏంచేశారో......" రాధాస్వామిగారు కళ్ళనీళ్ళు పెట్టుకుని చెప్తున్నారు.

రిక్రియేషన్ క్లబ్బు దగ్గరకు వచ్చేశాం.

ఆయన బైట వుండిపోయారు. నేను లోపల ఎలా కట్టేరో, ఎలా మిగతాభాగం పూర్తిచేశారో చూద్దామని బిల్డింగులోకి వెళ్ళాను.

ఓ గదిలోంచి అయిదారు కంఠాలు హుషారుగా వినిపించాయి. అటుచూశాను.

అక్కడ చాలా జోరుగా, హుషారుగా డబ్బుల గలగలల మధ్య పేకాట సాగుతోంది!



# బూర్గుంపాడు పంచాయతీ సమితి పదేళ్ళ ప్రగతి

ఖమ్మం జిల్లా బూర్గుంపహాడు పంచాయతీ సమితి గోదావరినదికి కుడివైపు తీరంలో ఉంది. 1958 సంవత్సరంలో పాల్వంచ జాగీర్ సంస్థానాన్ని రద్దుచేసి బూర్గుంపహాడు తాలూకాను ఏర్పాటు చేశారు. సంస్థానాధీశుల కాలంలో వ్యవసాయం, విద్య, వైద్య రంగాలలో ఎటువంటి అభివృద్ధిని సాధించడం జరగలేదు. ఈ బ్లాకులో 106 గ్రామాలతో కూడిన 34 గ్రామ పంచాయతీలు ఉన్నాయి. ఇక్కడి జనాభా 84,338 మంది. వారిలో 26,083 మంది గిరిజనులు, 13,745 మంది షెడ్యూలు కులాలవారు ఉన్నారు.

సమాజ వికాస కార్యక్రమంక్రింద 1956 లో బూర్గుంపహాడు బ్లాకును ఏర్పాటుచేశారు. ఆ తర్వాత 1962 లో పంచాయతీ సమితిగా మార్చారు. జిల్లాలోని యితర బ్లాకులతో పోల్చినప్పుడు యీ బ్లాకు చాలా వెనుకబడిన ప్రాంతమని స్పష్టమవుతుంది. తగిన రాకపోకల సౌకర్యాలు లేకపోవడమే ప్రధాన కారణాలుగా చెప్పవచ్చు.

## వ్యవసాయం

బ్లాకును ప్రారంభించక పూర్వం యిక్కడ వ్యవసాయం పురాతన పద్ధతులలో జరుగుతూ ఉండేది. రైతుల ఆర్థిక పరిస్థితి కూడా అంతంతమాత్రంగానే ఉండేది సమాజ వికాస కార్యక్రమాన్ని ప్రారంభించి, పంచాయతీ సంస్థలు ఏర్పాటు చేసిన తర్వాత వ్యవసాయరంగంలో ఆధునిక విధానాలను అనుసరించే కృషి ప్రారంభమైనది. దీనివల్ల వ్యవసాయ ఉత్పత్తులు అధికమైనవి. ప్రస్తుతం 26932 ఎకరాలలో వరి, 57545 ఎకరాలలో జొన్న, 1010 ఎకరాలలో సంకరజాతి జొన్న, 9940 ఎకరాలలో, పొగాకు, 2821 ఎకరాలలో మిరప సేద్యం చేస్తున్నారు.

## సేద్యపు నీటి సౌకర్యాలు

ఈ తాలూకా నుండి గోదావరినది ప్రవహిస్తున్నప్పటికీ తగిన సేద్యపు నీటి సౌకర్యాలు లేవు. బావులద్వారా కూడా సేద్యపు నీరు లభించడం కష్టంగా వుంది. సాధారణ రైతులు తమకుగల పరిమిత వనరులతో భూగర్భాలనుండి నీటిని వెలికి తీసి సేద్యానికి వినియోగించుకోడం సాధ్యమైన పనికాదు. సమితిలోని కొన్ని ప్రాంతాలలో 130 బోరింగ్ బావులు పనిచేస్తున్నాయి, తుమ్మల చెరువు, పౌరంట్ల చెరువు సమితిలోని రెండు పెద్ద జలాశయాలు. వాటి క్రింద వరుసగా 4114 ఎకరాలు, 624 ఎకరాలు సాగు అవుతున్నాయి. ఎక్కువ ఖర్చుతో పెద్దఎత్తున మరమ్మతులు అవసరమైనందున యీ రెండు చెరువుల ద్వారా కూడ గరిష్ట పరిమితిలో లాభం పొందడానికి వీలు లేకుండావుంది.

గోదావరినది తీరంలో లిఫ్టు ఇరిగేషన్ పథకాన్ని అమలు జరిపే ప్రతిపాదన పరిశీలనలోవుంది. ఈ పథకానికి ప్రభుత్వ మంజూరీ లభించాల్సివుంది.

## విద్యుచ్ఛక్తి

సమాజ వికాస బ్లాకు ఏర్పాటుకాకముందు యీ సమితిలో ఏగ్రామానికీ విద్యుచ్ఛక్తి సరఫరా లభించలేదు. కొత్తగూడెం థర్మల్ స్టేషన్ నిర్మించబడిన తర్వాత 1966లో ఐదు గ్రామాలకు మాత్రమే విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడింది. గత సంవత్సరం తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకం క్రిందమరో 7 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు. 1972–73 సంవత్సరం ఆఖరునాటికి తాలూకా అంతటికి విద్యుచ్ఛక్తి లభిస్తుదని ఆశించబడుతున్నది.

## విద్య

సంస్థానాధీశుల పరిపాలనా కాలంలో విద్యారంగాన్ని పూర్తిగా విస్మరించడం జరిగింది. సమాజవికాస కార్యక్రమం అమలుకు పూర్వం ఒక ఉన్నత పాఠశాలకూడలేదు. ఇప్పుడు సమితిలో ఒక జూనియర్ కళాశాల, ఒక బాలికల ఉన్నత పాఠశాలతోపాటు ఐదు సెకండరీ పాఠశాలలు, పదకొండు అప్పర్ ప్రాథమిక పాఠశాలలు, 75 ప్రాథమిక పాఠశాలలు ఉన్నాయి. వాటిలో 3,273 మంది బాలలు, 1546 మంది బాలికలు విద్యనభ్యసిస్తున్నారు గత పదేళ్ళ కాలంలో సమితిలో 60 మంది విద్యార్థులతో రెండు హరిజన హాస్టళ్లు, ఒక గిరిజన బాలికల హాస్టల్ ప్రారంభించారు. కోయిడా గ్రామంలో ఆశ్రమ పాఠశాల నిర్మాణానికి జిల్లా పరిషత్తు అనుమతించింది. నిర్మాణం పని చురుకుగా కొనసాగుతున్నది. 25 పాఠశాల భవనాలను నిర్మించారు.

## వైద్య సౌకర్యాలు

సమితిలో వైద్య సౌకర్యాలు కల్పించడంలో— ముఖ్యంగా గిరిజన ప్రాంతాలలో వైద్య సహాయం అందజేయడంలో గణనీయమైన అభివృద్ధిని సాధించారు. బూర్గంపహాడులో తాలూకా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రితో పాటు పినపాకలో ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం, నాలుగు గ్రామీణ వైద్యశాలలను సమితి ఏర్పాటు చేసింది. కుకునూరులో గిరిజనుల నిమిత్తం వైద్యశాల, అశ్వాపురంలో ఆయుర్వేద వైద్యశాలలను నిర్వహిస్తున్నారు. తగిన కమ్యూనికేషన్ సౌకర్యాలులేని కారణంగా సమితి ప్రాంతమంతటా వైద్య సౌకర్యాలు తగినంతగా కల్పించలేకపోయారు. సమితి ఆధ్వర్యంలో 4 పశువైద్యశాలలు పనిచేస్తున్నాయి.

## కమ్యూనికేషన్ సౌకర్యాలు

సమితి ప్రాంతంలో తగిన కమ్యూనికేషన్ సౌకర్యాలు లేని కారణంగా అభివృద్ధి కార్యక్రమాల అమలులో యిబ్బందులు ఎదు రవుతున్నాయి. సమితి హెడ్ క్వార్టర్స్‌తో కొత్తగూడెంను కలుపుతూ 8 మైళ్ళదీ, గోదావరి వంతెనను కలుపుతూ 6 మైళ్ళదీ రెండు పక్కా రోడ్లు మాత్రమే ఉన్నాయి. సమితి ప్రాంతంలో కృష్ణాసాగర్ నుండి ఏటూరి నాగారం వరకు 80 కి. మీ. రోడ్డును నిర్మించే పనిని పబ్లిక్ వర్క్స్ శాఖవారు చేపట్టారు. 35 కి. మీ. రోడ్డు పట్టిపని పూర్తి అయింది. వర్షకాలంలో రాజమండ్రి నుండి వెంకటాపురం వరకు నిర్వహించబడే స్టీమ్‌లాంచీలే రాకపోకలకు ఉపయోగిస్తున్నారు. రోడ్ల నిర్మాణం అధిక వ్యయంతో కూడిన పనికావడంతో సమితికానీ, జిల్లా పరిషత్తుకానీ యీ కార్యక్రమాన్ని చేపట్టలేక పోతున్నాయి. ప్రభుత్వమే, యీ ప్రాంతంలో కమ్యూని కేషన్ సౌకర్యాలు కల్పించడానికి ముందుకు రావాలి.

## పరిశ్రమలు

సమితిలో పరిశ్రమల అభివృద్ధికి మంచి అవకాశాలు ఉన్నా యి. ఇక్కడ 9910 ఎకరాలలో పొగాకు ఉత్పత్తి అవుతున్న దృష్ట్యా ఒక సిగరెటు ఫ్యాక్టరీని నెలకొల్పవచ్చు. 3,13,584 ఎక రాల మేర అటవీప్రాంతం ఉన్నదృష్ట్యా కలపకు సంబంధించిన పరిశ్రమలను కూడా ఏర్పాటు చేయవచ్చు. కమ్యూనికేషన్స్ కొర త కారణంగా పరిశ్రమలను ఏర్పాటు చేయడానికి ప్రైవేటు పారి శ్రామిక వేత్తలు ముందుకు రావడంలేదు.

## దర్శనీయ స్థలాలు

సమితి ప్రాంతంలో యాత్రికులను ఆకర్షించే దర్శనీయ స్థలాలు అనేకం ఉన్నాయి. రుద్రమకోట, కూనవరం మధ్య రమణీయమైన ప్రకృతి దృశ్యాలు నేత్రానందం కలిగిస్తాయి. దట్ట మైన అడవులతో నిండిన పాపికొండలు కూడ చూడదగినవే. పేరంటపల్లి గ్రామంలోని శ్రీ బాలానందస్వామి ఆశ్రమాన్ని రాష్ట్రంలోని నలుమూలలనుండి యాత్రికులు వచ్చి దర్శిస్తుంటారు. బూర్గంపహాడుకు 8 కి. మీటర్ల దూరంలో ఉన్న రావిగుండంలో కేదారేశ్వర స్వామి దేవాలయం ఉంది. ఈ దేవాలయంలోని లింగం హరిహర రూపంలో కనిపిస్తుంది. కేరళ రాష్ట్రంలో మినహా దేశంలో మరేయితర ప్రాంతంలో యిటువంటి లింగం కనిపించదు. ఈ దేవాలయాన్ని గూర్చి ఆసక్తికరమైన అనేక కథలు ఉన్నాయి.

ఈ సమితి ప్రాంతలో పురావస్తు శాస్త్రజ్ఞులకు ఆసక్తి కలి గించే అనేక పురాతన కట్టడాలు లభిస్తాయి. స్థానికంగా ప్రజలు వాటిని " రాకాసిగుళ్లు " అంటారు. బూర్గంపహాడుకు 50 మైళ్ళ దూరంలో ఉన్న బయ్యారం, మల్లారం, జానంపేట సమీపంలో యిటువంటి గుళ్ళు ఎన్నో ఉన్నాయి. 30 అడుగుల పొడవుతోను, కొన్నిచోట్ల మైళ్ళతరబడి దేవాలయం మాదిరి కట్టడాలు ఉన్నాయి. కొన్నిచోట్ల యివి చిన్నపాటి పట్టణాలుగా కూడా కనిపిస్తాయి. పూరాతన కాలంలో వాటిని ఆయుధగారాలుగా ఉపయోగించేవారని చెప్పుతుంటారు. వాటిని మానవుల మృతశరీరాల పరిరక్షణకు ఉపయోగించేవారని మరో నానుడి ఉంది.

ప్రభుత్వం ప్రత్యేకంగా నిధులను సమకూరుస్తున్న దృష్ట్యా సమితి అభివృద్ధిచెందడానికి మంచి అవకాశాలు ఉన్నాయి. నక్స లైట్ల ప్రభావాన్ని తొలగించడానికి యీ సంవత్సరం గిరిజన ప్రాంతంలో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతో అభివృద్ధి-కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నది.

---

# సాహిత్య అకాడమీ బహుమతులు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏటా సాహిత్యంలోని వివిధ శాఖలలో యిచ్చే బహు మతుల కార్యక్రమం క్రింద 1970-71 సంవత్సరానికి బహుమతులను ప్రకటించింది. ఈ బహు మతుల క్రింద ఒక్కొక్కరికీ రూ. 1,116 లు చొప్పున యివ్వడం జరుగుతుంది.

బహుమతులు —

కథలు : స్వర్గీయ మల్లాది రామకృష్ణశాస్త్రి (మల్లాది రామకృష్ణ శాస్త్రి కథలు )

విమర్శ : శ్రీ తిరుమల రామచంద్ర ( సాహితీ సుగతుని స్వగతం )

కవిత : శ్రీ కుందుర్తి ఆంజనేయులు ( నగరంలో వాన )

నవల : శ్రీ దాశరధి రంగాచార్య (చిల్లర దేవుళ్ళు )

నాటకం : శ్రీ మోదుకూరి జాన్సన్ ( నటనాలయం )

# ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ కవిసమ్మేళనం

## త్రిలింగోదాహరణం

బోయి భీమన్న

శ్రీ కాళేశ్వర సూర్య చంద్ర గతులన్,
    శ్రీశైల మల్లీశ్వరే
చ్ఛా కల్యాణ గుణామృత ద్యుతుల, ద్రా
    క్షారామ భీమేశ్వర
ప్రా కామ్య స్థితులన్ రహించెడి నవాం
    ధ్ర శ్రీ—త్రిలింగోర్వి—అ
న్నా కారేశ్వరి సభ్యకోటికి సమ
    స్తానందముల్ పంచుతన్।

## ఏకధార

జె. బాపురెడ్డి

గోదావరి కృష్ణ నేడు
కూడి పాడగా
ప్రతి ఆంధ్రుని ఎద సమైక్య
భావమాడెగా।
జాతినిచీల్చిన గోడల
జాడ మాసెరా
మూగవడ్డ వీణ తిరిగి
మ్రోయ సాగెరా।
కలలు నిజములై కన్నుల
కాంతి నించగా
చరిత్రలో స్వర్ణయుగం
తిరిగి మొలిచెరా!
గతము నుండి గుణపాఠం
గరచి మెలగరా

ద్వేషానైక్యతలు సమా
ధిలో పూడ్చరా।
ప్రేమవనం నాటుయశ
శ్రీలు పూయగా
శ్రమామృతము చల్లు సుఖం
జాలువారగా।
పగిలిన ప్రతిజాతి గుండె
పదిల పడెనురా

ప్రతిజాతియు స్వీయగృహము
ప్రవేశించెరా।
జాతిజాతికల భారత
జాతిమనదిరా
శాంతి క్రాంతి కోరు తెలుగు
జాతిమనదిరా।
సత్యైక్యత విశ్వప్రేమ
గీతిపాడరా
నవ్య జీవితాభ్యుదయో
త్సవము సేయరా!
గోదావరి కృష్ణ నేడు
కూడి పాడగా
మహాంధ్రోదయ సౌభాగ్య
మహిమపాడరా।

# తెలుగుజాతి వన్నెలజెండా

పోతుకూచి సాంబశివరావు

ఆంధ్రప్రదేశ్ అవతరించిందా?
ఎప్పుడు?
తెలుగుమాత జిలుగు నవ్వుల
వన్నెలజెండా
స్వేచ్ఛా చైతన్య సమతల గగనంలో ఎగిరిందా?
ఏమో!! కాని కనిపించటంలేదు
తెలుగు వాని నోట నిత్యం
ఇంగ్లీషు తాంబూలం నలుగుతూనే వుంది
నఖశిఖ పర్యంతం విదేశ
వేష భంగిమ నృత్యం జరుగుతూనే వుంది
వడ్డించే విస్తరిని అడ్డంగా చించే
యుగంధర మతి భ్రమణ రాజనీతి సాగుతూనే వుంది
దండకారణ్య నివాసులు పురాతన
తరతరాలనే జ్ఞాపకాల ప్రదర్శనలు జరుగుతూనే వున్నాయి.
మరి, ఆంధ్రప్రదేశ్ అవతరించిందా?
ఎప్పుడు?
బస్సుల్లో పోతూ బస్సు రొదకంటె బిగ్గరగా
'బత్యు' మని మాట్లాడుకోడం మాననేలేదు
ప్రక్కవాని అదృష్టంచూచి ఫకాలుమనే
కృత్రిమ రోదనలు ఆగనేలేదు
'ఆత్మహత్య వద్దు' అంటూ కారు హారన్ మ్రోగినా,
మ్రోగి, కృష్ణశాస్త్రి నేటి గొంతులా మూగపోయినా
నడిరోడ్డు మధ్య వృషభంలా ఏదైనా నములుతూ
నిర్లక్ష్యంగా నిలుచునే నిషా తగ్గనేలేదు.
యువతరాలకు ప్రేమ జపం, ఇతర తరాలకు ధనం తపం
కోతికి కొబ్బరికాయ సూక్తిలా నేడూ వుంది.
ప్రథమంలో గౌరవించినందుకు
పెద్దమనిషి స్నేహం పెంచితే, తుదకు
వెధవగా జమకట్టే
అలవాటు మాననేలేదు.
కుటుంబాలను యంత్రాలుగా మార్చే
మానవత్వ సంహారక పథకాలబలి సరదా తీరనేలేదు.
ఆధునిక సంశ్లిష్ట సమాజం
శాతవాహన శకటంగామారి
సంప్రదాయ ప్రతిపత్తి యింకా చూపిస్తూనే వుంది.
మరి, ఆంధ్రప్రదేశ్ అవతరించిందా?
ఎప్పుడు?
గతించిన పొట్టి శ్రీరాములు, ప్రకాశంకేసరి
తెలుగుదేశం పొలిమేరల కావల
విదేశాల తెలుగు సదనాలలో విశ్రమిస్తున్నారు
ప్రపంచ యాత్ర రథమెక్కిన తెలుగు ప్రతినిధులు
పాశ్చాత్య సంస్కృతి బండారంతో
చక్ర భ్రమణం చేస్తున్నారు.
నాయకత్వం, వినాయకత్వం, అనేకత్వం
త్రిమూర్తి స్వరూపత్వం మతం
వల్లించిన పూజలు జరుగుతూనే వున్నాయి.
ఆధ్యాత్మిక బురఖాలలో నడుస్తున్న
ఆధునిక వినోద బాబాల
ఆశ్రమాలలో మై మరిచే
ఆనంద సేవ సాగుతూనే వుంది
మరి, ఆంధ్రప్రదేశ్ అవతరించిందా
ఎప్పుడు ?
గోదావరికి కృష్ణదూరం
కృష్ణకు మూసీ దూరం—అయితే
వరదల సమయంలోనే అంతా సన్నిహితం, సమం
పల్లాలు ముంచిన నీరు
ఉపరితలంలో సమతలంగా మెరుస్తుంది
హృదయ నిమ్నోన్నతాలు ముంచి
మధుర మమతలనీరాలు నించి
బ్రహ్మానంద చైతన్య మూర్తులుగా పరవశించి
తెలుగుజాతి నవసమాజ నవోదయ
రాగాలు ప్రకాశించి
వెలుగుదారులు తీర్చిననాడు
ఆంధ్రప్రదేశ్ అవతరించింది
నిజం, అవతరించింది
అని వ్రాస్తాను..
తెలుగుజాతి వన్నెల జెండా
వెలుగు నీడల్లోహసిస్తాను.

# బహుపరాక్

## కుందుర్తి

ఎందుకో యివ్వాళ నాకు
మహాచెడ్డ కోపంగావుంది
ఈ సభ పెటిన సంఘం వారి మీద,
ప్రొదుపోక యిక్కడ చేరిన శ్రోతలమీద, నేతలమీద.
పిలిచారు కాబట్టి వచ్చానుగాని నిజానికి
ఆంధ్రులెవరో అరవలెవరో అసలే తెలీదు నాకు
తెలుగువారికి యీ మధ్యపుట్టిన తెగులేమిటో తెలీదు నాకు
అనైక్యత బీజాలు నాటిన వారికి నికరంగా వచ్చిన
ఆదా ఎంతో తెలీదు నాకు
చరిత్రను వెనక్కు మళ్లింపజూస్తున్నవారి
చేతుల్లో ఎంత బలముందో తెలీదు నాకు
ఇల్లలుకుతూ అలుకుతూ ఈగ
తనపేరు తాను మరిచిపోయినట్లు

ఇటీవల మన తెలుగువాళ్ళు తమ ఊరూ పేరూ మరిచిపోయి
ఊరేగారు వీధులవెంట
ఇక్కడ మేం రాగాలు తీసి చదువుతోంటే
హాయిగా ఆవులిస్తూ అక్కడకూచున్న
వేలాది ప్రేక్షక మహాశయులకు
వినయపూర్వక విజ్ఞప్తి
మధ్యలో చప్పట్లు కొట్టడం తప్పనిసరైతే
చప్పుడు లేకుండా కొట్టండి
మీ ప్రక్కనే కూచొని కునుకు తీస్తున్న
మిత్రుల్ని యిబ్బంది పెట్టకండి.

అవును ప్రజలు నిజంగా నిద్రపోతున్నారు.
చైతన్యం చంద్రమండలానికి వలసపోయింది.
మనిషి కత్తికి పదును పోయింది.
చరిత్ర పొలంలో నాటదలచుకున్న
పైరుకు అదును పోయింది.
ఏడాది కొకసారి వస్తాం, కవులం మేము
అంతా పగటి వేషగాండ్ల తంతు !
విన్ననాలుగు మంచిముక్కలూ యీ హాల్లోనే
విడిచిపెటి పోవడం మీవంతు
ఇచ్చిన సంభావనా శాలువా భద్రంగా ఇల్లు చేర్చుకోవడం మావంతు
ఈ రొటీన్ సంబరాలకు, సంరంభాలకు
ఇది మొదలు యిది చివరనిలేదు
కాలం జీవనదిలా పారిపోతుంటే
చేపల్లా తేలి పోతుంటాం మనం
అయినా యీ నాడు మనకు గుర్తొస్తుంది
ఆంధ్రప్రదేశ్ అనేది ఒకటివుందని
అందరం తెలుగువాళ్లమనే ఒక వూహ
మెదడులో మెరుపులా మెరుస్తుంది
అంతటితో ఏమైంది?
అందరం కలిసి ఏదో సాధించాలి.
ఎంతకూ రాని సోషలిజం కోసం
ఎదురుచూసి కండ్లు లొట్టలు పోతున్నాయి.
కళ్లంలో గాలి తిన్న తాలుగింజలు పోను
మిగిలినవి పిట్టలు తిని పోతున్నాయి.
పెరిగిన ధరల గుర్రాలమీద
పెద్దవ్యాపారులు ఊరేగుతున్నారు
సామాన్య ప్రజల కన్నీటి వర్షాలకు
నదులు పొంగి వరదలొస్తున్నాయి
పామరుడు పొదలో పొంచికూచున్నాడు
పాములా కాటేస్తాడు బహుపరాక్.
తెల్లవారకుండా సూర్యుడికి మబ్బులు అడ్డంవేస్తున్న
బడాబడా ఖామందులు బహుపరాక్.

# ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ కవిసమ్మేళనం

# గోలకొండ వద్ద మధ్యయుగంనాటి కట్టడాలు

—— మహమ్మద్ అబ్దుల్ వహీద్ ఖాన్

గోలకొండ కోటకు ఈశాన్య దిశలో ఆరు ఫర్లాంగుల దూరంలో మధ్యయుగానికి చెందిన కట్టడాలు కొన్ని కనుగొనబడినాయి. 1968 ఫిబ్రవరి నెలలో ఈ ప్రాంతంలో ఒక చిన్న మట్టిగుట్టక్రింద త్రవ్విన త్రవ్వకాలలో ఇంతవరకు మనకు తెలియకుండా వుండిన కుతుబ్‌షాహి రాజుల చరిత్రకు సంబంధించిన శిల్పకళా విషయాలు కొన్ని బయలుపడినాయి.

కుతుబ్‌షాహి రాజుల గోరీల క్రింద ఒక పైపులైను విషయం పరిశోధన చేయగా భూ గర్భంలో కొన్ని కట్టడాలు వున్నట్లు తెలిసింది. ఇది తొలి కుతుబ్‌షాహి రాజుల కాలానికి చెందినదని భావించ బడుతున్నది. ఇది భూగర్భంలో చతురస్రాకారంలో నిర్మించబడిన సుందర భవనం. ఈ భవనం మధ్యభాగంలో గ్యాలరీలు, వాటికి ఆధారంగా కొన్ని ఆర్చీలు వున్నాయి. మధ్యభాగంలో ఒక నీటిగొట్టం కూడా వుంది. ఈ భవనానికి నాలుగుమూలలో బంక మట్టితో నిర్మించబడిన నీటిగొట్టాలు వున్నాయి. భూగర్భ మందిరంలో వరండాలు, గ్యాలరీలలో ఉష్ణోగ్రతను అదుపులో వుంచడానికి ఇవి ఉపయోగించబడినాయి. దీనికి ఉత్తర దిశన కొన్ని సోపానాలు వున్నాయి; ఇవి వేసవికాలంలో ఉపయోగపడే మందిరానికి దారి తీస్తాయి.



త్రవ్వకాలలో బయట పడిన వేసవి మందిరం



37









1 చైనా భాషలో అక్షరాలుగల పింగాణీ పాత్రల శిధిల శకలాలు

2 విలువైన వజ్రాలు పొదిగిన పద్మాకారపు బంగార్వుంగరం—ప్రక్కనుంచి

3 కుతుబ్‌షాహి కాలంనాటి బూడిదరంగు పింగాణీ పాత్ర

4 ఉంగరం—ఎదుటినుంచి

5 నీటి నిలువవుండే గదీ, దాని నుంచి నీటిని తీసుకుపోయే గొట్టాలతో కూడిన వేసవి విడిది భవనం—త్రవ్వకాలలో బయల్పడినప్పటి పైభాగం

6 ఎర్రమట్టి ఏనుగుబొమ్మ

7. వేసవి విడిది భవనానికి నీటిని తీసుకుపోయే గొట్టాలు

8. ఒక గదిలో కనిపించిన గాడి పొయ్యిలు.



## కట్టడం విశేషాలు

ఉత్తర, దక్షిణ, తూర్పు భాగాలలో చల్లని గాలి ప్రవేశించడానికి తగిన ఏర్పాట్లు చేయబడినాయి. దక్షిణ దిశలో 1.85 మీటర్ల పొడవు 1.4 మీటర్ల వెడల్పుగల చిన్నగది ఒకటి వుంది. దీని ఎత్తు సుమారు 1.85 మీటర్లు ఉంటుంది. పై కప్పు భాగమంతా బంకమట్టితో కప్పబడివున్నట్లు త్రవ్వకాలవల్ల తెలుస్తున్నది. ఇక్కడ చల్లగా వుండడానికి శిల్పులు వాసు ఏర్పాటు చేసి వుంటారని ఊహించబడుతున్నది.

ఈ కట్టడానికి అత్యంత సమీపంలో 1.2 మీటర్లలోతున కాల్చిన బంక మట్టితో నిర్మించబడిన నీటి గొట్టాలు ఉత్తర దక్షిణాలుగా అమర్చబడివున్నాయి. వాయు పీడన శక్తితో ఈ గొట్టాలగుండా నీరు ప్రవహించే ఏర్పాటు చేయబడివుంది. సైఫన్ సూత్రం ఆధారంగా ఈ ఏర్పాట్లు చేయబడినాయని రుజువు అవుతున్నది. ఔరంగాబాదులో హాహేరేమాలిక్ అంబర్ లోకూడా ఇట్టి ఏర్పాట్లు వున్నాయి.

## సుందర ఉద్యానవనం

కుతుబుషాహి రాజుల కాలంలో ఈ ప్రాంతంలో సుందర ఉద్యానవనం ఒకటి వుండేదని ఆకాలం చరిత్రనుబట్టి తెలుస్తున్నది. ఇదే బాగ్–ఇ–ఫయాజ్ అసార్ అని ప్రసిద్ధి చెందింది. ఆసఫ్–ఇ–గుల్జార్ లోకూడా దీని ప్రస్తావనవుంది. తరువాత కాలంలో ఇది రాజభవనంలోని ఉద్యానవనంగా మార్చబడింది. కుతుబ్‌షాహి రాజుల సుందర భవనాలు ఇక్కడ నిర్మించబడినట్లు మనకు తెలుస్తున్నది.

పురావస్తు శాఖ ఈ ప్రాంతంలో రెండవసారి త్రవ్వకాలు సాగించినపుడు, తొలి కుతుబ్‌షాహి రాజుల విశాల రాజభవనాలు కనుగొనబడినాయి. ఈ రాజభవనంలో దీర్ఘ చతురస్రాకారంలో 36 గదులు వున్నాయి. వీటి గోడలు ఆకర్షణీయమైన పెంకులతో అలంకరించబడినట్లు తెలుస్తున్నది.

గదులకుముందు ఫౌంటెన్‌లు వున్నాయి. ఇవి అనేక తీరులలో శోభాయమానముగా అలంకరించబడి వున్నాయి. స్నానములకు జలక్రీడలకు జలాశ్రియములుకూడా ఏర్పాటు చేయబడి ఉన్నాయి. ఈ స్థలములోనికి సుమారు మూడు మైళ్లదూరంలో "దురాగ్" అనే చెరువు నుంచి గొట్టాలద్వారా నీరు సరఫరా అవుతూ వుండినట్లు తెలుస్తున్నది. కుతుబ్‌షాహి రాజులు ఈ రాజభవనాన్ని విందు భోజనాలకు ఉపయోగించేవారని తెలియడానికి యిక్కడ కొన్ని నిదర్శనాలు లభించినాయి.

## చారిత్రిక పురావస్తువులు

త్రవ్వకాలకు దక్షిణ దిశలో మూడు, ఉత్తర దిశలో ఒక బావి కనుగొనబడినాయి. ఈ బావులలో మట్టిని వెలికి తీయగా కప్పులు, గిన్నెలు, పళ్ళెరములు, పూసలు, బంగారు ఉంగరములు మున్నగునవి లభించినాయి. దొరికిన ఉంగరం కమలం ఆకారంలో వజ్ర వైడూర్యములతో పొదుగబడి వుంది. ఉంగరం మధ్య ఖాళీగా వుంది. బహుశ ఇందులో చిన్న అద్దం కానీ, వజ్రం కానీ వుండివుండవచ్చు. ఏది ఏమైనా ఇది రాజులు ధరించిన ఉంగరమని భావించవచ్చు.

## చైనా దేశపు పింగాణి పాత్రలు

నీలం, తెలుపు వర్ణములలో వివిధ చిత్రములతోను వస్తువులు బయలుపడినాయి. ఇవి 14 వ శతాబ్దం ఆరంభంలో చైనా దేశంలో తయారుచేయబడి వుండవచ్చు. వీటి ఉత్పత్తి పరిమితమై ఉండినప్పటికీ, ఇవి ఇండోనీషియా, ఇండియా, తూర్పు ఆఫ్రికా, పర్షియా దేశాలలో బాగా ప్రచారంలో ఉండినాయి. కుతుబ్‌షాహి రాజులకు సమకాలీనులైన చైనా దేశపు మింగ్ వంశ రాజుల కాలంనాటి కర్మాగారాలు ఈ రకం పింగాణీపాత్రలను విరివిగా ఉత్పత్తి చేసేవి. 16 వ శతాబ్దంలో పోర్చుగీసు దేశస్థులు వీటిని దిగుమతి చేసుకొని పశ్చిమ భారత దేశంలో వ్యాపారం చేస్తూ వుండేవారు. కొన్ని అపూర్వమైన పింగాణీ పాత్రలు కుతుబ్‌షాహి రాజులకు బహూకరించివుండవచ్చు. చైనా కళాకారులు చిత్రకళలలో నిపుణులు.

పింగాణి పాత్రలు మాత్రమేకాకుండా ఇనుప మేకులు, పిడి బాకులు, కత్తులు, కత్తెరలు యెర్రమట్టి బొమ్మలు, దీపాలంకరణ వస్తువులుకూడా ఈ త్రవ్వకములలో బయటపడినాయి. విజయనగర చక్రవర్తి సదాశివరాయలు నాటి బంగారునాణెంకూడా ఒకటి ఇక్కడ దొరికింది. ఇవి హైదరాబాదు నగరనిర్మాత అయిన కులీకుతుబ్‌షాహి కాలానికి చెందినవి.

ఈ రాజభవనం 16 వ శతాబ్దానికి చెందినది. రాజభవనం శిథిలాలు, వేసవిమందిరం మున్నగు వాటినిబట్టి, ఇంతవరకు మనకు తెలియని కుతుబ్‌షాహి రాజుల కాలంనాటి సాంస్కృతిక, సాంఘిక, ఆర్థిక విషయాలు కొన్ని ఇప్పుడు ఈ త్రవ్వకాలలో బహిర్గతమవుతున్నాయి.



## చైతన్యమూర్తులు

# సాహసయాత్రికుడు - ఖాసా

**( జననం : 23 జనవరి 1896 )**

శ్రీ ఖాసా సుబ్బారావుగారు తత్త్వశాస్త్రంలో పట్టభద్రులు. ఉపాధ్యాయవృత్తిని చేపట్టి మాధ్యమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడిగా పనిచేశారు. అధ్యాపక వృత్తినించి ఆయన రాజకీయాలలోకి ప్రవేశించారు. కందుకూరులో ఉపాధ్యాయుడిగా వున్న ఆయన, నెల్లూరు జిల్లా గ్రామాల్లో గాంధీజీ సందేశాన్ని వ్యాపిచేసే కార్యకర్త అయ్యారు.

గాంధీజీ అనుయాయుడైన ఆయన, గ్రామీణ కార్యకర్తగా ఒకానొక సందర్భంలో మద్రాసుకు వెళ్ళవలసి వచ్చింది. అక్కడ ఆయన ఒక సింహం గుహలోకి అడుగు పెట్టడం జరిగింది. ఆ సింహమే టంగుటూరి ప్రకాశం। ఆ గుహే స్వరాజ్య అనే ఆంగ్ల దినపత్రిక కార్యాలయం. ఆ రోజున ఆంధ్రకేసరి సంపాదకీయ గర్జ చేయడానికి బద్ధకించారు. ఆ పని సుబ్బారావుగారు చేసిపెట్టారు. ఆ గర్జన అచ్చంగా సింహగర్జన లాగానేవుంది. దానితో గొర్రెపిల్లలాటి అధ్యాపకుడు పాత్రికేయుడనే సింహంగా మారిపోయాడు.

జీవితంలో అవకాశాలు అరుదుగా వస్తాయి. అయితే యీ అవకాశాలను సకాలంలో సద్వినియోగం చేసుకోవడం అనేది భగవత్ప్రేరితమైన సంఘటన. శ్రీ ఖాసా జర్నలిజం అనే మహాసముద్రంలో ప్రయాణం ప్రారంభిచారు; మనుషుల్లోని మోసానికి వ్యతిరేకంగా, మానవతా ప్రతిష్ఠాసాధనకు ప్రారంభంగా.

శ్రీ సుబ్బారావు, శ్రీ కృపానిధి—యీ యిద్దరే "స్వరాజ్య" పత్రిక సర్వభారాన్ని తమభుజస్కంధాల మీద మోయవలసి వచ్చింది. అచిరకాలంలోనే ఆ పత్రిక మూతపడింది. ఓటి పడవలా మునిగిపోయింది.

రచనా సాగర తలంమీద సాహితీ సాహసయాత్రగావిస్తోన్న శ్రీ ఖాసా, తన యాత్రలో అనేకరకాల పడవలమీద ఎక్కవలసి వచ్చింది. కలకత్తా పత్రిక 'ఇండియన్ ఫైనాన్స్'లో, బొంబాయి పత్రిక 'ఫ్రీ ప్రెస్ జర్నల్‌లో' మద్రాసు పత్రిక 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో పాత్రికేయుడిగా పనిచేశారు. చివరికి అవేవీ తనకు నచ్చక తన మనసు మెచ్చిన రీతిలో స్వతంత్ర వారపత్రికను ఏర్పాటు చేసుకుని యాత్రసాగించారు. తర్వాత దాన్నికూడా వొదులుకొని 1957 లో స్వరాజ్య వారపత్రికను స్వంతంగా తయారుచేసుకుని తన సాహసయాత్రను కొనసాగించారు. అదే ఆయన కడపటి యాత్ర.



పత్రికా స్వాతంత్ర్యానికి పాటుపడుతూ శ్రీ ఖాసా స్వాతంత్ర్యోద్యమంలో కూడా దీక్షతో పాల్గొన్నారు.

శ్రీ ఖాసా సుబ్బారావు మూడుసార్లు రాజకీయ కారాగార వాసాన్ని అనుభవించారు. పోలీసులు కొట్టిన నిర్దాక్షిణ్యమైన దెబ్బలకు రెండుసార్లు యించుమించు ప్రాణం పోయినంత పనైంది. విదేశీ వస్త్రబహిష్కరణ సమయంలో పికెటింగ్ జరుపుతున్న ఆయనను పోలీసులు స్పృహలేకుండా చావబాదారు. ప్రకాశం వీరయోధుడిలా బ్రిటిష్ వారి తుపాకులకు తన ఛాతీని ఎదురొడ్డగా, ఖాసా, సత్యాగ్రహిలోని అచ్చమైన సాధుత్వంతో, సంయమనంతో రెండుచేతులూ జోడించి పోలీసు లాఠీలకు తననుతాను అర్పించుకున్నారు. శారీరకమైన బాధను తను ఎంతవరకు తట్టుకోగలడో పరీక్షించాలనుకున్నాడు ఆయన. సహనశక్తి మనసుకు వున్నదిగాని ఆయన శరీరంలోని రక్తమాంసాలు దానికి తట్టుకోలేక పోయాయి. స్పృహతప్పి పడిపోయారాయన. ఆ దెబ్బల నుంచి కోలుకోడానికి

ఆయన ఆరువారాలపాటు ఆసుపత్రిలో చికిత్స పొందవలసి వచ్చింది.

శ్రీ ఖాసా సుబ్బారావుకు రచనే జీవనం. స్వేచ్ఛే ఆయన ఊపిరి. సి. ఆర్. చెప్పినట్టు ఖాసాలోని ప్రతిభ పరాకాష్ఠ 'సాకా' రచనలు. ఆయన వ్రాసిన 'సైడ్‌లైట్స్' వెలుగునీ, వేడినీ కూడా ప్రసారంచేసిన రచనలు. పాఠకులకు నిజమైన ఆనందాన్నిచ్చి వాళ్ళ అభిమానాన్ని చూరగొన్న రచనలవి. వ్యాఖ్యానం నిర్భయం లోంచి రావాలి. అయితే వార్తా సవాలను మర్చిపోకూడదు. అవి చాలా పవిత్రమైనవి—అనే సి. పి. స్కాట్ చెప్పిన విషయాన్ని ఖాసా జీర్ణించుకున్న వ్యక్తి. వార్తా విషయాలను విస్మరించకుండా నిర్భయంగా వ్యాఖ్యానం చేయడం ఖాసా అలవరచుకున్నారు.

పెద్దవాళ్ళూ, ప్రసిద్ధుల మీద తన కలం సిరా చిలికించడంలో ఖాసా ఎప్పుడూ వెనకంజ వేయలేదు. రాజాజీ అంటే ఖాసాకు అమితమైన గౌరవం. అయితే సమయం వచ్చినప్పుడు ఆయన్ను ఎదిరించనూ మానలేదు. ప్రకాశం గారిని ఖాసా పిచ్చిగా ఆరాధించేవాడు. అయినా ఆయన చేసినపని సరైనదికాదనిపించి నప్పుడు నిర్భయంగా ఎదుర్కొనేవాడు. ఖాసా నిర్భయంగా, నిర్మొహమాటంగా, సత్యమార్గంలో తనకు తోచినట్టు వ్రాస్తారని రాజాజీ ఒకసారి అన్నారు.

అమెరికా స్టేట్ డిపార్ట్‌మెంట్‌వారి ఆహ్వానం మీద అమెరికాలో పర్యటించిన సందర్భంలోకూడా ఆయన అదేవిధమైన బాధ్యతను, అదేవిధమైన నిర్భయాన్ని ప్రదర్శించారు. 'స్వేచ్ఛా ప్రపంచం బరువుబాధ్యతలన్నిటినీ తన భుజాలమీద వుంచుకున్నట్టు అమెరికా ప్రవర్తిస్తోంది. స్వేచ్ఛాసమరంలో మీ దేశం తన లక్ష్యాన్ని తాను నిర్వర్తించాలంటే పాశ్చాత్యవలస విధానాన్ని వొదులు కోక తప్పదు' అని 'డెయిలీ గ్లోబ్'కు యిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు.

తన ఆంధ్ర సహచరులంతా ఉత్తర హిందూస్థానంలోని మినార్‌ల, మసీదుల ఆకర్షణకు లోనైతే ఖాసా మాత్రం మద్రాసులోని సుందర గోపురాల ఆకర్షణలో మునిగినట్టు అనిపిస్తుంది. ఖాసా 1961 జూన్ 16 న మద్రాసులోనే స్వర్గస్థు లయ్యారు.

ఖాసా, ఆంగ్లేయపాలనకు వ్యతిరేకి. పత్రికలు, పాత్రికేయులు కేవలం వ్యాపార సరకులుగా కావడం ఆయనకు హితవుకాదు. మోసం, నటన, కపటం, కృత్రిమత్వానికి ఆయన వ్యతిరేకి. చిత్తశుద్ధి, నిరాడంబరత, నిజాయితీ, నిర్భయత్వం, సత్యసంధత సమైక్యత పుణికి పుచ్చుకున్న వ్యక్తి ఖాసా సుబ్బారావు.

---

# ప్రఖ్యాత జర్నలిస్టు సి. వి. హెచ్. రావు మరణం

ప్రఖ్యాత జర్నలిస్టు శ్రీ సి. వి. హెచ్. రావుగారి మరణం సందర్భంగా ముఖ్యమంత్రి, సమాచార శాఖ మంత్రి సంతాపాన్ని ప్రకటించారు

## ముఖ్యమంత్రి సంతాపం

జర్నలిస్టు శ్రీ సి.వి. హెచ్. రావు మరణానికి సంతాపం వెలిబుచ్చుతూ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి దిగువ సందేశం పంపారు.

" శ్రీ. సి. వి. హెచ్. రావు గారి ఆకస్మిక మరణానికి నా ప్రగాఢ సంతాపం తెలుపుతున్నాను. ఆయన అనుభవజ్ఞుడైన జర్నలిస్టు. ఆదర్శప్రాయమైన వ్యాస రచయితగా ఆయన అందరికి పరిచితుడు.

ఆయన కుటుంబ సభ్యులకు సంతాపం తెలుపుతున్నాను. "

## సమాచారశాఖ మంత్రి సంతాపం

శ్రీ. సి. వి. హెచ్. రావు మరణ వార్త విని రాష్ట్ర సమాచార పౌర సంబంధశాఖా మంత్రి శ్రీ ఎ. వాసుదేవరావు దిగువ పేర్కొన్న సంతాప సందేశాన్ని పంపారు.

ప్రఖ్యాత జర్నలిస్టు శ్రీ సి. వి. హెచ్. రావు మరణవార్త విని చాలా విచారిస్తున్నాను. ఆయన మరణంవల్ల ఈ రంగంలో ఒక ప్రముఖ వ్యక్తిని కోల్పోయినాము. ఆయన వ్యాఖ్యానాలు ఎప్పుడు ఆదర్శప్రాయంగావుండేవి. వార్తవిక విషయాలను జాగ్రత్తగా సేకరించి, తులనాత్మక దృష్టితో వ్యాసాలురచించేవారు. ఆయనఅనేక విషయాలనుగురించి ముఖ్యంగా ప్లానింగులను గురించివ్రాశారు.

ఆయన కుటుంబ సభ్యులకు నా సంతాపం తెలుపుతున్నాను




1967 మే 4వతేది. శాలివాహనశకము 1689. సర్వజిత్ నామసంవత్సరం. మేష మాసం 25వ తేది. వైశాఖ శుద్ధ షష్ఠి—సోమవారం—నడివేసవి.

అకాలం. అయినా చిరుగాలులు వీచాయి. పవనుని పిల్లగాలులు చిన్నారి శిశువుకు స్వాగతవచనాలు పలికాయి. చిరువర్ష బిందువులు రాల్చింది మేఘం. ఆ బిందువులు కావేరిలో జలతరంగపు సవ్వడులతో స్వరావళి ననుసరించినట్లున్నది.

పురిటివాసనకు బదులు సుగంధపు వాసన యిల్లంతా అలుము కొంది. బిడ్డ తొలికేక నగరదేవతను పిలిచినట్లనిపించింది. రామ బ్రహ్మం యింట్లో ఆ దినం తొలి పండుగ.

ఒక్కొక్కదినం ఒక్కొక్కనిముసంగా గడుస్తున్నది. సీతమ్మ లాలిపాటలు పాడుతూ ఉగ్గుపాలను పోసేది. అల్లరి, అరుపులు లేకుండానే గుటగుట త్రాగేవాడు త్యాగరాజు. తల్లి పాడేప్పుడు ఆమె వంక నిశ్చలంగా చూస్తూ "పాట నాకెంతో నచ్చింది" అనేట్లు ముద్దులొలికే చిరునవ్వుతో కనుపించేవాడు.

త్యాగరాజు దినదిన ప్రవర్ధమానుడైనాడు రామబ్రహ్మం దంపతుల కెంతో సంతోషం కలిగింది. భగవదంశీయుడగుటచే రామ, కృష్ణ, శివాది దైవచిత్రాలను తదేకంగా జూచేవాడు. తల్లి దండ్రులు పూజచేసే సమయంలో ప్రాకుతూ సరసన జేరి బుద్ధిగా కూర్చొనేవాడు.

త్యాగరాజుకు ఐదేండ్లు నిండాయి. శుభదినం నాడు రామ బ్రహ్మం ఒక పండితుని రావించి త్యాగరాజు చేత ఓంనమః శివాయః అనిపించాడు. మాతాపిత గురుదైవం అని పలికించాడు. బాలుని ముద్దు పలుకులకు సీతమ్మ ఉప్పొంగిపోయింది. ఎదురుచూస్తున్న వర్షం కురియగనే చిందులువేస్తూ ఆనందంతో పరవశం చెందే బక్కచిక్కిన రైతులా రామబ్రహ్మం బ్రహ్మానంద భరితుడైనాడు.

## రామషడక్షరీ మంత్రం

చిరువయస్సునుంచే తండ్రి ననుసరిస్తూ దైవ ప్రార్థనలో పాల్గొనేవాడు. నిత్యం తోటి బాలురతో వెళ్ళి పూజకు పువ్వులు తెచ్చేవాడు. పూజా సామాగ్రి అమర్చే తల్లికి చేయూతగా వుండే వాడు. పంచాపకేశుడు, రామనాంథం చేస్తున్న అల్లరులవల్ల రామ బ్రహ్మం సీతమ్మలకు కలిగే చింత త్యాగరాజు నడవడిక మరపించేది.

తోడి బాలురతో ఆడుకొనునపుడు అన్నల వలె జగడాలను యింటివరకు తెచ్చేవాడుకాదు. తల్లిదండ్రుల ఆజ్ఞప్రకారం నిర్ణీత వేళల్లో ఆటపాటలు, చదువు సాగించేవాడు.

పంచాపకేశ, రామనాథంల వలన తిరువారూర్ వదలి వెళ్ళవలసినంతటి పరిస్థితి యేర్పడింది. చేరువలోనే వున్న తిరు వయ్యూర్‌కు తననివాసం మార్చాడు. రాజు తులశింగు కూడా వల్లెయని తిరువయ్యూరులోని తిరుమంజన వీధిలో ఒక యింటిని రామ బ్రహ్మని కిప్పించాడు. అచట సంస్కృత పాఠశాలలో ముగ్గురు కుమారులను ప్రవేశపెట్టాడు.

త్యాగరాజుకు చదువు, సంస్కృతి, పంచాప, రామ నాథంలకు అల్లరి చక్కగా అబ్బినవి.

కారణ జన్మడగుటచే త్యాగరాజు యేక సంథాగ్రాహియై నాడు. గురువుల అభిమానం అనతి కాలంలోనే సంపాదించు కొన్నాడు. అన్నలిద్దరు గురువుల అభిమానానికి చాలాదూరంలో వుండిపొయ్యారు. తల్లిదండ్రులకు త్యాగరాజు ప్రవర్తన షడ్రు మల విందు భోజనంలా వుండేది.

ఇలావుండగా ఒకనాడు త్యాగరాజు స్నేహితులతో యింటి ముందర ఆడుకొనుచుండగా ఓ మహనీయుడు తనను నిశ్చల దృష్టితో చూడడం గమనించాడు.

ఆ మహానుభావుని ముఖవర్చస్సు త్యాగరాజు నెంతో ఆకర్షించింది. తదేకంగా ఆయన ముఖంలోకి చూడసాగాడు. ఆ యోగికూడా చిరునవ్వుముఖంతో త్యాగరాజుకేసి చూస్తుండినాడు. త్యాగారాజు ముఖంలో భక్తి ముక్తికోసం అన్వేషిస్తున్నట్లనిపించింది. త్యాగరాజును మృదువుగా "త్యాగరాజూ" అని పిలిచాడు. త్యాగరాజు ఆశ్చర్యంతో ఆయోగి పుంగవునితో స్వామీ నాపెరెలా మీకు తెలిసింది అన్నాడు. సర్వం జగత్తుకు త్యాగం చేయబోయే నీపేరు త్యాగరాజు గాకమరే మవుతుంది అన్నాడు సన్నగా నవ్వుతూ. సరే మీయిల్లెక్కడ నాయనా అంటూ మృదువుగా శిరస్సును తాకాడు. అదేస్వామి, రండి—అంటూ ఇంటి కేసి నడిచాడు త్యాగరాజు, యోగి అనుసరించాడు.

"అమ్మా! నాన్నా!" అని పిలుస్తూ లోనికి వెళ్ళాడు త్యాగరాజు. పిల్లవాని పిలుపువిని ముంగిలిలోకి వచ్చారు రామనాథం సీతమ్మ లిరువురు. వాకిలి ముందు యోగి నిలబడివున్నాడు. ఇల్లు సువాసనలు విరజిమ్ముతున్నది. ఆ యోగి ముఖవర్చస్సు ప్రజ్వరిల్లుతున్నది. దంపతులిరువురికి ఆశ్చర్యమేసింది. రామబ్రహ్మం తన పైపంచెను నడుముకు కట్టుకొని వినయ పూర్వకంగా నమస్కరిస్తూ లోనికి రమ్మని ఆహ్వానించాడు.

త్యాగరాజుని కన్నదంపతులు భగవంతుని కరుణ సంపాదించు కొన్నపుణ్యాత్ములు అంటూ లోనికి నడిచాడు.

సీతమ్మ పీఠము తెచ్చివేసింది. ఆ మహాయోగి కూర్చుంటూ "రామబ్రహ్మం నేను నీకుమారునికి రామషడక్షరీ మంత్రోపాసన చేయదలచాను" అని ఆజ్ఞాపూర్వకంగా పలికాడు.

తలవని తలంపుగా విచ్చేసిన ఆ మహనీయునికి తమ బిడ్డయెడ కలిగిన అనురాగానికి అచ్చెరువొందారు.

త్యాగరాజు భగవదంశీయుడు. త్యాగరాజ స్వామియే యోగి రూపంలో విచ్చేసినాడని తలంచారు దంపతులు.

సీతమ్మ పాదప్రక్షాళన జేయడానికి నీరు, పళ్ళెం తెచ్చింది ఇరువురు కలసి మునిపుంగవుని పాదాలు కడిగారు. ఆ పవిత్ర తీర్థాన్ని తమశిరస్సులపై చల్లుకొన్నారు.

త్యాగరాజుకు స్నానం చేయించింది సీతమ్మ. ఆ మహనీయుడు త్యాగరాజు చేత శ్రీరామునికి పూజచేయించాడు. తానూ మౌనముద్రాంకితుడై మనస్సున భగవంతుని స్మరించాడు.

త్యాగరాజును సరసన కూర్చుండ బెట్టుకొన్నాడు. శిరస్సుపై చేతితో తడిమాడు. త్యాగరాజు మేను కాంతులు విరజిమ్మింది.

"రామబ్రహ్మం! నీవు ధన్యుడవు. నీకుమారునికి యీ రామకృష్ణానందుడు రామషడక్షరీ మంత్రోపదేశం చేస్తున్నాడు" అని పలుకుతూ త్యాగరాజు చెవిలో మంత్రోపదేశం చేశాడు. త్యాగరాజు ముఖం నెమిలి పురిలా విప్పారింది. చిరు ముఖం మందహాసంతో, వికసించింది. మంత్రోచ్చారణ చేశాడు త్యాగరాజు. కండ్లు మూసుకొని మంత్రం పఠిస్తున్న త్యాగరాజు నిమిషమాత్రం తన్నుతాను మరిచాడు.

రామబ్రహ్మం సీతమ్మలు కనులు మూసుకొని భక్తితో నిశ్చలంగా సీతారాములను స్మరిస్తున్నారు.

త్యాగరాజు కండ్లు తెరిచేప్పటికి ఎదురుగ కొద్దిదూరంలో ప్రార్థన చేస్తున్న తల్లిదండ్రులు మాత్రం కనుపించారు, ప్రక్కన స్వామి పీఠం ఒంటరిగావుంది.

సీతారాముల విగ్రహాలు దేదీప్యమానంగా మెరిసిపోతున్నట్లు తననాశీర్వదిస్తున్నట్లు కనుపించాయి. భక్తితో ప్రణమిల్లాడు.

రామబ్రహ్మం, సీతమ్మలు కండ్లు తెరిచారు. రామకృష్ణానందస్వామి కనుపించలేదు. త్యాగరాజు సాష్టాంగ పడివున్నాడు. రామకృష్ణానందస్వామి పాదాలు కడిగిన పళ్ళెం అక్కడ వున్నది. దంపతులిరువురు, అందులోని తీర్థాన్ని మరల తమ శిరస్సులపై చల్లుకొన్నారు.

రామబ్రహ్మానికి యిది రెండవ అనుభూతి.

అప్పటికి త్యాగరాజుకి ఎనిమిది వత్సరాలు మాత్రమే!

## అంతా నాదమయం

సీతమ్మగాయని, తండ్రి వీణకాళహస్తయ్య ప్రసిద్ధవైణికుడు. తండ్రివలే విద్వాంసురాలు కాకపోయినా, చక్కగా పాడగల గొంతు గలిగి శ్రోతల నానందపరిచేది. తండ్రివద్ద పురందరదాసు, కనకదాసు, రామదాసు కీర్తనలను, జయదేవుని అష్టపదులను క్షుణ్ణంగా నేర్చుకొంది. దైవగీతికలను భావయుక్తంగా పాడేది.

రామచిలుక నొకటి పెంచి
ప్రేమమాటలాడ నేర్పి
రామరామ రామాయనుచు

అనే రామదాసు కీర్తన ఆమె కత్యంత ప్రియము. పూజా సమయములో పలుమార్లు పాడేది. రామషడక్షరీమంత్రోపాసకుడయిన త్యాగరాజునకు రామ శబ్దములోని మాధుర్యము కర్ణపుటంకో తాకేది. తల్లి సంగీతికలు త్యాగరాజు నెంతో పరవశుణ్ణి చేసేవి, ఆ గీతికల్లోని భావమాధుర్యాన్ని ఆస్వాదిస్తూ, రసానుభూతిని పొందేవాడు. ఆత్మానందాన్ని అనుభవించేవాడు. సంగీతంలోని సారస్వతాన్ని తనవిదీరా అనుభవించాలనే జిజ్ఞాసయెక్కువ కాసాగింది. ఉత్సాహం పరవళ్ళు ద్రొక్కగా తాతగారింటికి తరచూ వెళ్ళుతూ అచ్చట సంగీతగ్రంథాలను పఠించసాగాడు.

పరమాత్మ స్వరూపానికి సంగీతం ప్రతిబింబమని నిర్ధారణ జేసికొన్నాడు.

పండ్రెండేండ్లు పూర్తిగాకముందే వ్యాకరణ గణితశాస్త్రములు కైవశం చేసుకొన్నాడు. గురువులవద్ద చదువు మిగలలేదు. ఏకసంధాగ్రాహికి యెంతకాలం కావాలి?

ఆకులు రాలుతున్నాయి. చెట్లు చిగురిస్తున్నాయి. వసంతాలు గడుస్తున్నాయి.

ఒకనాటి వేకువన ——

చివుక్కుమని లేచాడు త్యాగరాజు కర్మసాక్షి యింకా మేలుకోలేదు. ఎందువల్ల తనకంత తొందరగా మెలుకువవచ్చిందో తెలియలేదు. వేదపఠనం చేయసాగాడు. తను ఉచ్చరిస్తున్న వేద శ్లోకశబ్దము నాభినుంచి రావడం తన మనస్సుకు నిశ్చలతను కలిగించడం గమనించాడు. తనువు పులకరించింది. ఆ నిశ్చలతతోనే గవాక్షంలోంచి ప్రకృతిలోకి తొంగిచూశాడు. మానవాళి నిద్రబోతున్నది. నాభిలోనుంచి ఉద్భవించిన నాదం కంఠంలో మధుర తరంగాలను చలింపజేసింది. తళుక్కుమని యేదో భావన మెరిసింది. అనిర్వచనీయమయిన ఆనందంతో లేచాడు.

కావేరి ఒడ్డుకు తీసుకవెళ్ళాయి కాళ్ళు. ఒడుదుడుకులు లేకుండా ప్రవహిస్తున్నది కావేరి, గలగల మని ప్రవహించే కావేరిలో తన కంఠంలో పలికిన గమకములే వినిపించాయి. చెట్టు పైని ఆకునుంచి రాలిన నీటిబిందువులా వినిపించింది. కావేరీ జలాలలో మానవాళికి భిక్షపెడుతున్న పైరుగాలులు, కోకిల మధుర స్వరం, నెమలికూజితం చెవులను తాకాయి.

ప్రశాంత వాతావరణంలో ప్రకృతి అంతా నాదమయమై పోయింది.

ఆ ప్రశాంత ప్రకృతికి పరమేశ్వరుడు పరమానందం పొందుతున్నట్లు లీలగా గోచరించింది త్యాగరాజుకు.

ఆ మధురధ్వనులను తిరువయ్యారునగర దైవం శ్రీత్యాగరాజస్వామి చిరునవ్వుతో పరికిస్తున్నట్లు భ్రమించాడు.

ప్రకృతి అంతా నాదమయం
ఆ నాదంలోనే వుంది ముక్తిమార్గం
భక్తిప్రదమయిన మోక్షమార్గం
మేను జలదరించింది. మనసు పరవశించింది.

ఉప్పొంగిన హృదయంతో చేతులు జోడించి నాదమునకు నమస్కరించాడు.

మనస్సు భావప్రేరితమయింది. శ్రీరాముని దివ్యనామాన్ని జపించాడు. పరవశించిన మనసు పెదవులను మీటింది.

పెదవులు పలికాయి, కంఠం పలికింది. కాదు శరీరమంతా నాదాన్ని పలికింది.

"నమోనమో రాఘవాయ
అనిశం నమోనమో రాఘవాయ"

రామా నీకు నమస్కరిస్తున్నాను సర్వకాలములందు నీకు
నేను నమస్కరిస్తున్నాను

శుకనుతాయ దీనబంధవే
సకలలోక దయాసింధవే

శుకమహర్షిచే స్తుతింపబడినవాడవు. సర్వజగత్తునందు గల దయకు సముద్రునిలాంటివాడవు.

"శ్రితదురిత తమో బహురవయే
సతత పాలితాద్భుత కవయే —నమో॥"

ఆశ్రితుల పాపాంధకారముల భేదించు పెక్కు సూర్యుల కాంతిగలవాడు. నిరంతరము పండితులను కవులను పాలించు వాడవు.

"రామా! రామా అనే నీ దివ్యనామమే ప్రణవనాదంలోని పరమరహస్యం అని" అంజలి ఘటించాడు.

సూర్యభగవానుడు తన కిరణాలను భూమిపై ప్రసరింపజేశాడు.

భావప్రేరితమనస్కుడైన త్యాగరాజు కావేరిలో స్నాన మాచరించి యింటికి బయలుదేరాడు.

ఇంటివద్ద రామబ్రహ్మం లేచి త్యాగరాజు పడకగదిపై లేక పోవడం గమనించాడు. పంచాపకేశ, రామనాధంలు గుఱుపెడ్తూ నిద్రపోతున్నారు యింకా.

అప్పటికే సీతమ్మ లేచి కాలకృత్యాలు తీర్చుకొని వాకిలి శుభ్రపరచి ముగ్గువేస్తున్నది.

త్యాగరాజు మెల్లగా తల్లివద్దకు వచ్చాడు. త్యాగరాజు రాకను గమనించింది. తల్లిపాదాలకు నమస్కరించాడు, సీతమ్మ ఆశ్చర్యంగా త్యాగరాజుకేసి చూచింది.

"అమ్మా! నన్ను ఆశీర్వదించు" అని మృదువుగా అర్థించాడు.

రామబ్రహ్మం యిదంతా ఆశ్చర్యంగా చూస్తూ సీతమ్మ వెనుకనే నిలబడినాడు.

సీతమ్మ వెరగుతో కుమారుని ముఖంలోకి చూస్తూ ఏమిటి నాయనా అని ప్రశ్నించింది.

"అమ్మా ! ప్రకృతిలోని పరమార్థం యేమిటో తెలుసుకొన్నాను. కాని విపులీకరణకు తగిన స్థాయిని చేరుకోడానికి శక్తిని ప్రసాదించమని నిన్ను కోరుకొంటున్నాను. శ్రీరాముని దివ్యనామం నాహృదయంలో నిలిచేట్లు నా జిహ్వపై సదా వుండేటు నన్ను ఆశీర్వదించు........."

రామషడక్షరీ మంత్రోపాసకుడు త్యాగరాజు. అట్టి కుమారుని ప్రార్థన తల్లి ఆలకించకుండా వుంటుందా?

కుమారునిలోని వినూత్న తేజస్సును సీతమ్మ, రామనాథం ఇరువురు గమనించారు,

త్యాగరాజు సుమధుర కంఠంతో "నమో నమోరాఘవాయ" యని తల్లిదండ్రులముందు తన ప్రథమ దివ్యనామసంకీర్తనను గానం చేశాడు.

దంపతులిరువురు త్యాగరాజు గళ మాధుర్యానికి తలవని తలంపుగా లభించిన సంగీతజ్ఞానానికి ఆశ్చర్యపడి మహదానందం చెందారు.

సీతమ్మ కుమారుని అక్కున జేర్చుకొంది. తనివిదీర ముద్దాడింది. రామబ్రహ్మం ఆ దృశ్యం జూచి ఆనందాశ్రువులు రాల్చాడు.

సీతమ్మ పూజాగృహానికి పరుగిడింది. తండ్రి రామునికి, తల్లి సీతమ్మకు కైమోడ్చింది. తన జన్మను సార్థక పరిచినందుకు ప్రతిఫల మిచ్చుకోలేనని నిరంతర సీతారాముల పాదపద్మములకై తన జీవితమంతా సేవచేస్తానని వరపడింది.

త్యాగరాజుకు సంగీతంపై మక్కువ గల్గిందని తెలుసుకొన్నాడు రామబ్రహ్మం. త్యాగరాజు ప్రథమ దివ్యనామ కీర

నము పలువురు పండితులకు, సాహితీపరులకు చూపాడు. సాహిత్య పరంగా కూడా చక్కగావుందన్నారు పెద్దలు. త్యాగరాజుకు సంగీతం నేర్పించమని సలహాయిచ్చారు.

రామబ్రహ్మం, త్యాగరాజుకు సంగీతం నేర్పించుటకు ఉద్యుక్తుడైనాడు.

## నాదోపాసన

ఆ నాటి పాలకుడు, తంజావూరు సంస్థానాధీశుడు శ్రీ శరభోజి మహారాజు. అతని ఆస్థానము సకల కళలకు నివాసము.

సంగీత సాహిత్యములలో పండితుల ప్రతిభకు సాన పెట్టించుచు, అందుండి చిందు పలుకులలోని రస మాధుర్యాన్ని గ్రోలుతూ వారినీ ఆనందపరుస్తూ కాలం గడిపేవాడు, శరభోజి మహారాజు, శ్రీకృష్ణ దేవరాయలవలె పండితుడు, కవిగాకున్నా పండితాదరణాభిమానములందు సరితూగగల్గిన సాహితీవేత్త. ప్రత్యేకించి సంగీత స్రవంతుల వెదజ దాక్షిణ్య భువన విజయము శరభోజి ఆసానము నాయక మహాలు.

శరభోజిని తన గానమాధుర్యంచే ఆకట్టుకొని అర్ధ సింహాసనమును సంపాదించుకొన్న సంగీత కళాకారుడు బ్రహ్మశ్రీ శొంఠి వెంకటరమణయ్య పంతులు.

రామబ్రహ్మం ఆస్థాన పౌరాణికుడు, విద్వాంసుడు, గాబట్టి పంతులుగారితో పరిచయముండెడిది.

తన కుమారుని గుణగణాలను, పండిత ప్రశంసలను పంతులుగారికి చెప్పి శిష్యునిగా స్వీకరించమని అర్థించాడు.

అదివరకే త్యాగరాజు ప్రతిభా విశేషాలను తెలిసికొనివున్న పంతులుగారు వెంటనే అంగీకారం తెలిపారు.

శుభ ముహూర్తంలో త్యాగరాజు పంతులుగారి గడప తొక్కాడు.

పంతులుగారు చిరునవ్వుతో త్యాగరాజును దగ్గరకుతీసుకున్నాడు.

త్యాగరాజు గురువులకు పాదాభివందనజేసి ఫల పుష్పాదులు అందించాడు.

త్యాగరాజు వినయం పంతులుగారి నెంతో ఆకర్షించింది.

"మనోవాంఛా సిద్ధిరస్తు అని" ఆశీర్వదించాడు, సంగీత సామ్రాట్టు శిష్యుణ్ణి.

త్యాగరాజు, పంతులుగారి యితర శిష్యబృందానికి కూడా నమస్కరించాడు. తోటి శిష్యుడు నమస్కరించడంతో వారి హృదయాల్లోకూడా అమృత ప్రాయమయిన స్నేహరసం చిలకరించినట్లయింది.

ఒకమారు యిల్లంతా కలియచూచాడు త్యాగరాజు. ఒకవైపు గురువులు వాయించేవీణ. మరోవైపు వీణధ్వనుల కలంకారం కూర్చేది నేనేనని చెబుతున్నట్లు మృదంగం, మరొక మూల సీపాటకు శృతిబద్ధుడను నేనేనన్నట్లు తంబుర, యింకా యితర వాయిద్యాలతో కళకళలాడు తున్నది.

అవన్నీజూచి తన్మయత్వం జెందాడు త్యాగరాజు. సకల వాద్యాలకు అంజలి ఘటించాడు.

గురువుగారి విపంచిక రాముని కోదండంలా కనుపించింది. సాష్టాంగ ప్రణామం చేశాడు.

పంతులుగారు త్యాగరాజు చర్యలకు యెంతో సంతోషించాడు. తనపేరు నిలుపగల శిష్యుడు లభించాడని హృదయానందం పొందాడు.

త్యాగరాజును తన ప్రక్కన కూర్చోబెట్టుకొన్నాడు. శిష్యులకేసి ఒకమారు చూచాడు. మీ చూపు మా కర్థమ ఖుందని వారి వారి వాద్యాల నందుకొన్నారు.

సాధన ప్రారంభంలో గురువుగారికి మరొసారి మనసా నమస్కరించాడు.

పంతులుగారు తన యిష్టదైవాన్ని ప్రార్థించాడు. ఏ కార్యానికైనా ముందు విఘ్ననాయకుని వినుతించకపోతే చేయబోవు కార్యం సఫలీకృతంకాదని ప్రతీ భారతీయుని నమ్మకం. పంతులుగారు త్యాగరాజుని వినాయక ప్రార్థన చేయమన్నారు: తల్లి తనకు నేర్పినగీతం పాడాడు,

శ్రీ గణనాథ సింధూర వర్ణ
కరుణ సాగర కరివదన
సిద్ధ చారణ గణసేవిత
సిద్ధి వినాయక తే నమో నమో ॥
సకల విద్యాది పూజిత
సర్వోత్తమ తే నమో నమో ॥ శ్రీ॥గ॥

విఘ్నేశ్వరుడు పార్వతి ప్రియ తనయుడు, బుద్ధి చాతుర్యంతో తల్లి దండ్రుల ప్రదక్షిణే పదునాల్గు లోకముల ప్రదక్షిణ యని వారి చుట్టూ ముమ్మారు తిరిగి జ్ఞానఫలం పొందిన సిద్ధి పురుషుడు. ప్రమదగణాధిపుడు. సకల విద్యలకు ఆలవాలము, సంగీత సామ్రాట్టు శివుని నాట్యమునకు మార్దంగికుడు, సకల విఘ్న నివారకుడు, గనుక దైవాంశ సంభూతుడయిన త్యాగరాజును అట్టి వినాయకుడు ఆశీర్వదించకుండా వుంటాడా? ఆశీర్వదించాడు కూడా...

వినాయకస్తుతి కాగానే సరస్వతిని ప్రస్తుతించాడు. త్యాగరాజు అమ్మలగన్న యమ్మ దురాంశని, బ్రహ్మ అర్థాంగిని మననం జేసుకొన్నాడు.

తన యిష్టదైవం శ్రీరాముని దివ్యసంకీర్తనం చేశాడు. దీనజనుల కాపాడే రామా నాపై కరుణ జూపుమని అర్థించాడు.

తవ దాసోహం–తవదాసోహం
తవ దాసోహం – దాశరథే

( తరువాయి 59 వ పుటలో )

# అరుణోదయానికి ఇంకా అట్టే దూరం లేదు

సోమసుందర్

శ్రీకారంలా మెలికలు తిరిగి ఉన్నావు. ఎవరమ్మా నువ్వు ?
వాడివత్తలైన సింహాచలం సంపెంగ పువ్వువు,
ఎవరమ్మా నువ్వు?

ఎవరి ఆనందం కోసమమ్మా—ఎవరి రసికత కోసం
అగరువత్తులు గుచ్చి వెలిగించడానికి
నీ బుగ్గల కన్ని చిల్లు లెట్టుకున్నావు ?
నిండా పాతికేళ్లయినా లేవే, పళ్ళని నీ చెంపలపై
ఎందుకమ్మా అన్ని కన్నీటి చోరికలు ?
బాగా సాగలాగిన బంగరు శలాకలా
అంత సన్నగా ఒంగి పోయిఉన్నా వెందుకమ్మా ?
మసిబారి కొడిగడుతున్న దీపపు సెమ్మావు !
అన్ని మెలికలు తిరిగి బొత్తిగా శ్రీకారాక్షరంలా
కుష్కించి పోయావేమమ్మా పుత్తడి బొమ్మవు !

ఏమిటి అడుగుతున్నావు ?— ఈ రోడ్డెక్కడికి వెడుతుందనా ?
నాకు జ్ఞానం వచ్చినప్పటి నుంచీ చూస్తున్నాను
అంటే ఇరవై ఏళ్లనుంచీ చూస్తున్నాను సుమారుగా
ఈ రోడ్డెక్కడికీ వెళ్లడం లేదు
నిజమమ్మా మూడు పంచవర్ష ప్రణాళికలు వెళ్లాయి!
ఈ రోడ్డు మీంచే వెళ్లడం నేను కళ్లారా చూశాను.
కాని ఈ రోడ్డెక్కడికీ వెళ్లడం లేదు
జమీందార్ల పాతకాలపు రోల్సు రోయిస్సులూ
కోటీశ్వరుల ఇంపాలాలు, ఫియట్లూ, సామాన్యుల రిక్షాలూ
ఈ రోడ్డు మీంచి వెళ్లడం కళ్లారా చూశాను
కాని ఈ రోడ్డెక్కడికీ వెళ్లడం చూళ్లేదు.
ముసలీ ముక్కీ బీదా బిక్కీ లక్షోపలక్షలు—
ఈ రోడ్డమ్మటే వెళ్లడం చూశాను, కాని
అదేం ఖర్మమో, ఈ రోడ్డెక్కటికీ వెళ్లడం లేదు !

ఇంత ఎర్రని ఎండలో
ఎక్కడికమ్మా బయల్దేరావు ?
కాళ్లకు చెప్పులైనా లేవు
"గొడుగా ? (అయ్యోరాత!) అందొచ్చిన
కొడుకైనా తోడు లేడ" నా అంటున్నావు ?

అలా ఉన్నావేమ్మా—సాక్షాత్తూ తెలుగునదిలాగ ?
నిండా పాతికేళ్లయినా ఉన్నట్లు లేదే—
ఇంతట్లోకే వేసవి ఎండబెట్టిందమ్మా
నీ నిండు జవ్వనాల జీవనదిని ?

అయ్యో ఇంకా చెప్పనే లేదేవమ్మా
కలెక్టరేట్‌లో గుమాస్తా సుబ్బారావు భార్యవా ?
తొందరపడకు తల్లీ, కాస్త నీడలోకిరద్దూ...
ఏమిటో యాతనలు, ఎందుకా హడావిడి పోనిద్దూ
కాస్త చల్లని మంచినీరు త్రాగి మరీ వెళ్దూ...!

అదా నువ్వడుగుతున్నది. తెలిసిందమ్మా మన్నించు
'ఈ రోడ్డు జనరల్ హాస్పటల్‌కి పోతుందా'—అనా అడిగావు !
హాస్పిటల్‌కి తప్పకుండా పోతుందమ్మా ఈ రోడ్డు

ఇన్నివంకర్లూ మెలికలూ తిరిగిన ఈ రోడ్డు
తిన్నగా హాస్పిటల్‌కే పోతుందమ్మా, ఈ రోడ్డు!

ఇంత చిన్నవయస్సులోనే హాస్పిటల్ కెందుకమ్మా ?
ఏమిటేమిటి సుస్తీ?...అయ్యో సిగ్గుపడకు స్పష్టంగా చెప్పు !
సందేహించకు—అన్నలాంటి వాడిని. నీ పేరు వైదేహి కదూ?
ఓహో అదా...మరి అలా చెప్పవేం చెప్పు
పాతిక వత్సరాలైనా నిండందే
ఆరుగురు పిల్లల్ని కన్నావా ?

సెకండ్‌హేండు బుక్‌షాపులో 'రతిరహస్యం'
కొనుక్కుంటూ మొన్ననే కనుపించాడుస్మీ నాకు
ఈ ఘోరం తెలిస్తే అప్పుడే వాడ్ని
నిలేసి నాలుగు చివాట్లు పెట్టేద్దును సుమీ !

వెళ్ళవమ్మా వెళ్లు, ఎవరిమాటా వినకు
నీ ఆనందం నీ ఆరోగ్యం నువ్వే చూసుకోవాలి వెళ్లు
ఇంకెంతో దూరంలేదులే చక్కగావెళ్లు
జనరల్ హాస్పిటల్‌లో చివురించిన రావిచెట్టు నీడలో
చూశావ్—ఎర్ర త్రికోణం అరుణోదయంలా
గంభీరంగా మెరుస్తూ స్వాగతమిస్తుంది వెళ్లు !

తప్పకుండా వెళ్లు తల్లీ నేడే చేరిపో—
ట్యూబెక్టమీ కాంపులో !
కాన్పులు తప్పించుకోవడం—తగ్గించుకోవడం
ఎవరికోసమోకాదు, స్వసుఖం కోసమే !

ఇప్పటికే ఆలస్యం చేశావ్,
ఆనందాన్ని సాగరంలోకి పారించేసుకున్నావ్!
ఇది స్వార్థం కోసమే—అక్షరాలా: నామాటనమ్మ
ప్రతి చిన్న విషయానికీ పెద్ద పెద్ద మాటలూ డాబులూ

చెప్పుకోవడం ఈ దేశానికెవరు నేర్పారోగాని
వెన్నతో పెట్టిన విద్య !...స్థిరంగా నిలచిన అవిద్య

కాన్పులు తగ్గించుకోవడం నీ కోసమే తల్లీ
నీ ఆనందం కోసమే!... మీ ఆయనకి ప్రతి ఏడూ
ఇంక్రిమెంటు వచ్చినా రాకపోయినా
నీ ఒళ్లుహూనం చేసుకొని నీ ఇంటి జనాన్ని పెంచడం
నీ కడుపు కాల్చుకుని నీ జనాన్ని పెంచడం

ఎందుకమ్మా యింతముప్పు?...పైగా ఎంత తప్పు !

సరేగాని ఏంవమ్మా నీ దగ్గరికెవరూ
సోషల్ వర్కర్ సోదరి రాలేదా ఎప్పుడూ ?
అవునులే వచ్చే వుంటుంది—నిన్ను కలవనీకుండా
వీధిలోనే అడ్డుతగిలి మీ ఆయన వెనక్కి పంపేసి వుంటాడు,
' దేవుడిచ్చినంతమంది పిల్లల్ని కనడమే మా హక్కు '
అంటూ ఆమెని చివాట్లు పెట్టి ఉంటాడు, నిజమేనమ్మా
ఈ మగవాళ్ళు మరీ దిగజారి పోతున్నారు మౌఢ్యంలోకి
ఆడవాళ్ళకి మార్గదర్శకులు కావడం విరమిస్తున్నారు.

వెళ్లుతల్లీ ఇకనేమాత్రం చేయకు తాత్సారం
ఇంత ముఖంతో ఇందుబింబానన
నీ కోసమే నిరీక్షిస్తోంది సోషల్ వర్కర్ !
ఆమె నీకు దారి చూపుతుంది, వెలుగు చూపుతుంది
నీ బ్రతుకు చేలాంచలంపై వెన్నెల జిలుగులద్దుతుంది
వెళ్లు తల్లీ, తొందరగా వెళ్లు, శుభంగారా వైదేహీ !
నీ కోసం నీసౌఖ్యం కోసం
నీ ఆయురారోగ్య ఐశ్వర్యాల కోసం
నేడే చేరిపో—ట్యూబెక్టమీ క్యాంపులో...
అరుణోదయానికి యింకా ఆపేదూరంలేదు !
తొందరగా వెళ్లు తల్లీ-జాగ్రత్త :





## నగర వార్తాచిత్రాలు

రాష్ట్ర ముఖ్యమంత్రి అక్టోబరు రెండోవారంలో ఇండియన్-ఈస్టర్న్ న్యూస్ పేపర్స్ సొసైటీ (ఐ. ఇ. ఎన్. ఎస్.) కార్య నిర్వాహక సభ్యులకు విందు చేశారు.

ఎడమవైపున : ముఖ్యమంత్రి ఏర్పాటుచేసిన విందులో పాల్గొన్న కొందరు కార్యనిర్వాహక సభ్యులు.

ఎడమవైపు మధ్య : ఆనందబజార్ పత్రిక సంపాదకుడు శ్రీ ఎ. కె. సర్కార్‌తో కరచాలనం చేస్తున్న ముఖ్యమంత్రి

ఎడమవైపు క్రింద : కార్య నిర్వాహక సభ్యులతో ముఖ్యమంత్రి ఇష్టాగోష్ఠి.

పైన : వార్తా పత్రికల రిజిష్ట్రారు శ్రీ కె. ఎన్. బంజాయ్‌తో ముఖ్యమంత్రి.

క్రింద : 'హిందూ'న్యూస్ పేపర్ మేనేజింగ్ ఎడిటర్ శ్రీ జి. నరసింహన్ (కుడివైపు) తో ముఖ్యమంత్రి.

(ఫోటోలు: శ్రీధర్స్ ఆం. ప్ర. ప్రెస్ ఫోటోసర్వీసు)







# ఆదిలాబాదు జిల్లా కొత్త పరిశ్రమలకు అవకాశాలు

## పటిక

కాగితం తయారీలో పటిక ఉపయోగిస్తారు. ఈ జిల్లాలో వార్షికంగా రు. 11 లక్షల విలువచేసే దాదాపు 4,000 టన్నుల పటికకు డిమాండు ఉంది. జిల్లాలో కాగితంమిల్లుల విస్తీర్ణంవల్ల దాని డిమాండు యింకా పెరగవచ్చు. ప్రస్తుతం బొంబాయి, ఢిల్లీ, చాందాల్లనుండి పటిక దిగుమతి చేసుకుంటున్నారు. సిర్పూర్‌కాగజ్ నగర్‌లోగాని, మంచిర్యాలలోగాని పటిక ఉత్పత్తి యూనిటును నెలకొల్పడానికి అవకాశాలు ఉన్నాయి. మంచిర్యాలలో రైలు సౌకర్యాలతో పాటు పారిశ్రామిక వాడ కూడ ఉండడంవల్ల యీ యూనిటు స్థాపనకు అదనపు ప్రయోజనం ఉంది.

## అంపపుపొట్టు, చెక్క పేళ్ళ తయారీ

అంపపుపొట్టును చెక్కపేళ్లు, వంటపొయ్యి, యితర గృహ అవసరాలకు ఉపయోగిస్తారు. చెక్కపేళ్లు కురచగా సమంగాఉండి వినియోగానికి ఉపయుక్తంగా ఉంటాయి. అంతేగాక పొగ తక్కువగా ఉంటూ మంట అధికంగా ఉంటుంది. అందువల్ల మార్కెటులో దీనికి వంటచెరకుకన్నా ఎక్కువ ధర లభించవచ్చు. ఆదిలాబాదులో లభించే అంపపు పొట్టుతో దీనిని తయారుచేయవచ్చు. మంచిర్యాలలో ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## అవిశ నూనె

బాగా కాగిన అవిశ నూనెను పెయింట్లు, వార్నీషు పరిశ్రమలలో విరివిగా ఉపయోగిస్తారు. ఈ నూనెను తయారు చేసే ఒకే ఒక యూనిటు హైదరాబాదులో ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో 4 లక్షల లీటర్ల అవిశనూనెను పరిశ్రమలలో ఉపయోగిస్తున్నారు. విదేశాలకు ఎగుమతికి కూడ మంచి అవకాశాలు ఉన్నాయి. ఈ ప్రాంతంలో అవిశవిత్తులు బాగా లభిస్తున్నదృష్ట్యా ఆదిలాబాదు జిల్లాలో ఒక యూనిటును నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి. మంచిర్యాల ప్రాంతంలో ఎక్కువ అవిశవిత్తులు ఉత్పత్తి అవుతున్న దృష్ట్యా యిక్కడే ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## కార్డుబోర్డు పెట్టెలు, చౌకములు

జిల్లాలో కార్డుబోర్డు పెట్టెలు, చౌకాలకు ఎక్కువ డిమాండు ఉంది. జిల్లాలో వార్షికంగా 9 లక్షల కార్బోర్డు పెట్టెలు అవసరమవుతాయని అంచనా. ప్రస్తుతం బొంబాయి నుండి యీ పెట్టెలను దిగుమతి చేస్తున్నారు. సిర్పూరు-కాగజ్‌నగర్‌లో ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## కాగితం కండెలు

వస్త్రపరిశ్రమలో దారంచుట్టేందుకు కాగితం కండెలు అవసరమవుతాయి. జిల్లాలో ప్రస్తుతం 7.80 లక్షల కాగితంకండెలు ఉపయోగిస్తున్నారని అంచనా. ఆంధ్రప్రదేశ్‌లో కాగితం కండెలు తయారుచేసే యూనిట్లు లేవు. విరుద్ధ నగర్, సూరత్‌ల నుండి వాటిని సరఫరా చేస్తున్నారు. ఈ వస్తువుల ఎగుమతికి కూడ మంచి అవకాశాలు ఉన్నాయి. మంచిర్యాలలో ఒక యూనిటును నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## పెయింట్లు, వార్నిషులు

జిల్లాలో 1965లో రూ. 1.20 లక్షల విలువ చేసే పెయింట్లు వార్నిషులు వినియోగించారు. వార్షికంగా 10 శాతం చొప్పున వాటి డిమాండు పెరుగుతున్నది. ప్రస్తుతం హైదరాబాదు, బొంబాయి, మద్రాసుల నుండి యీ వస్తువుల సరఫరా జరుగుతున్నది. జిల్లా మధ్య ప్రాంతంలో ఉన్న నిర్మల్‌లో ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## రాతి పైపులు

మురుగు నీటిపారుదలకు రాతిపైపులను ఎక్కువగా ఉపయోగిస్తారు. సిమెంటు, కాంక్రీటు పైపుల కన్నా యివి చాలా అనువైనవి. ప్రస్తుతం ఆదిలాబాదు జిల్లాలో యీ పైపులకు ఎక్కువగా డిమాండు లేకున్నా ఆంధ్ర ప్రదేశ్ యితర ప్రాంతాలలోను హైదరాబాదు నగరంలోనూ ఎక్కువ డిమాండు ఉన్న దృష్ట్యా యీ పైపుల తయారీని చేపట్టవచ్చు. ఆదిలాబాదు జిల్లాలో అనువైన బంకమన్ను, బొగ్గు బాగా లభిస్తున్నందువల్ల మంచిర్యాలలో ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## బోల్టులు, నట్‌లు, రివెట్‌లు

ప్రస్తుతం జిల్లాలో 80½ టన్నుల బోల్టులు, నట్‌లు, 26 టన్నుల రివెట్‌లకు డిమాండుఉంది. బొంబాయి, హైదరాబాదు, కలకత్తాలనుండి వాటిసరఫరా జరుగుతున్నది. మంచిర్యాలలో ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## మేకులు (డాగ్నేల్స్)

ప్రస్తుతం జిల్లాలో 24 టన్నుల మేకుల (డాగ్నేల్స్) వాడకం ఉంది. వార్షికంగా 20 శాతం చొప్పున డిమాండు పెరుగుతున్నది. ఐదు సంవత్సరాలలో 48 టన్నుల వాడకం ఉండవచ్చు. ప్రస్తుతం కలకత్తానుండి వాటి సరఫరా జరుగుతున్నది. బెల్లంపల్లిలో గానీ, మంచిర్యాలలో గానీ ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## గమ్, పేస్ట్

చల్లసీళ్లలో గమ్ అర్బిక్‌ను కరగించి గమ్‌పేస్టు తయారు చేస్తారు. కాగితం పేస్టుగాను ఆఫీసులలోను దానిని ఉపయోగిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లో వార్షికంగా రూ. 60,000 ల విలువ చేసే గమ్ పేస్టు ఉపయోగిస్తున్నారని అంచనా. బొంబాయి, మద్రాసు, కోయంబత్తూరు, హైదరాబాదుల నుండి గమ్‌పేస్టు సరఫరా జరుగుతున్నది. ఆదిలాబాదు జిల్లాలో గమ్ లభిస్తుంది. నిర్మల్‌లో గమ్‌పేస్టు తయారీ యూనిటును నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

## ఫౌండ్రీ, మిషన్ షాప్

ఆదిలాబాదు జిల్లాలో ఫౌండ్రీ, మిషన్‌షాప్ యూనిటులేదు. వార్షికంగా రు. 6.30 లక్షల విలువచేసే ఫౌండ్రీ, మిషన్ షాపు పనులు జరుగుతున్నాయి. సిర్పూరు కాగితం మిల్లు, సర్సిల్కు పరిశ్రమ, సింగరేణి బొగ్గు గనులు, సిమెంటు పరిశ్రమల్లో అధిక సంఖ్యలో వాటి వినియోగం జరుగుతున్నది. మంచిర్యాలలో ఒక యూనిటును నెలకొల్పవచ్చు.

## వాషింగ్ సోప్

ఆదిలాబాదు జిల్లాలో ప్రస్తుతం సోప్ (సబ్బు) ఉత్పత్తి చేసే యూనిట్లులేవు. ఆదిలాబాదు జిల్లాలో వాషింగ్ సోప్‌కు మంచి డిమాండు ఉంది. ప్రస్తుతం బొంబాయి, హైదరాబాదు, నిజామాబాదులనుండి సరఫరా అవుతున్నది. నిర్మల్‌లో ఒక యూనిటు నెలకొల్పడానికి మంచి అవకాశాలు ఉన్నాయి.

# పెద్ద పరిశ్రమలు

### వ్యవసాయ పరిశ్రమలలో ఉపయోగానికి పనికిరాని వస్తువులతో (పార్టికల్ ) చిన్న బోర్డుల తయారీ

భారతదేశంలోని యీ పరిశ్రమలోని ఆరు యూనిట్లలో 24700 టన్నుల పార్టికల్ బోర్డులు తయారు అవుతున్నాయి. వాటిని ఎక్కువగా కలపతో తయారుచేస్తారు. భారతదేశంలో నాలుగవ ప్రణాళిక ఆఖరునాటికి వార్షికంగా 60,000 టన్నుల బోర్డుల ఉపయోగిస్తారని అంచనా. అంపపు పొడి, ఉపయోగపడని కలప, వరి పొటుతో యీ బోర్డులను తయారు చేయవచ్చు. ఒక టన్ను బోర్డుకు రు 180/ల ఖర్చు అవుతుంది. అంటే ఒకచదరపు మీటరుకు రు. 1 ఖర్చుఅవుతుంది. వాటిని తయారుచేయడానికి అవసరమైన యంత్ర పరికరాలు దేశంలోనే రూపొందించవచ్చు. యంత్రాలు, యితర పరికరాలకు 8.60 లక్షల పెట్టుబడి అవసరమవుతుంది. ఒక లక్ష రూపాయలు నిర్వహణ ధనం కావాలి. 

### తెలంగాణా అభివృద్ధికి దీర్ఘకాలిక ప్రణాళిక : నిపుణుల సంఘం నియామకం

తెలంగాణా ప్రాంతంలో 5, 6 పంచవర్ష ప్రణాళికలకాలంలో అమలు జరపడానికి వీలుగా దీర్ఘకాలిక పథకాన్ని రూపొందించే నిమిత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక నిపుణుల సంఘాన్ని నియమించింది.

ప్రణాళిక, సహకారశాఖ కార్యదర్శి యీ సంఘం అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు. సభ్యులు: డా।। గౌతమ్‌మాథుర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఎకనామిక్స్ శాఖాధిపతి, ప్రొఫెసర్ డా।। మజూర్‌ఆలమ్, ఉస్మానియా విశ్వవిద్యాలయం భూగోళశాస్త్ర శాఖాధిపతి, ప్రొఫెసర్ డా।। ఎ ఎం. ఖుస్రో, ఆర్థిక అభివృద్ధి వ్యవహారాల సంస్థ, కొత్తఢిల్లీ డా।। సి. హెచ్. హనుమంతరావు, ఆర్థిక అభివృద్ధి వ్యవహారాల సంస్థ, కొత్తఢిల్లీ, ఆచార్య వి. ఎల్. ఎస్. ప్రకాశరావు, భూగోళశాస్త్రశాఖ, ఢిల్లీ విద్యాలయం, డా॥ వి.కె. చెబ్బి, డైరెక్టర్ ఎస్. ఐ. ఇ.టి.యూస్‌ఫ్‌గూడ, హైదరాబాదు, ప్రణాళికశాఖలో ప్రణాళికల డైరెక్టరు యీ సంఘం సభ్య-కార్యదర్శిగా ఉంటారు.

తమ నివేదికను సమర్పించడానికి యీ సంఘానికి ఆరు నెలల నుండి సంవత్సరం వరకు పడుతుంది.

తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షునితో సంప్రదించి యీ సంఘాన్ని నియమించడం జరిగింది.



సాలార్‌జంగ్ మ్యూజియం, హైదరాబాదు

# యాత్రా విషయాల అభివృద్ధికి ఒక ప్రణాళిక

యాత్రావిషయాల అభివృద్ధికి పథక రచనచేయడం అనేదాన్ని ఒక విడి అంశంగా భావించడడానికి వీల్లేదు. మన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధిలో అదీ ఒకభాగం. ఒక ప్రాంతంలో సాధారణ అభివృద్ధి జరగనిదే అక్కడ యాత్రిక స్థలాలను అభివృద్ధి పరచ లేము. ఎందుకంటే యాత్రికస్థలాల అభివృద్ధిఅనే అంశంలో ఆయా ప్రాంతాలలోని రహదారి, వార్తా, రవాణా సౌకర్యాలవంటివి యిమిడి వుంటాయి.

యాత్రావిషయాల అభివృద్ధి కార్యక్రమాన్ని ఎక్కువమంది విదేశ యాత్రికులను ఆకర్షిస్తూ, తద్వార విదేశమారక ద్రవ్యం లభించేవిధంగా మనం రూపొందించుకోవలసిన మాట నిజమే కాని విదేశ యాత్రికులను డాలర్లుకాసే చెట్లుగా భావించి, వాటిని వూపితే డబ్బురాలుతుందనుకోవడం కేవలం భ్రమ. వారు ఖర్చుచేసే డబ్బుకు తగినట్లు వారికిమనం సౌకర్యాలు కల్పించాలి. ప్రతి విదేశీ యాత్రికుడూ ధనవంతుడైవుండడు. అటువంటి వారికి కూడా మనం అవకాశాలు కల్పించాలి. ఖర్చుపెట్టడంలో వారు చాలా జాగ్రత్తగా ప్రవర్తిస్తారు, విచ్చలవిడిగా డబ్బురాల్చరు. ప్రతి విషయాన్ని పట్టిపట్టి చూసే, దానిమీద తగినంత ధనం ఖర్చుచేస్తారు. ఈ మధ్య యిద్దరు అమెరికన్ మహిళలు హైద్రాబాదుకు వచ్చారు. తమకు కావలసిందల్లా ఉండడానికి పరిశుభ్రమైన గది వసతి, మంచినీరు, శుభ్రమైన పక్క, చక్కని ఆహారం అని వారు నాతో అన్నారు. రోజుకు రూ. 100లు అద్దె చెల్లించవలసిన హోటల్లో తమను దింపుతారని ముందుగా తమకు తెలియలేదని కూడా వారు చెప్పారు. ఆ మొత్తంలో మూడోవంతు అద్దె భరించడానికి, అటువంటి గదుల్లో వుండడానికీ వారు యిష్టతచూపారు. అటువంటి గదులు వున్నాయికూడా. అవి వారికినచ్చాయి. తమను అక్కడ దింపిన ట్రావెల్ ఏజెంట్లకు అటువంటి హోటళ్లు వున్నట్లు తెలియనే తెలియదేమో అని సందేహం వెలిబుచ్చారు. బాగా డబ్బున్న విదేశీ యాత్రికులకు మంచి విలాసవంతమైన హోటల్ సౌకర్యాలు కల్పించడంతోపాటు, మంచి హోటళ్లలో ఖాళీలేదనే మిషతో యితరుల విషయం నిర్లక్ష్యం చేయకూడదు.

అంటే మనం కల్పించే వసతి సౌకర్యాలు అన్ని సందర్భాలలోనూ ఉత్తమోత్తమ స్థాయికి చెందినవి కానవసరములేదు. ఎందుకంటే సాధారణంగా యాత్రికులు రానికాలంలో అటువంటి వసతి సౌకర్యాలు ఖాళీగా నిరుపయోగంగా వుండిపోతాయి. ఇది వుపయోగపడని పెట్టుబడిగా తయారవుతుంది. విలాసవంతమైన హోటళ్లలోని రేట్లు, ఆఫ్ సీజనులోవచ్చే దేశీయ యాత్రికులకు కూడా అందుబాటులో వుండేవిధంగా సవరించుకోవడం అవసరం. కాని ప్రస్తుత పరిస్థితుల్లో బాగా డబ్బు ఖర్చుపెట్టగలిగిన యాత్రికుల సౌకర్యాలమీదనే ఎక్కువగా దృష్టి కేంద్రీకరించడం మంచిది.

టూరిస్టు కార్ల సంఖ్యను పెంచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. కాని అది ఒక్కటే చాలదు. సరసమైన రేటుకు, అనుకూలమైన సమయాలలో దర్శనీయ స్థలాలు త్రిప్పి చూపించే పర్యటన కార్యక్రమాలు ఏర్పాటుచేయడం అవసరం. వీటిని విదేశ యాత్రికులు చాలా ఎక్కువగా వుపయోగించుకుంటున్నారు. కాని టూరిస్టు కార్లను నలుగురికంటే తగ్గకుండావున్న యాత్రికులు, అందులో బాగాధనవంతులైనవారు మాత్రమే వుపయోగిస్తున్నారు.

మనకున్న కొద్దిపాటి ధనంతో, అధిక సంఖ్యలో యాత్రా స్థలాలను అభివృద్ధిపరచాలని తలపెట్టడం మంచిదికాదు. వున్న వాటిలో మంచివాటిని యోగ్యమైన వాటిని కొన్నిటిని చేపట్టి, వాటిని అభివృద్ధిపరచడానికీ, అక్కడి సౌకర్యాలు అంతర్జాతీయ స్థాయిని అందుకునేట్లు చేయడానికీ ప్రయత్నం జరగాలి.

ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్నం, నాగార్జునసాగర్, హైదరాబాదులను' అంతర్జాతీయ ప్రాముఖ్యంగల యాత్రా కేంద్రాలుగా అభివృద్ధిపరచాలని మన అభిలాష. నీటి పారుదల ప్రాజెక్టులను చూడాలనీ, గోల్ఫ్ ఆడాలనీ, సముద్రంలో ఈతకొట్టాలనే కోరికతో మాత్రమే విదేశీ యాత్రికులు అంతదూరం నుండి యిక్కడికి రారు. అయితే వారు ఉల్లాసంగా ఉండడానికి అవి కూడ కొంత వరకు తోడ్పడతాయి. ఎక్కడాలేని కొన్ని ప్రత్యేకతలను మనం కల్పించాలి. రమణీయ ప్రకృతి దృశ్యాలు, కమనీయ వినోద ప్రదర్శనాలవంటి అంశాలను బాగా అభివృద్ధిపరచాలి. భారత దేశ అద్వితీయ సంస్కృతీ సంస్కారాలనూ, దాని రామణీయకతనూ, ఆచారవ్యవహారాలనూ బాగా వెలుగులోకి తెచ్చేవిధంగా యాత్రా కేంద్రాలను రూపొందించాలి.

సాలార్‌జంగ్ వస్తు ప్రదర్శనశాల ప్రపంచ ప్రఖ్యాతి గాంచింది. ప్రతి విదేశీ యాత్రికుడు 'తప్పక' చూడాల్సినది. అయితే భారతీయ పద్ధతిలో రూపొందించబడి, భారత దేశపు జంతువులతో అలరారుతున్న నెహ్రూ జూలాజికల్ పార్కు యాత్రికుల హృదయాన్ని ఆకట్టుకున్నది. విదేశీ యాత్రికు లందరూ పురాతన కట్టడాలు, కోటలు, జలాశయాలను మాత్రమే చూడడానికి వస్తారని మనం అనుకోరాదు. అయితే తాజ్‌మహల్ వంటి అపూర్వ నిర్మాణాల సంగతివేరు. భారత దేశంలోని ఉత్తమ విశేషాలను సందర్శించాలని వారువస్తారు. అంత వున్నత స్థాయిలోనే మనం వారికి దర్శనీయ స్థలాలు చూపించాలి.

అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ స్థాయిలోని యాత్రా కేంద్రాలను అభివృద్ధిపరచడంలో పరస్పర సంబంధం, సామరస్యం ఉండాలి. ఇవన్నీ ఒకదానికొకటి పెనవేసుకొని ఉన్నాయి. వీటి సమీకృత స్వరూపమే సత్ఫలితాలను యిస్తాయి. అంతేగాక ఒక ప్రాధాన్యతా క్రమం కూడా మనకు ఉండాలి. స్థానికస్థాయిలో ప్రజల సహకారంతో స్థానిక సంస్థలు యాత్రా కేంద్రాలను అభివృద్ధి పరచాలి.

యాత్రికులు తమ దేశానికి కొన్ని స్మృతిచిహ్నాలను తీసుకెళ్లడానికి డబ్బు ఖర్చుచేస్తారు. కనుక యాత్రావిషయాల అభివృద్ధితోపాటు చేతి పరిశ్రమల అభివృద్ధికూడా జరగాలి. విభిన్న అభిరుచులవారికీ అనువైనరీతిగా ఉత్తమమైన చేతిపరిశ్రమల వస్తువులను ఆకర్షణీయంగా ప్రదర్శించాలి.

యాత్రావ్యవహారాలను ఒక పరిశ్రమ స్థాయిలో వాణిజ్య దృష్టితో అభివృద్ధి పరచాలి. యాత్రికుడు తాను ఖర్చుచేసే డబ్బుకు తగినఫలాన్ని పొందుతూ యీపర్యటనతో తనకు తగిన ప్రయోజనం కలిగిందనే భావనతో తన స్వదేశానికి తిరిగివెళ్లే విధంగాఉండాలి. ఏదేశానికైనా సంతృప్తితో తిరిగి వెళ్లిన యాత్రికుని మించిన ప్రచారకుడు మరొకడు ఉండడు.

—పి. వి. ఆర్.

---

(9వ పుటనుండి)

స్థాయిగల వ్యక్తులకు అది అర్థం కాదు; ఆ స్థాయికంటే పై స్థాయికి చెందిన వ్యక్తుల దృష్టిలో ఆ కళాసృష్టి హీనంగా గోచరిస్తుంది. మరి ఈ సమస్య తీరటం ఎట్లా ? ఎవరి నిమిత్తం చేయాలి మరి ? కస్మై దేవాయ హవిషా విధేమ ?

ఇది ఏమంత క్లిష్ట సమస్యకాదు. సమాజంలోని వ్యక్తులంతా ఒకే మానసిక స్థాయికి చెంది వుండనట్లే కళాకారులంతా కూడ ఒకే మానసిక స్థాయికి చెందివుండరు. కనుక ఒకొక్క మానసిక స్థాయికి చెందిన సామాజికుల నిమిత్తం ఒకొక్క మానసిక స్థాయికి చెందిన కళాకారులు తమ తమ కళాసృష్టిని చేయవచ్చు. అప్పుడు ఎవరి స్థాయి వారికి అనుకూలించటంతో అర్థం కావటంలేదు అనే మాటే వుండదు. అయితే సమాజంలోని నిమ్న స్థాయీ వ్యక్తులను క్రమేణ ఉన్నత స్థాయీ కళను అర్థం చేసుకొనేట్లు తయారు చేయాలి.

## గుప్తతా, వ్యక్తతా

సంజీవదేవ్ వ్రాస్తాడు ఒక చోట "Society vitalises art while art enchants the society. Art reveals what society conceals. Both revelation and concealment are equally required for the fulfilment of life" సమాజం కళను సజీవపరుస్తుంది; కళ సమాజాన్ని ఆనందపరుస్తుంది. సమాజం గుప్తపరచేదాన్ని కళ వ్యక్త పరుస్తుంది. గుప్తతా, వ్యక్తతా రెండూ కూడ జీవన సాఫల్యానికి సమానావసరాలే. ★




ఎం. ఫణిభూషణరావు

విజయవాడ పట్టణం మధ్యగల గాంధీకొండ—జాతిపితకు మనం నిర్మించుకున్న ఒక అపూర్వమైన స్మృతి చిహ్నం. రానున్న తరాలవారికి ఆయన దివ్యసందేశాన్ని అందజేసే జ్ఞానపీఠం.

విజయవాడ పట్టణం మధ్యలోగల గాంధీకొండను, జాతిపిత బాపూజీకి అపూర్వస్మృతి చిహ్నంగా రూపొందిస్తున్నారు. గాంధీ జాతీయ స్మారక నిధి సంఘంవారు యీ విధమైన స్థూపాలను ఏడింటిని నిర్మించాలని తలంచారు. విజయవాడలోని స్థూపం వాటిలో మొట్టమొదటిది. ఈ స్థూపాల నమూనాను స్వర్గీయ నందలాల్‌బోస్ రూపొందించారు. విజయవాడలోని యీ స్థూపం సముద్రమట్టానికి 500 అడుగుల ఎత్తున గాంధీకొండమీద ఏర్పాటు చేశారు. 52 అడుగుల ఎత్తైన యీ స్థూపాన్ని ఎర్రపాలరాయితో నిర్మించారు. ఈ రాయి నాగార్జునసాగర్ ప్రక్కనేవున్న గుంటూరు జిల్లాలోని రెంటచింతలలో లభించింది.

ఈ స్థూపం అడుగున కట్టిన గద్దె 75 అ. పొడవు, 75అ. వెడల్పు వుంది. దీనికి కూడా రెంటచింతలనుంచి తవ్వితెచ్చిన పాలరాయినే వుపయోగించారు. ఈ స్థూపంమీద గాంధీజీకి అత్యంత ప్రీతిపాత్రమైన గ్రామీణ పరిశ్రమల శిల్పాలు చెక్కబడ్డాయి. వీటిని గుంటూరు జిల్లాలోని దుర్గి గ్రామంలోగల సుప్రసిద్ధ శిల్పులు చెక్కారు. ఈ స్థూపానికి ఆనాటి భారత ప్రధానమంత్రి లాల్‌బహదూర్‌శాస్త్రి శంకుస్థాపన చేశారు.

గాంధీస్మారక నిధి సంఘంవారు గాంధీజీ స్మృత్యర్థం భారతదేశంలో ముఖ్యమైన ఏడు ప్రాంతాలలో యీ విధమైన స్థూపాలను నిర్మించతలపెట్టారు. ఆ ప్రాంతాలు: కట్లల్ (గుజరాత్) ఎరవాడ జైలు, గౌలియ టేంక్ (బొంబాయి), కన్యాకుమారి, వైకం (కేరళ), బెల్గాం (మైసూరు) మోతీహారి (బీహారు), విజయవాడ (ఆంధ్రప్రదేశ్)

విజయవాడలో యీ స్థూపాన్ని నిర్మించడానికి ఒక కారణం లేకపోలేదు. విజయవాడ పట్టణానికి గాంధీజీతోనూ, గాంధీజీ నడిపిన అనేక ఉద్యమాలతోనూ, చిరకాలంగా సన్నిహిత సంబంధం వుంది. ఒకకోటి మందిని సభ్యులుగా చేర్చుకోవాలని, కోటి రూపాయల స్వరాజ్య నిధి సేకరించాలని, దేశమంతటా 20 లక్షల చరఖాలను పంపిణీ చేయాలని ముఖ్యమైన మూడు నిర్ణయాలను విజయవాడలో 1921 మార్చి 31–ఏప్రిల్ 1 తేదీల్లో జరిగిన చరిత్రాత్మకమైన అఖిలభారత కాంగ్రెసు సమావేశంలోనే నిర్ణయించడం జరిగింది. త్రివర్ణ పతాకాన్ని స్వర్గీయ పింగళి వెంకయ్య గారు విజయవాడలోనే రూపొందించారు. గాంధీజీ తన హరిజన యాత్రను ప్రారంభించి 5 వేల రూపాయల నిధిని సేకరించిందికూడా విజయవాడలోనే. ఆంధ్రమహిళ శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి ప్రప్రథమంగా ఖద్దరుధారణ గావించినదికూడా విజయవాడలోనే.

## స్మారక గ్రంథాలయం

గాంధీస్మారక స్థూపం దిగువలో గాంధీ స్మారక గ్రంథాలయాన్నీ, సెమినార్ హాల్‌ను కట్టారు. దీనికి వాడిన గ్రానైట్ రాయిని గుంటూరు జిల్లాలోని పేరేచెర్ల క్వారీలనుంచి సేకరించారు. ఈ గాంధీ స్మారక గ్రంథాలయానికి స్వర్గీయ లాల్‌బహదూర్‌శాస్త్రి శంఖుస్థాపన చేశారు. సెమినార్‌హాలుకు మహాత్మాగాంధీజీ వద్ద కార్యదర్శిగా పనిచేసిన ప్యారేలాల్ శంఖుస్థాపన చేశారు.

## గాంధీ ప్రదర్శన

గాంధీ శత జయంత్యుత్సవాల సందర్భంలో ఢిల్లీలో జరిగిన గాంధీ దర్శన్ ప్రదర్శనలో ఆంధ్రప్రదేశ్ పెవెలియన్‌లో ప్రదర్శించిన వాటిని విజయవాడలోని గాంధీ కొండ సంఘానికి బహూకరించారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సేకరించిన అనేక గాంధీజీ ఫోటోగ్రాపులను గ్రంథాలయ హాలులో ప్రదర్శిస్తున్నారు.

## కాంతి–శబ్దప్రసార ప్రదర్శన

గాంధీ శతజయంతి ఉత్సవ సమయంలో గాంధీకొండమీద ఏర్పాటు చేసిన గాంధీజీ జీవితానికి సంబంధించిన కాంతి–శబ్ద ప్రసార కార్యక్రమం నిజంగా అపూర్వమైనది. కాంతిద్వారా, శబ్దంద్వారా గాంధీజీకి తిరిగిప్రాణ ప్రతిష్ఠ చేసిన అనుభవాన్ని యిది కలిగించింది ప్రపంచంలోని యితర ప్రాంతాలలోలాగా చారిత్రిక సంఘటనలను నటించి ప్రదర్శించేబదులు యిక్కడ యీ గాంధీ కొండమీద ఏర్పాటు చేసిన యీ కాంతి, శబ్ద ప్రసార పరికరాలు మహాత్మాగాంధీ జీవితాన్ని కళ్ళకు కట్టినట్టు చూపుతాయి.

గుజరాతులోని పోర్‌బందర్‌లో గాంధీజీ జన్మించిన యింటి నమూనా, దక్షిణాఫ్రికాలో ఆయన నిర్మించిన ఫొయినెక్స్ ఆశ్రమం, అహమదాబాదులోని సబర్మతి ఆశ్రమం, వార్ధాలోని సేవాగ్రాం ఆశ్రమాల చిన్న సైజు నమూనాలను యీ కొండ అంచులమీద నిర్మించారు. ఈ నిర్మాణాలూ, వీటివెనుక ఆకాశంలోకి చొచ్చుకుపోయినట్టు నిలిచివున్న స్థూపం—యివన్నీ వీటిముందు ప్రత్యేకంగా నిర్మించిన వేదికవంటి ప్రదేశంలో నిలబడిచూస్తే అత్యంత

మనోహరంగా అగుపిస్తాయి. కాంతి - శబ్ద ప్రసార కార్యక్రమంలో గాంధీజీ కంఠం, ఇతర దేశనాయకుల కంఠాలు మాటిమాటికీ వినిపించి కొండంతా ప్రతిధ్వనిస్తుంటాయి. ఈ కార్యక్రమాన్ని అత్యంత నిపుణులైన కళాకారుల, సాంకేతిక వేత్తల బృందం రూపొందించింది. ఆకాశవాణి కేంద్రంవారు దీనిని ఆంగ్లం, తెలుగు భాషలో ప్రసారం కూడా చేశారు.

## గాంధీ ఖగోళ దర్శిని

గాంధీకొండ దగ్గర రైల్వే స్టేషనుకుపోయే జవహర్లాల్ నెహ్రూ రోడ్డులో కొండమీదకు బాట ప్రారంభమయ్యేచోట అందమైన భవనంలో మధ్యరకం ఖగోళ దర్శిని ఒక దానిని ఏర్పాటు చేశారు.

దక్షిణ భారత దేశంలోగల ఏకైక ఖగోళ దర్శిని యిది. ఈ పరికరాలను న్యూయార్కులోని ఫోర్డు ఫౌండేషన్‌వారు బహూకరించారు.

గాంధీ స్మారక గ్రంథాలయ భవనంలో శ్రీ జమ్నాలాల్ బజాజ్ అబ్జర్వేటరీ పేరున ఒక ఖగోళ దూరదర్శినిని, ఒక అంతరిక్ష కెమేరాను ఏర్పాటు చేశారు. వీటిని బొంబాయిలోని బజాజ్ సేవా సంస్థవారు బహూకరించారు. ఈ కొండను సందర్శించే వారికి నక్షత్రాలతో మనోహరంగా కనిపించే ఆకాశాన్ని మాత్రమే గాక, గాంధీ కొండ చుట్టూగల సుందర దృశ్యాన్ని సైతం చూసే అవకాశం ఏర్పడింది.

## గాంధీ బాలల పరిశోధనా కేంద్రం

కేంద్ర విద్యాశాఖ స్టేట్ మంత్రి ప్రొఫెసర్ షేర్‌సింగ్ గాంధీ కొండమీద బాలబాలికల నిమిత్తం పరిశోధనా కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. పాఠశాలలకు వెళ్ళే బాలలకు ఆదర్శప్రాయమైనదిగా, ప్రయోజనకారిగా చెప్పదగ్గ కేంద్రం యిది. విజయవాడ పట్టణంలోని వివిధ విద్యాసంస్థలలో చదువుకొంటున్న బాల బాలికలను రోజూ బృందాలవారీగా యీ కేంద్రానికి పంపించడం జరుగుతుంది. ఈ కేంద్రంలో మహాత్మాగాంధీ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలమీద పెద్దలు, విజ్ఞులతో ఒక గంట సేపు పిల్లలకు బోధన గరపబడుతుంది.

గాంధీ స్థూపం దిగువన కొండచుట్టూ బాలల రైలు ఒకటి ఏర్పాటు చేశారు. పిల్లలకు ఆసక్తికరమైనది కూడా యిదే. ప్రతి రోజూ సాయంకాలం 4 గం. నుంచి 8 గం. వరకు యీ రైలు తిరుగుతూ వుంటుంది. కృష్ణానది ఒడ్డునగల సుందర ప్రకృతి దృశ్యాలను తిలకిస్తూ పిల్లలూ, పెద్దలూ అందరికీ అమితమైన ఆకర్షణగా యిది వుంది.

సుప్రసిద్ధ సర్వోదయ నాయకుడు డా. వెంపటి సూర్యనారాయణ యీ గాంధీ కొండమీద నిర్వహిస్తున్న సర్వోదయ కేంద్రం విజయవాడ పట్టణంలో సర్వోదయ కార్యక్రమాలకే కేంద్రంగా వుంటున్నది. మహిళల నిమిత్తం వెయిలరింగు పాఠశాలను ఒక దానిని యిక్కడ నిర్వహిస్తున్నారు. కుటీర పరిశ్రమల శిక్షణ కేంద్రం కూడా ఒకటి నడుపబడుతున్నది.

## చలన చిత్రాల అభివృది మండలి ఏర్పాటు

చలన చిత్ర పరిశ్రమను శాస్త్రీయ పద్ధతులలో అభివృద్ధిపరచే దృష్టితో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రస్థాయిలో ముఖ్యమంత్రి అధ్యక్షతన "చలనచిత్ర అభివృద్ధి మండలి"ని ఏర్పాటు చేసింది. దీనికి సమాచార శాఖామంత్రి, ఉపాధ్యక్షులు, సమాచార, పౌరసంబంధ, యాత్రిక విషయాల శాఖ డైరెక్టరు, మెంబరు—కన్వీనరుగా ఉన్నారు. ఇందులో ఇతర సభ్యులు : శ్రీ కె. జగ్గయ్య, యం.పి., ప్రొడ్యూసర్—డైరెక్టర్లు; శ్రీ యల్. వి. ప్రసాదరావు, శ్రీ బి. యన్. రెడ్డి, ప్రొడ్యూసరు శ్రీ నాగిరెడ్డి, సినీ ఆర్టిస్టు శ్రీ ఎ. నాగేశ్వరరావు, ప్రొడ్యూసరు, డైరెక్టరు, సినీ ఆర్టిస్టు ఎన్. టి. రామారావు, ఆర్టిస్టు శ్రీ దిలీప్‌కుమార్, ప్రొడ్యూసరు—డైరెక్టరు శ్రీ పి. పుల్లయ్య, ప్రొడ్యూసరు, డైరెక్టర్ శ్రీ. రాజ్‌కపూర్, ప్రొడ్యూసర్, శ్రీ మధుసూదనరావు, ప్రొడ్యూసరు—డైరెక్టరు శ్రీ బి. ఆర్ ఛోప్రా, శ్రీసారథీ స్టూడియోస్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ కె. శ్రీనివాసరావు, ప్రొడ్యూసరు శ్రీ డి.వి. యస్.రాజు, ప్రొడ్యూసరు శ్రీ యన్. త్రివిక్రమరావు, సినీ ఆర్టిస్టు శ్రీ దేవానంద్, ప్రొడ్యూసర్— డైరెక్టరు శ్రీ చంద్రశేఖర్, ప్రొడ్యూసరు డైరెక్టరు శ్రీ ఆదుర్తి సుబ్బారావు, నవశక్తి ప్రొడక్షన్ ప్రొడ్యూసరు శ్రీ యల్. లింగశెట్టి, మద్రాసులోని దక్షిణ భారత చలన చిత్ర సాంకేతికజ్ఞుల సంస్థ అధ్యక్షులు శ్రీ డి. యోగానంద. హైదరాబాదు రాష్ట్ర ఫిల్మ్‌ఛేంబర్ ఆఫ్ కామర్సు అధ్యక్షులు, ఆంధ్రాఫిల్మ్‌ఛేంబర్ ఆఫ్ కామర్సు అధ్యక్షులు, ఆంధ్ర ఎక్జిబిటర్స్ అసోసియేషన్ అధ్యక్షులు, హైదరాబాదు ఎగ్జిబిటర్స్ అసోసియేషన్ అధ్యక్షులు హోంశాఖ ప్రత్యేక కార్యదర్శి, ప్రభుత్వ రెవిన్యూశాఖ కార్యదర్శి, పరిశ్రమల శాఖ కార్యదర్శి.



# వర్తమానాంధ్ర చిత్రకళారీతులు

అంట్యాకుల పైడిరాజు

కళ బోధనాత్మకమైనది కాదు. అది మానవుని ఇంద్రియాలను సునిశితము చేస్తుంది. అప్పుడు జీవితంలోని, ప్రకృతిలోని సత్యాలు వానికి ప్రస్ఫుటమవుతాయి.

నిజానికి ఇది ఆంధ్ర చిత్రకళ అని, కళను చెప్పడానికి లేదు. కాని కొన్ని రీతుల ప్రాముఖ్యమువలన ఒక కళను ఆంధ్ర చిత్రకళ అని, రాజపుత్ర చిత్రకళ అని, మొగలాయిల చిత్రకళ అని మనము గుర్తించ గలము. ఇప్పుడు ఆంధ్ర చిత్రకళ అనగా దానికి ప్రత్యేకమైన రీతుల పరిశీలన మాత్రము అవుతుంది. తరతరాలుగా ఆంధ్ర సంస్కృతిని ప్రస్ఫుటింపజేయునది ఆంధ్ర చిత్రకళ.

అయితే కళ, కళగా సర్వకాల సర్వావస్థలకు చెందినది. సార్వజనీయమయినదీను. ఒకనాటి నవ్యకళ మరి యొకనాటి ప్రాచీన కళ అవుతుంది. నిత్య నూతన కల్పనే కళ.

ఆంధ్ర చిత్రకళ తర తరాలుగ భారతీయ కళలతోపాటు దిన దిన ప్రకాశ మానముగా వృద్ధి పొందుతూ వచ్చినది. ఆధునిక పరిణామాలకు ఎంతమాత్రము తీసిపోదు కాని నాటి చిత్రకళా పద్ధతులను నేడుకూడ సాగిస్తే అది చర్విత చర్వకమే అవుతుంది. ప్రపంచములో అనేక పాశ్చాత్య దేశాలతో సంబంధ బాంధవ్యాలు అంతగా లేని కాలమది, అని మనము గుర్తించుకోవాలి. అయితే ఈనాడు మానవుడు చంద్రమండల పరిశోధనకు బయలు దేరాడు. కళలన్ని "జట్" వేగముతో పయనిస్తున్న కాలమిది. కనుక ఒకే కట్టుబడికి లొంగి ఉండనవసరములేదు కళ. మానవుడు స్వేచ్ఛాజీవి కనుక తన అదుపులో తాను సంచరించిననాడే తాను చెప్పగలిగేది రూఢిపరచ గలుగుతాడు. మానవుడు మానసిక వికాసాన్ని పెంపొందింప జేయడానికి ప్రయత్నించక తప్పదు. అతడు కాలమాన పరిస్థితులకు లోనవుతూ ఉంటాడు. ఇది సత్యం!

## నూతనాన్వేషణ

సాహిత్యములో నయితేనేమి, సంగీతములో నయితేనేమి, నాట్యములోనయితేనేమి, మరి యే ఇతర రంగాలలోనయితే నేమి నూతనాన్వేషణ తప్పలేదు మానవుడికి. అయితే కాల ప్రభావాన్ని బట్టి ఎన్నో రీతులు వస్తూ వుంటాయి పోతూ వుంటాయి. గురజాడ అన్నట్లు "క్రొమ్మెఱుంగుల జిమ్మె" క్రొత్త ప్రాతల మేలు కలయిక నేటి కళారీతి అనవచ్చు.

## భారత దేశములో కళా పరిణామం

18 వ శతాబ్దములో బ్రిటిషువారి పరిపాలనా కాలములో రాజపుత్రకళ కానీయండి, మొగలాయి కళ కానీయండి, ఒడిస్సీ కళ కానీయండి, మహారాష్ట్ర కళ కానీయండి, లేదా దక్షిణాది కళ కానీయండి, సాంస్కృతిక వ్యవస్థలన్నిటితో పాటు చిత్రకళ గూడ దిగజారుతూ వచ్చినది 17 వ శతాబ్దము వరకు భారతీయ కళలు గుహల్లోను, దేవాలయాల్లోను, రాజ భవనాల్లోను నిర్విరామముగా జాతీయతా ముద్రలో నిర్మితాలయ్యాయి. కనుకనే ఈనాడు ప్రపంచంలో ప్రత్యేక ప్రతిపత్తిలో భారతీయ కళలకు గౌరవ స్థానమున్నది. నేటి మన చిత్రకారులు, ఇతర రంగాల కళాకారులు, నూతన విధానములో అంత స్థాయిని అందుకోగలడమనేది జరగాలంటే భారత దేశ సాంస్కృతిక దృక్పథమే మారాలి. ఇదే పెద్దమెట్టు. కొందరు కళా విమర్శకులు భారతీయ కళల సాంప్రదాయమును ఇనుప సంకెళ్ళలో బంధింపబడి వున్నాయనడం. ఆ కళల నిజ స్వరూపాన్ని గమనించలేక పోవడమూ, దానికి తగినంత గౌరవ స్థానమీయలేకపోవడమే అవుతుంది.



పూలబాల చిత్రకారుడు: అ. పైడిరాజు

పాశ్చాత్యులు వారి కళాకారులను మన దేశములో నలు మూలల విడిచిపెట్టిన రోజులవి. రాను రాను మన కళాకారులు సాంప్రదాయక కళలకు విదేశ కళారీతులు మేళవింపజేయ పూను కొని ఆ చిత్రరచన అవగాహన చేసుకోవడములో గాఢముగ లీనమైనందున సాంప్రదాయక కళ క్షీణదశకు వచ్చినది. రాను రాను 19 వ శతాబ్దములో విదేశ విధానములు బాగా ప్రబలుతూ వచ్చినవి. అదే సమయములో భారతదేశములో శ్రీ రాజా రవి వర్మ చిత్రాలు, మన రామాయణ, భారత గాథలనుండి చిత్రించినవి భారతదేశ మంతా వ్యాప్తమై, నలు మూలల ప్రజాదరణ పొందినవి. ఆ రచనా విధానము వాస్తవ రూపమును యథాతథంగా చిత్రించినట్టే ఉండేది కాని భారత విధానంతో ఎంత మాత్రము మేళవింపు జరుగలేదు.

## బెంగాలులో

అదే సమయములో వంగదేశములో శ్రీ అబనీంద్రనాథ ఠాగూరు కొంతమంది చిత్రకారులకు తర్ఫీదు ఇచ్చిరి. వారి శిష్యులు దేశము నలు మూలల వ్యాపించి భారతీయ కలలకు న్యాయము చేకూర్చాలని, పాశ్చాత్యుల ఒత్తిడికి లొంగరాదని, నూతనాన్వేషణ జరిపి ఎంతోమంది చిత్రకారులను తయారుచేసిరి. ఈ నాటికి వారి శిష్య పరంపరలోని వారే దేశవ్యాప్తంగా భారత దేశములోనే కాకుండా పాశ్చాత్య దేశాలలో గూడ కీర్తి ప్రతిష్ఠలు నిలబెట్టుకున్నారు. అయితే అదే సమయంలో అమృత షేర్‌గిల్ మాత్రము ప్రాక్ పశ్చిమ విధానాలను జోడించి ఒక నూతన సృష్టిచేసి ఒకస్థిరమైన వైఖరి కలిగేలా చేసింది. విశిష్టమైన రచన సాగించింది. కనుక నేటి వరకును కొంతమంది యువకులలో ఆమె విధానం జీవిస్తూనేవుంది. ఆ విధానములో అమె కృతార్థురాలయిన దనుటలో సందేహములేదు.

## ఆంధ్ర చిత్రకారులు

రానురాను కొంతమంది ఆంధ్ర చిత్ర కళాకారులు, ఆంధ్ర దేశము నలుమూలలనుంచి బయల్దేరి భారతదేశములో నున్న చిత్ర కళాశాలలో చేరి కృతార్థులై ఆంధ్రదేశము వచ్చి ఆంధ్ర చిత్ర కళకు దోహదము చేసిరి. అప్పుడు వారు నేర్చుకున్న కళాశాలలో నేర్పే విధానము వాస్తవరూప రచనా విధానమే అయివున్నప్పటికి జాతీయతతో కూడిన కళా విధానాలను మేళవించెడి వారు. కాని ఆంధ్ర కళారీతుల లోతులలోనికి పరిశోధనను బాహాటంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో జరుగలేదనే చెప్పాలి. అందువలన వాస్తవరూప రచనా విధానము స్వాతంత్ర్యము వచ్చేక మనదేశములో ఎంతో కాలము నిలువలేదు. పాశ్చాత్య రీతుల ఒత్తిడి ప్రబల కారణమై వుండవచ్చు కూడ. అప్పుడు కళాశాలలో ఎకడమిక్ పద్ధతిలో రూప చిత్రాలు ఫోనూనె రంగులలో చిత్రించెడి వారు. ఫోటోగ్రాఫులా, నున్నగా కాకుండ ప్యాచ్ టెక్‌నిక్‌లో యథాతథంగా వుండేలా రంగుల మేళవింపుతో చిత్రించెడివారు. నీటిరంగులతో అవిటెంపరా కానీయండి ఎగ్ టెంపరా కానీయ్యండి, కాంపోజిషన్లు విరివిగా చిత్రించెడివారు. ప్లేట్ ట్రీటుమెంటు లోను రౌండు ట్రీట్



విహంగము చిత్రకారుడు, అ. పైడిరాజు

మెంటులోను రచనలు జరిగినవి. వాష్‌టెక్‌నిక్‌లోను, వెట్ ప్రోసెస్ టెక్‌నిక్‌లోను చిత్రాలు చిత్రించెడి వారు. వెట్ ప్రోసెస్ వాష్‌టెక్‌నిక్‌లో చైనా, జపాను వారు సిద్ధహస్తులు. వారిప్రభావం కూడ మనవారిమీద నాడు వున్నదనాలి. స్టిల్‌లైఫు, లేండుస్కేపు మొదలగునవి చిత్రించెడివారు. ఫ్రెస్కో-పెయింటింగ్స్ గోడల మీద చిత్రించుట నేర్పేవారు. అజంతా, లేపాక్షులలోని చిత్రములు ఈ కోవకు చెందినవే.

తరువాత హెచ్. వి. రామగోపాల్, కె. శ్రీనివాసులు, పిలకా నరసింహమూర్తి, అబ్బూరి గోపాలక్రిష్ణ మొదలగువారు లేపాక్షి కుడ్య చిత్రాల, నకళ్ళు తయారుచేసి ఆంధ్రదేశము నలు మూలల ప్రచారము చేశారు. విశాఖ జిల్లానుండి ఈ వ్యాసరచయిత తెలంగాణానుండి కె. రాజయ్య వారివారి పరిసర ప్రాంతాలలో నున్న కళాఖండాలను పరిశోధించి పరిశీలించి వారి స్వకీయ కల్పనా పటిమతో అనేక చిత్రాలను వేసి భారతదేశం నలుమూలల పంపి ఆంధ్ర చిత్రకళకు దోహదము చేసిరి.

## రంగులు

పూర్వం ఆంధ్ర చిత్రకారులు సుద్దరంగులు, తూలికలు మంచి నిపుణత్వముతో స్వయముగా తయారుచేసుకొనే చిత్రించెడి వారు. వారు తయారుచేసిన చిత్రములు నేటికిని నిలబడి యున్నాయంటే ఆశ్చర్యపడ నవసరములేదు. కాగితములపైన గాని, గుడ్డలపైన గాని, ఆ రంగులను దట్టముగ పూసి చిత్రములు చిత్రించెడి వారు. జేగురురంగు, (ఇండియన్ రెడ్) అర్దళము (పసుపు), నామము, నలుపు, ఆకుపచ్చ, నీలము ముఖ్యముగా వాడెడివారు. ముచ్చిపనివారు మనగాథలనుండి కథల కనుకూలముగా తోలుబొమ్మలను తయారుచేసి రంగులుపూసి ఊరూరా త్రిప్పి తెరపై ప్రదర్శనములు జరిపేవారు. అంతేగాదు కొయ్యపనిమీద లక్కతో తయారుచేసిన రంగులు పొదిగేవారు. అవి చూడముచ్చటగా వుండేవి కొండపల్లి బొమ్మలు, లక్కపల్లి బొమ్మలు. తిరుపతి చందనపు బొమ్మలు మొదలగునవి యిప్పటికిని తయారవుచున్నవి. కాటేజ్ యిండస్ట్రీస్‌గా ప్రభుత్వము దోహదం చేయుట ఆనం



గ్రామికులు చిత్రకారుడు : అ. పైడిరాజు

దించవలసిన విషయం. నాడు తాటాకు గ్రంథాలలో చిత్రములు విరివిగా వేసిరి. గుడ్డలపై అద్దకముతో చాందినీలు తయారు చేసెడివారు. ఏ రంగు కారంగు చదునుగా వేసి, నలుపు రేఖలు దిద్దెడివారు. స్థల విభాగము, రూప సంపకము, రంగుల మేళవింపు, రేఖా విన్యాసము, ఆంధ్రకళారీతులకు అనుగుణముగా కూర్చెడివారు. కళారీతులు వంశ పారంపర్యముగా సాగుతూ వచ్చినవి. ఎక్కువగా వరవడి పద్ధతిలోను "క్యాసిస్టమ్"లో అలంకరణ శైలిలో రచనలు జరిగినవనే చెప్పాలి.

## నవీనయుగం

శ్రీదామెర్ల రామారావు నవీనకాలంలో ఆంధ్రదేశములో సాధించిన విజయము ఎనలేనిది. అంతేకాదు శ్రీ అడవి బాపిరాజు గారు, వరదా వెంకటరత్నం గారు, సి. ఎన్. వెంకటరావుగారు, చామకూరి సత్యనారాయణగారు, చామకూరి భాష్యకాల రావుగారు, అంకాల వెంకటసుబ్బారావుగారు, భగీరథిగారు, వేలూరి రామమూర్తి గారు, కవుతా రామమోహనశాస్త్రిగారు, గుఱ్ఱం మల్లయ్యగారు, వి. ఆర్. చిత్రాగారు ఆ నాడు ఆంధ్రచిత్రకళకు సేవచేసినవారే. ఆ రోజులలో ఈ కళా సేవచేసిన వారిలో వీరు ప్రథమ గణ్యులు. వీరి విధానములు కూడ ఆంధ్రదేశములో అట్టేకాలము జీవించలేక పోయినవనే చెప్పాలి.

తరువాత తరంలో మద్రాసు కళాశాలకు ప్రిన్సిపాలు పదవిలో నుండిన శ్రీ దేవీ ప్రసాద రాయ చౌదరి గురుత్వంలో కొంతమంది ఆంధ్ర చిత్రకారులు తయారయినారు. వీరిలో ముఖ్యముగా పేర్కొనదగినవారు దేవీ ప్రసాదనారాయణరావు, ధనపాల్, శ్రీనివాసులు, పిలకా లక్ష్మీనరసింహమూర్తి, మొక్కపాటి కృష్ణమూర్తి, రామగోపాల్, పైడిరాజు, S.V.S. రామారావు, గోఖలే మొదలగువారు. వీరందరు ఆంధ్రదేశ చిత్రకళకు సాటిలేని కృషి సల్పిరి. వీరిలో ఎంతోమంది అనేక కళారంగములలో, ఇతర రాష్ట్ర కళాకారులతో సమానంగా గొప్పవిజయాలను సాధించిరి. వీరిలో కొందరు ఇప్పటికి చిత్రకారులుగా నిలచివున్నారంటే శ్రీ చౌదరిగారిచ్చిన శిక్షణ ఎంతపటిష్ఠమయినదో తెలిసికోవచ్చును.

భారత దేశములోనే కాకుండ పాశ్చాత్యదేశాలలో కృషిసల్పి కీర్తి నార్జించినవారు ఎంతోమంది వున్నారు. లోగడ శ్రీB.V. నరసింహా రావుగారు, ఆయన సతీమణి శ్రీమతి కరుణారావుగార్లు; తరువాత శ్రీ కృష్ణారెడ్డిగారు శ్రీS.V. రామారావుగారు, ఇంకా ఎంతోమంది పాశ్చాత్య దేశాలువెళ్ళిసాధనచేసి కీర్తి నార్జించుకొంటున్నారు.

## జానపదశైలి

జానపదశైలి అనగా అలంకరణశైలి. ఆ జానపదశైలి అప్పట్లో మరుగుపడిపోయినది. దానిని పునరుద్ధరించాలనే సంకల్పముతో దాని అవసరమని గురించి జాతీయతతో కూడిన విధానాలు దేశవ్యాప్తంగా పెరగాలనే దృష్టితో ఆంధ్రచిత్రకారులు కొంతమంది కృషిజేసారు. ఈ విధానములో భారత దేశములో ఆంధ్రచిత్రకారులకు నలుమూలల ఆదరణ లభించినది. ఈరచనలో కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకున్న చిత్రకారులు K. శ్రీనివాసులు A. పైడిరాజు, P. నరసింహమూర్తి, S. ధనపాల్ K. రాజయ్య, H.V. రామగోపాల్ మొదలగువారు ఎవరి స్వకీయ కల్పనతో వారు చిత్రింపసాగారు. అయితే వీరికి వాస్తవరూపరచనా విధానాలు కూడ ఎంతో దోహదము చేసాయి. వీరిలోకొందరు ఇప్పటికి ఆధునిక రీతులలో గూడ విజయాన్ని సాధిస్తూనే యున్నారు. విప్లవాత్మకమైన ధోరణి వాదనలుఎన్నో ఉత్తేజ పూరితముగా చేస్తూనేయున్నారు.

స్వకీయమైన ఇష్టాయిష్టాలు వుండవచ్చును. గతంలో జరిగిన ఆదర్శాలకు కట్టుబడి వుండాలని కాని, అలాగని గతంలోని చిత్ర కళారీతులను నేటి కళలతో పోల్చి అయిష్టత ప్రదర్శించడముగాని చేయగూడదు. వాటిని మన యిష్టాయిష్టాల పరిమితులకు జోడించి తీర్పునివ్వడం జరుగగూడదు. నాడుగాని, నేడుగాని, దేనివైన సమస్యలు ఒక్కటే. కళ విజయవంతము కావటానికి పరిష్కార మార్గములు కనుగొనడము జీవిత లక్ష్యము. ఆనాడు జానపద శైలిలో రచనలు నిండుగా జరిగినప్పటికి కొంత నిర్జీవముగా నుండుటకు కాలప్రభావముయొక్క అడ్డంకులే కారణము.

## నూతన కళావిజయాలు

కళారంగములో మొదట కలిగిన విజయాలు ఎంతో సామాన్యములయినప్పటికీ వానిని చులకనగా కొట్టివేయుటకు వీలు లేదు. ఆనాడు ఆంధ్రకళాకారులు ఎన్నోఅడ్డంకులు ఎదుర్కొని, ఒకస్థిరమైన విశ్వాసానికి లోనయి సాధించిన ప్రగతి యీనాడు అర్థంచేసుకోవడము చాల కష్టతరమైనపని. నాడేకాదు, నేడు కూడ యీ ప్రజలు తగినంతగా కళనుగూర్చి తెలుసుకొందామనే ప్రయత్నంచేయక పోవడంవల్ల నిజమైన కళకు అప్పటికీ, ఇప్పటికీ ఒకే భావాలంబనం కలదని తెలిసికోలేక నిరశిస్తున్నారు. ఏదైతే నేమి ప్రజలలో గ్రహించి ఆమోదించేశక్తి పెరగలేదనే చెప్పాలి. ఈ కళ ఎక్కువ, ఈ కళ తక్కువ అనే అభిప్రాయాలు ప్రజలలో

సమసిపోయి, ఇతర కళలతోపాటు చిత్రకళకుకూడ సమానస్థానము ఇచ్చిననాడే ఈ సమస్యలు పరిష్కారమవుతాయి.

రానురాను మన చిత్రకారులు నిజమైన చిత్రకళను వెదకడం ఆరంభించారు పాశ్చాత్య చిత్రకళను గ్రుడ్డిగా అనుకరించడంకన్న నిజమైన సృష్టికి మూలకారణాలను, సూత్రాలను అవగాహనము చేసికొని సృష్టిచేయడము ఆంధ్రచిత్రకారులకు కర్తవ్యమని గ్రహించారు.

స్వచ్ఛమైన కళను ప్రతిదేశములోను, ప్రతి కళాకారుడూ తన మనస్తత్వాన్ని అనుసరించి జీవిత విధానాన్ని తన ఆశయాలకు జోడించి అర్థంచేసుకొని సృష్టిస్తాడు. గతంకన్న వర్తమానము మీద ఆసక్తి ఎక్కువ అయినప్పటికీ సాంప్రదాయపు పునాదుల మీద నేటి కళాకారులు సృష్టిచేసిననాడే విశిష్టమైన కళారూపాన్ని ప్రస్ఫుటింప జేయగలుగుతాడు.

దాదాపు పాశ్చాత్య కళామార్గాలన్నిటిని స్వీకరిస్తూనే వున్నాడు నేటి చిత్రకారుడు. సరిక్రొత్త రూపాలను సృష్టించు కొనుటకు అన్వేషణ జరుపుచున్నాడు. కాని ఇంతవరకు ఒక నిర్ణీతమైనశైలి మనకు కలదని అనగలరా ? ఒకపద్ధతిలో శైలి ఈ నాడు సాగినట్టు కనబడదు. గత రెండు దశాబ్దాలుగా నూతన చిత్ర రచనా విధానము అభివృద్ధిచెందుతూ వచ్చినది. మన చిత్ర కారులు అసంఖ్యాకముగా తమచిత్ర రచనలుచేస్తూ భారతదేశ కళా ప్రదర్శనాలలో ఎన్నో విజయాలు సాధించి కళాభ్యుదయానికి మైలురాళ్లు నిర్మించుకొంటున్నారు.

సంగీత సాహిత్య నాట్యాలలో కన్న చిత్రరచనలో, శిల్ప రచనలో నవీనత్వము ఒక్కడుగు ముందుకు వేస్తున్నదనే చెప్పాలి. మనము పాశ్చాత్యుల కనుకూలమగు నేటి రచనలు సాగించడంకాదు మనకు కావలసినది. వారితో సమానముగా మన రచనలు ప్రదర్శింప బడుచున్నవని సంతృప్తిపొందడముకాదు. ప్రపంచములో ఒక ప్రత్యేకస్థానము పొందడమన్నదే గట్టి సమస్య. పూర్వకళకు నేటి ఆధునిక కళకు యిదే భేదము. వీరి ప్రభావము మనవారిపై విశేషంగానేసాగి ఒక్కొక్కసారి వెర్రితలలు వేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ లలితకళా ఎకాడమీ 1962లో ఏర్పడిన తరువాత ఆంధ్రచిత్రకారుల దృక్పథమే మారిపోయినది. అంత కంటె పూర్వము నుండి యీ విషయములో హైదరాబాదు ఆర్టు సొసైటీ ఎన్నో విజయాలు సాధించినది. శ్రీ .N. గుప్తాగారు యువకళాకారులకు పునాదులు నిర్మించారనుటకు సందేహములేదు. మనరాజధానిలో ఆధునిక కళా పరిణామానికి దారితీసినవారు, శ్రీ విద్యాభూషణ్ శ్రీ P.T. రెడ్డిగారు అనవచ్చు. వీరిరువురి విధానాలు వేరువేరు అయినా కృషి ఎనలేనిది.

ఎక్కడబడితే అక్కడ ముఠాతత్వాలు ఏర్పడినందువలన కళ రాజకీయ పరిధులలో చిక్కుకోకతప్పడంలేదు. ఎన్ని ఆటంకాలు వున్నా ఆంధ్రప్రదేశ్‌లో నైతేనేమి, భారతదేశములో నైతేనేమి అఖిలభారత ప్రదర్శనాలలో విరివిగా చిత్రాలు ప్రదర్శించి, మన్ననలను పొందుతున్నారు.

శ్రీ క్రిష్టారెడ్డి, శ్రీ పి.టి. రెడ్డి, విద్యాభూషణ్, యాసిన్, సూర్యప్రకాశ్, యస్.వి. రామారావు, దొరైస్వామి; దేవరాజ్, మధుసూధనరావు, శేషగిరిరావు, లక్ష్మణగౌడ్, హనుమాన్‌సూరి ధనపాల్, శ్రీనివాసులు, కె. రాజయ్య, ఉస్మాన్‌సిద్ధికి, పైడిరాజు మొదలగువారి చిత్రాలు అఖిల భారత చిత్ర ప్రదర్శనా లలో ప్రదర్శింపబడుతున్నాయి. కొంతమందికి గౌరవము, బహుమానములు లభించాయి.

వీరిలో కొంతమంది ఆధునిక భావాలను పరిశోధిస్తూ నూతన మార్గాలు అన్వేషిస్తున్నారు. మరికొంతమంది గ్రాఫిక్ తదితర యంత్రవిధానాలు పరిశోధిస్తున్నారు. ఏది ఏలాగున్నా ప్రయోగాత్మక దశదాటి తానునిర్మించిన దానిని మననము చేసుకొని ఆంధ్రచిత్ర కళకు భవిష్యత్తులో కూడ న్యాయము చేకూర్చాలంటే మన చిత్రకారులు గూడ సాహసమైన దృక్పథాలను అవలంబించాలి. అలాచేసిననాడే మనకు మనదిగా ఒక నూతన పరిణామము, ప్రపంచములో ప్రత్యేకస్థానము లభించగలదు.



( 46 వ పేజీ తరువాయి )

రామా నేను నీ దాసుడను, దాసాను దాసుడను, నా మనవి ఆలకించి నన్ను ధన్యుణ్ణి చేయి.

దైవప్రార్థనానంతరం పంతులుగారు త్యాగరాజుని "ఓం" నాదాన్ని ఆలపించమన్నాడు.

ఓంకార నాదాన్ని మనస్సును నిశ్చలపరచి ఆలపించాడు.

పంతులుగారు స్వరములు పలికాడు.
సరిగమ పదనిస - సనిదప మగరి స-

సంగీత విద్యాభ్యాసం మాయా మాళవగౌళరాగంతో ప్రారంభం అవుతుంది.

ఆరోహణ–అవరోహణలతో సప్త స్వరములను త్రుటి కాలంలో అప్పజెప్పాడు త్యాగరాజు.

స్వర జతులను కూడ మొదటి దినమే పూర్తిజేశాడు.

త్యాగరాజు యేక సంథాగ్రాహి కావడం పంతులుగారి కెంతో ఆనందమయింది.

గురువువద్ద శుశ్రూష చేయనిదే నేర్చినవిద్యకు సార్థకత లభించదు. ఆ భావనతోనే త్యాగరాజు గురు ప్రబోధము గావించు కొన్నట్లయినది.

(సశేషం)

# అమెచ్యూర్ నాటక సంఘాలు దోహదాలు

గొల్లపూడి మారుతీరావు

ఇద్దరు మిత్రులు కలిసి ఒక షాపు తెరిచారు. ఒక సంవత్సర కాలంలో వ్యాపారం చాలా అభివృద్ధిని సాధించింది. ఇద్దరిలో ఒకతను ఆశావాది. అతనుఅన్నాడు కదా "మన వ్యాపారం బాగా రాణించింది. రోజుకి కనీసం వెయ్యిమందయినా వచ్చి పోతున్నారు" అన్నాడు.

"అది బాగానే వుంది కాని తలుపులూ, నేల చాపలూ రాపిడికి ఎంత అరిగి పోయాయో చూడు" అన్నాడు రెండో మిత్రుడు – అతను నిరాశవాది.

తెలుగు నాటకరంగం యీ మధ్యకాలంలో ఎంత అభివృద్ధిని సాధించిందో ఈ కాలానికి సంబంధించిన వాడిగా వెంటనే చెప్ప లేక పోవచ్చు కాని – ఈ నాటక రంగంలో పై రెండు రకాలమిత్రులు ఉన్నారని రూఢిగా చెప్పవచ్చు. ఇంకా రెండోజాతి మిత్రులే కాస్త ఎక్కువగా కనిపిస్తారు. వ్యాపారం విషయం మరచిపోయి, తలుపుల గురించి ఆలోచించే అదృష్టవంతులు.

ఈ మధ్య తెలుగు నాటకరంగం గురించి – తెలుగు నాటకంతో సంబంధం లేకుండా మాట్లాడే పెద్దమనుషుల్ని ఎక్కడయినా గమనించండి. వారు రెండు విషయాలు చాలా సుళువుగా చెప్తారు. (1) నాటకరంగం దిక్కుమాలిపోయిందని (2) ఈ నాటక రంగ పునరుద్ధరణ జరగాలంటే నాటక శాలలు ఏర్పడాలని. నాటక రంగాన్ని ఎంతో కొంతదగ్గరగా పరిశీలించే ఎవరికయినా యీ రెండూ నిజం కాదని అర్ధమవుతుంది. మనకు తెలియని విషయాల్ని గురించి మనం సుళువుగా చెప్పడానికి ఎన్నుకొనే నినాదాలు లాంటివి యివి – mere escapes.

మొదటి నినాదానికి సమాధానాన్ని వెదికే ముందు రెండో నినాదానికి సమాధానం – ఒకప్పుడు గొప్పగా బ్రతికిన మన పాత నాటక రంగమే అంటాను నేను. మంచి నాటక శాల మంచి ప్రదర్శనకు మెరుగు దిద్దగలదేమో కాని క్రమశిక్షణ, నేర్పూ, చిత్తశుద్ధి లోపించిన ఏనాటక రంగాన్నీ హఠాత్తుగా అగ్రస్థానాన్ని కూర్చోపెట్టలేదు. మనకు కావలసినవి నాటకశాలలు కాదు. నాటక సంఘాలు – మంచి నాటక సంఘాలు – మంచి నటులు, మంచి నాటకాలు వగైరా వగైరా. నాటక శాలలు మంచివి ఉంటే బాధేం లేదు. ఉండాలి, మంచిదే కాని అవి లేనంతమాత్రాన మంచి నాటకం రాదంటే ఎందుకో నమ్మశక్యం కాదు. రచ్చగెలిచాక యిలు గెలుస్తాం అన్నట్టుగా వుంటుంది. (హైదరాబాదు నాట్య విద్యాలయ విద్యార్థుల్ని అడిగితేచెప్తారు – రంగస్థలంతో ప్రమేయం లేని – 'ఆశ' లాంటి ఉత్తమ ప్రదర్శనలు ఎలా యివ్వవచ్చో. డాక్టర్ చంద్రశేఖరం గారు mobile theatre గురించి ప్రయోగాలు చేసి సాధించారు.)

ఇక యీ నాటకరంగం బాగోగులు దీపం సరసన నిలబడ్డ వానికి – ఆ దీపం నీడే తెలుస్తుంది కాని – దాని వెలుగు – ఆ వెలుగు ప్రయోజనం అర్ధం కాదు. దీపానికి దూరంగా ఉన్న వాడికే అది సాధ్యం. నాటక రంగానికి స్వర్ణయుగం యిదేనని మనం భుజం తట్టుకో నక్కరలేదు గాని, ఘోరమయిన దశలో వున్నామని చెవులు పిండుకో నక్కరలేదని నా అభిప్రాయం. ఎలిజబెతెన్ థియేటరు దగ్గర్నుంచి ఈ శతాబ్దపు తొలిరోజుల నాటి మన నాటక రంగాన్ని చూసినా – ప్రతి కాలానికీ వారివారి సమస్యలూ, కాస్తపాటి అవ్యవస్థా, అసందిగ్ధతా యివన్నీ ఉంటూనే వున్నాయి. ఏ నాటక రంగమూ అన్నికాలాల్లోనూ కళాఖండాల్ని సృష్టించలేదు. సాధ్యమూ కాదు. ఒకప్పుడు మంచి దశలో ఉన్న మన పౌరాణిక నాటకరంగంలోనే ఎన్నో సమస్యలు ఎన్నో యిబ్బందులు ఏర్పడ్డాయి. వాటి గురించి 1924 లోనే తర్జన భర్జనలు జరిగాయి. ఆ రోజుల్లో జరిగిన బందరు సభలలో భమిడిపాటి కామేశ్వరరావు గారు, పురాణం సూరి శాస్త్రిగారు, శ్రీపాద కామేశ్వరరావు గారు, గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు, కాశీ కృష్ణాచార్యులు గారి లాంటి పెద్దలు చర్చలు జరిపి ఈ అభిప్రాయానికి వచ్చారు. " సంగీతము చాలా వరకు తగ్గిపోవలెను. నాటక రచన యందు వచన మధికముగా ఉపయోగించవలెను. పాత్రోచితమయిన దుస్తులు ధరింపవలెను. ఆంధ్ర వాఙ్మయమున ప్రదర్శనాను కూలమైన నాటకములింకనూ లేవు "

రూఢిగా యీ నాటకం కళాఖండం అవుతుందని ఎవరూ రాయలేదు. ఏ నాటకమూ ప్రదర్శించనూ లేదు. afterall, no theatre lives on its master pieces, but between them. ఒక గొప్ప రచనకై ఆ నాటక రంగం చేసే కృషే ఆ నాటక రంగ చరిత్ర అవుతుంది. అందులో కాలానికీ, ప్రేక్షకుల అభిరుచులకీ నిలబడలేని చాలా రచనలు రావచ్చు. వాటిని కాలమే పరీక్షకు పెడుతుంది. మంచిని మిగుల్చు కుంటుంది. చెడుని రాల్చు

కుంటుంది. అంతేకాని John Hay లాంటి నాటకాలు వ్రాయలేదని యివాళ Tennessee Williams ని విమర్శించడం ఎంత హాస్యాస్పదంగా వుంటుందో అభిజ్ఞాన శాకుంతలం లాంటి నాటకం రావడంలేదని నేటి రచయితని తప్పు పట్టడం అలాగే వుంటుంది. ఇది సంప్రదాయవాదులు బిగించుకున్న చట్టం. మారే సమాజంతోపాటు అభిరుచులు, సమాజం వేసే ప్రశ్నలు, వాటికి సమాధానాలు అన్నీ మారతాయి. Theatre is immortal not because it never dies but because it is always being reborn. Nothing dies more completely as theatre, but it does only to be eborn more effectively than ever.

అందుకని సంప్రదాయమయిన స్వాతంత్ర్యానికి ముందుగల వృత్తి నాటక రంగాన్ని వదులుకొని స్వాతంత్ర్యానంతర సమాజంలో వ్యక్తిని, వ్యవస్థని చూడగల, చూడవలసిన అవసరంతో తలెత్తిన కొత్త నాటక రంగాన్ని సంక్రమింప చేసుకొన్నాం. మన ప్రస్తుత నాటక రంగానికి, మన పూర్వ నాటక రంగానికి యే విధమైన సంబంధమూ లేదు, ఏ విధమైన పోలికలూ లేవు. Our ameteur theatre is not a consequence of traditional theatre.

అందువల్ల ఈ యింటికి గోడల దగ్గర్నుంచీ మనమే నిర్మించుకోవలసి వుంది. ఇదొక సవాలు. గతం నుంచి ఎటువంటి పాఠమూ అందని పరిమాణంలో మన నాటక రంగాన్ని మనం తీర్చి దిద్దుకోవాలి. ఒక తీరిక గల వ్యవస్థలో ప్రశాంతంగా సాగిన పౌరాణికేతి వృత్తాలతో ఏర్పడిన వృత్తి నాటక రంగం మన కిప్పుడేం సహాయ పడలేదు. ఇవాళ జీవితానికి వేగం పెరిగింది. ఆలోచనలవాడి పెరిగింది. పురాణాల్ని వదలి ప్రస్తుతాన్ని గురించి ఆలోచించ వలసిన, ఆలోచింప జేయవలసిన అవసరం నాటకానికి ఏర్పడింది.

పద్య నాటకాల దశనుంచి క్రమంగా నాటక రంగం సాంఘికేతి వృత్తాల వైపు మొగ్గు చూపింది. కన్యాశుల్కం వెలువడింది. ప్రతాపరుద్రీయం వచ్చింది. కాళ్ళ కూరి నాటకాలు వచ్చాయి. అయినా ఆంధ్ర వాఙ్మయంలో ప్రదర్శనానుకూలమయిన నాటకాలు లేవనుకున్నారు. అంటే వాటి ప్రాశస్త్యం, వాటి ప్రత్యేకత అర్థం కావడానికి కొంత వ్యవధి కావాలన్న మాట. యిప్పటికి యింత కాలం గడిచాక మనకి వాటి మంచి చెడ్డలు దూరం నుంచి చూచి బేరీజు వెసుకొనే అవకాశం కలిగింది.

అందుకని పూరి గా మన 'నిరాశావాది' మిత్రుడిలాగ నాటక రంగాన్ని చూడనక్కరలేదని నా భావన. పోతే ప్రస్తుత ఔత్సాహిక నాటకరంగంలోనూ ప్రతి నాటక రంగంలో లాగే చాలా సాధక బాధకాలు ఉన్నాయి, వుంటాయి. అవేమిటో చూద్దాం.

## నాటకరచన

నాటకరచన ఒక ప్రక్రియగా (Technique) గా పొంద వలసిన వికాసాన్ని పొందలేదు. ఈ శతాబ్ది తొలి రోజులలో నలుగురికీ తెలిసిన పౌరాణిక, చారిత్రిక యితివృత్తాలతో రూపొందిన రచనల్లో ఈ నాటక ప్రక్రియలో మంచి పరిణతి కనిపించదు. కని పించక పోయినా–ఆ కథ ప్రాచుర్యం, ప్రజలలో ఆ పాత్రల ప్రభావం దృష్ట్యా రచనలకు ప్రాచుర్యం వచ్చింది. అప్పటికి రచయితకు నాటకీయత కై పెద్దశ్రమ పడవలసిన అవసరం కనిపించలేదు–కాని స్వాతంత్ర్యానంతరం మొట్టమొదటి సారిగా సాంఘిక యితి వృత్తాలను చేపట్టిన రచయితలూ అంతే crude technique లో రచనలు సాగించారు అయితే యితివృత్తాలలో కొత్తదనం మొట్టమొదటి సారిగా సామాజిక జీవితపు వాస్తవిక చిత్రణ ప్రజలను ఆకర్షించింది. (స్టానిస్లావిస్కీ ఇబ్సన్ ధోరణులు ప్రభావం చూపే రోజులవి) సంఘాన్ని మరమ్మత్తు చెయ్యాలని నా నాటికే చెడిపోతున్న సంఘాన్ని దుయ్యబట్టే ప్రజలలోకి చొచ్చుకుపోయాయి. ఎన్జీవో, మావూరు, విశ్వశాంతి, ముందడుగువంటి రచనలు లాంటివి. గత 20 సంవత్సరాలుగా సంఘం మారుతోంది. ఆ నాటి సంఘంలో కనిపించిన దుర్న్యాయాలు యివాళకూడా పరిష్కారం కాలేదు. సరికదా యింకా నిలదొక్కుకు పోయాయి. యివాళ వ్యక్తి వాటిని ఎదిరించలేనంత నిర్వీర్యుడయ్యాడు. వాటిని అంగీకరించి వాటిలోనే మగ్గిపోయేంత రాటస్థ్యాన్నికూడ అలవాటు చేసుకున్నాడు. నిర్వేదంలోపడ్డాడు. అతనిలో ఒక నిస్పృహ పెరిగింది. అయినా ఆ సమస్యలను 20 సంవత్సరాల క్రిందటి ధోరణిలోనే ఎత్తి చూపక రోగం ముదిరిన టైఫాయిడ్ రోగికి యింకా అజీర్ణం మందే పోస్తున్నట్టుంది. క్రమంగ ఆ వైద్యుడిమీద నమ్మకం పోతుంది. 20 ఏళ్ళ కిందట సంఘం శరీరంమీద కనిపించిన రోగాలు యివాళ అంతర్ముఖ మయ్యాయి. Man has become immune to social vices. He came to accept them. ఇప్పుడు అవే పరిష్కార మార్గాలు అదే ధోరణిలో చెప్పేసామాజికులకు అందడంలేదు. పైగా విసుగు కలిగిస్తోంది. ఇప్పుడు వస్తున్న సాంఘిక నాటకాలు 20 ఏళ్ళ కిందట చెప్పిన భావాలకో, చేసిన నినాదాలకో ప్రతి ధ్వనులుగా మాత్రమే కనిపిస్తున్నాయి. ఆ రోగాలు వ్యవస్థను కబళించి క్రమంగా వ్యక్తిని నాశనం చెయ్యడం ప్రారంభించేయి. ఇవి 'రోగాలు' గుర్తించే పరిస్థితిలో. వ్యక్తిలేడు. యివాళ 80 రూపాయలు మాత్రమే జీతం తెచ్చుకుంటున్న ఒక బీద గుమాస్తా 10 రూపాయలు పక్కనుంచి అందుకోవడ మన్నది ఆలోచించనవసరంలేని 'అలవాటు' అయిపోయిందివాళ. ఇది చిన్న ఉదాహరణ. అంటే సమాజంలో వ్యక్తి నాశనమయి పోతున్నాడు. ఒక విధమయిన moral vacancy ఏర్పడుతోంది. ఇప్పుడు వ్యక్తిని దక్కించుకోవలసిన అవసరం ఏర్పడుతోంది. ఇవాళ మనకి సాంఘిక నాటకంకాక–మళ్ళీ Human drama అవసరం ఏర్పడుతోంది. మన స్వభావాల మీదా, వ్యక్తిత్వం మీదా మంచి ముద్రవెయ్యగల రచనలు కావాలి. అతన్ని ఉద్రేకపరిచే నాటకాలుకావు. అతని మనస్సును కదిలించి ఆలోచింప చేసే నాటకాలు కావాలి. నినాదాలుకావు నిలకడగా నిలిచిప్రశ్నించే సమస్యలను చిత్రించే నాటకాలు రావాలి. జీవిత యధార్థాన్ని చూపగలగాలి. ఈ దృష్టిలో మనకు రచనలు రావడంలేదు. నికోలాయ్ గోగోల్ 'గవర్నమెంటు యినస్పెక్టర్'కి ఎన్ని ప్రతిధ్వనులు—ఎన్ని నాసిరకపు ప్రతిధ్వనులు వచ్చాయో ఒక్కసారి మన రచనలుచూస్తే అర్థమవుతోంది. ఇప్పటికీ యింకా

వస్తున్నాయి. జె. బి. ప్రీస్టీ "ది ఇనస్పెక్టర్ కాల్స్" ఎన్ని రంగుల్ని తెలుగు నాటకాల్లో మార్చుకొందో ఒక్కసారి చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. మానవతా దృక్పథంతో మన్నికగల రచనలు లేకపోవడం నేడు అమెచ్యూర్ నాటకరంగం ఎదుర్కొంటున్న పెద్ద యిబ్బంది అని నా ఉద్దేశం. బుచ్చిబాబు యిలా అన్నాడు— "ఆధునిక నాటకం ప్రజల్ని ఆకర్షించక పోవడానికి కారణం... వస్తువు న్యూనత. ఆధునిక నాటకం హృదయాన్ని కదపదు— బుద్ధిని కదుపుతుంది. బుద్ధితో ఆస్వాదించే ప్రేక్షక జనం వేరు—"

నాటక రచయిత ప్రజా బాహుళ్యంతో సంబంధం పెట్టుకోవాలి. అంతేకాదు ఆధునిక రంగస్థల సంప్రదాయం నెలకొల్పాలనుకున్న రచయిత నిర్వహణతో సంబంధం వదులుకోకూడదు.

## నాటక సమాజాలు

నేటి ఔత్సాహిక నాటక సమాజాలలో చాలా వాటిలో ఉత్సాహం కనిపించినంతగా ఆర్థిక స్తోమత, సఖ్యత, క్రమశిక్షణ, ఒక మంచి ప్రదర్శన యివ్వాలనే ఆశయం—యిలాంటివి కనిపించవు ముఖ్యంగా ఆర్థిక స్తోమత లేకపోవడం చాలా సాధారణంగా కనిపించే యిబ్బంది. విదేశాలలోలాగ విద్యారంగంలోనే Theatre Arts శాఖలుంటే కనీసం విద్యారంగస్థలమయినా వర్ధిల్లేది. ఆ సంస్థల అండతో కొంతవరకు ప్రయోగాత్మక నాటకాలు బ్రతికి బట్టకట్టేవి. కాని మన దేశంలో యింకా ఆ ఆశలేదు. పోతే—ఔత్సాహిక నాటక రంగానికి కాస్తపాటి ఆర్థిక స్తోమత కావాలంటే ప్రేక్షకులు, లేదా అభిమానులను ఆకర్షించే మంచి నాటకాలు వెయ్యగలగాలి. అలా వేస్తే—కొంతలో కొంతయినా డబ్బు కలిసి వస్తుంది. కాని ప్రేక్షకులు రెండోసారి చూడాలనిపించేటంత మంచి నాటకాన్ని చాలా సమాజాలు ప్రదర్శించ లేకపోతున్నాయి. మరి ప్రేక్షకుల అభిమానం వారికి ఎలా దక్కుతుంది ?— (బాగా ప్రదర్శిస్తున్న నాటక సమాజాలకి ఆ ఆదరణ ఉందా లేదా అంటే కొంతలో కొంతయినా ఉన్నదని చెప్పక తప్పదు. వాటి కారణాలు తర్వాత చెప్తాను.) అంటే—సమాజానికి స్తోమతు డబ్బు అనుకుంటే. దాని సంపాదనకు ముఖ్యమైన పెట్టుబడి మంచి నాటకం అనుకుంటే దాని ప్రదర్శనకు నటులలో క్రమశిక్షణ, మంచి నాటకం, సఖ్యత, సాంకేతిక యిబ్బందులు — యిన్ని బయటకు వస్తాయి. అంటే యిదొక విష వలయం—ఈ వలయాన్ని ఎక్కడో ఒకచోట త్రెంచుకొని బయటపడిన నాలుగయిదు సమాజాలు మంచి ప్రదర్శనలే యిస్తున్నాయి. వారు ప్రదర్శిస్తే పదిమంది చూడాలని, డబ్బిచ్చి చూడాలని వుత్సాహ పడటం నాకు తెలుసు. నాటకంచూసి ప్రోత్సహించాలనుకొనే ప్రేక్షకులు లేరను కోవడం తప్పు. ఆ అర్హతను నిలుపుకొనే నాటకాలు, సమాజాలు ఇంకా (ఎక్కువగా) రూపు దాల్చడం లేదని చెప్పుకోవాలి. మంచి నాటకం మనం ప్రదర్శించగలిగి నప్పుడు ప్రేక్షకుల నుంచి మనం ఆశించేది సానుభూతికాదు. మనం నిలదీసి పుచ్చుకోగలిగేది వారి ఆదరణ—పోషణ.

## ప్రయోక్త

ఈ దేశంలో ప్రస్తుతం ఉన్నంత మంది మంచి నటులు ఎప్పుడూ లేరేమోననిపిస్తుంది. ఒక్కొక్క ధోరణిలో ఒక్కొక్క నటుడు నిష్ణాతుడు. కాని వారిని దగ్గర చేర్చే ప్రయోక్త లేనిలోటు కొట్టవచ్చినట్టు మన నాటక రంగంలో కనిపిస్తుంది. డబ్బో, అధికారమో, సమర్థతోగల వ్యక్తి ఆధ్వర్యంలో ఈ కళాకారులు ఒక్కటిగా చేరగలిగితే నాటక రంగానికి మంచి నాటకాలు రాగలవు. అయితే అదెంతవరకు సాధ్యం? అన్నదే ప్రశ్న. ఒక్కొక్క మంచి నటుడికి ఒక్కొక్క సమాజం వుంటుంది. ఆ సమాజంలోని మిగతా నటులంతా అంతంత మాత్రంగా నటించే వాళ్ళయి వుంటారు. తత్కారణంగా ఒక నాటకంలో ఒకపాత్ర మాత్రం బ్రతికి మిగతా పాత్రలంతా చచ్చుగా పడివుంటాయి. మరి నాటకం ఏం బాగుంటుంది. ఏ దేశ నాటకరంగ చరిత్రనుచూసినా చాలా ఘనతను సాధించిన ప్రతీ నాటక సమాజం వెనకా ప్రతీ ఉద్యమంవెనకా ఒక గొప్ప ప్రయోక్త కనిపిస్తాడు. స్టానిస్లావ్‌స్కీ, డేవిడ్, బెలాస్కో, గార్డెన్ క్రైగ్, బళ్ళారి రాఘవ, ధర్మవరం కృష్ణమాచార్యులు ప్రభృతులు. ఇక పోషణరీత్యా ఆధిక్యత వహించిన మోతేవారి కంపెనీ, ఒక కుటుంబ వ్యవస్థగా రూపొందిన సురభి కంపెనీలు మరొక ఉదాహరణ. మూడవది. ఆధికారికంగా బాధ్యతగల వ్యక్తిగా శ్రీ కె. వి. గోపాలస్వామిగారి ఆధ్వర్యంలో సాగిన ఆంధ్ర విశ్వవిద్యాలయ రంగస్థలం. పైన చెప్పిన వివిధ రకాలయిన నేతృత్వాలకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చును.

## అభిరుచి దారిద్ర్యం

నేటి ఔత్సాహిక నాటక సమాజాలలో ముఖ్యంగా కనిపించేది అభిరుచి దారిద్ర్యం. తనకు నచ్చిన పాత్ర వేసే తీటకో, లేదా ఏదో పరిషత్తులో బహుమతికో నాటకం వేయడం, నాటక సమాజాన్ని స్థాపించడం జరుగుతోంది. నాటక ప్రదర్శన ఒక సాధనగా కాక, ఒక ప్రయోజనానికి 'ఆలంబన' గా తయారవుతోంది. కళను ఉద్ధరించడం, ఉపాసించడం లాంటివి చెప్పడానికి పెద్దమాటలు. అయినా ఈ మాటలు తరుచుగా ఉచ్చరించే పెద్దలు ఎక్కువయిపోయారు. వారూ, కొన్ని సమాజాలు నిర్వహిస్తుంటారు. అక్కడ ఏ ఒక్కడో మంచి నటుడుంటాడు. మధ్య మధ్య నాటకంకోసం కాక, ఆ పోషకుని తృప్తికి, లేదా అతని తండ్రిగారి షష్ఠిపూర్తి మహోత్సవానికి, ఒక ప్రదర్శన వేస్తారు. అక్కడితో ఆ సమాజం చరిత్ర ఆగిపోతుంది. ఇదొక పద్ధతి.

నాటకాన్ని ప్రదర్శించే ప్రయత్నంలో ఆనందాన్ని ఒక నూతన ప్రయోగాన్ని జరపడంలోగల తృప్తిని నటుడు అనుభవించగలగడం యిప్పుడు మరీ మృగ్యమయిపోయింది. అందువల్ల నాటక ప్రయోగంలో (Academic Approach) బొత్తిగా పోయింది. మంచి ప్రదర్శనకు గీటురాయి ఏదో బహుమతి అయికూర్చుంది. ఆ బహుమతి పుచ్చుకున్న నటుడు అట్నుంచే సరాసరి మద్రాసు వెళ్ళిపోతాడు. అసలు మద్రాసుపోయే లక్ష్యంతోనే నాటకం ప్రాక్టీసు చేస్తాడు. వీలయితే ఒక దర్శక, నిర్మాతని ముందే ప్రదర్శనకు ఆహ్వానించుతాడు. ఆశలు అంతరిక్షంలో, అర్హతలు పాతాళంలో, అభిరుచులు త్రిశంకు స్వర్గంలో ఉన్ననటులే మనకు తరచు సాక్షాత్కరిస్తారు. పరిషత్తు

బహుమతి—ఆ ఉత్సవంలో నాటకాలతో పోల్చి చూసినప్పుడు, ఆ న్యాయ నిర్ణేతల అభిరుచి మేరకు — దక్కిన గౌరవం అన్న భావన చాలామందిలో వున్నట్టు కనిపించదు. ఈ అభిరుచి దారిద్ర్యం, లక్ష్య శుద్ధి లేమి, నేటి ఔత్సాహిక నాటక రంగానికి పట్టిన అనర్థాలలో ఒకటి. 1923 లో గొల్లపూడి శ్రీ రామ శాస్త్రి గారు అప్పటి నాటక రంగాన్ని గురించి చెప్పిన మాటలు యిప్పటికీ వర్తిస్తున్నాయి.

"నాటకాభినయము ధన సంపాదన ముద్దేశించి జరుగుచున్నది. నటుల యొక్కయు, నాటకముల యొక్కయు, గౌరవము కళా ప్రాశస్త్యమును బట్టిగాక ధనాగమనమునుబట్టి యేర్పడుచున్నది. ధనమవసరముగాన విద్యాధికుల నాట్య సంఘములుకూడ వ్యాపార సమాజముల పద్ధతినే అనుకరించుచున్నవి. ఇప్పటి మహా మంత్ర మిదిగా చెప్పవచ్చును. అస్య శ్రేష్టే యెఫెక్టు మహా మంత్రస్య నాటక మహాశయా ఋషయః కరతాళ ధ్వని చ్ఛందాః నాటక విద్దేవతా ద్రివ్యాకరణ శక్తిః శ కిః ప్రేక్షక జన ప్రీత్యర్థే ప్రేక్షకజన ప్రదర్శనే వినియోగః". ఆంధ్రనాటక సంస్కరణము, (పురాణం సూరిశాస్త్రి).

## నటులు-ఉద్యోగాలు

ఔత్సాహిక నటులు చాలా మంది ఉద్యోగులు. రోజంతా ఆఫీసులో పనిచేసి సాయంకాలానికి రిహార్సలుకి చేరే ఉద్యోగులు ప్రదర్శనకు ముందూ వెనకా ప్రయాణాలకు ఎప్పటికప్పుడు శలవులు దొరకడం కష్టం. ఈ దేశంలో క్రీడారంగంలో క్రికెట్, ఫుట్ బాల్ పోటీలలో పాల్గొనడానికి ప్రభుత్వ కార్యాలయాలు సౌకర్యాలు కల్పిస్తున్నాయి. కాని అదేం పాపమో నాటక రంగాన్ని మాత్రం అలా గుర్తించడం జరగలేదు. క్రీడాకారునికి ప్రత్యేకంగా శలవులూ సదుపాయాలూ యిస్తారు కాని నటుడికి అదెందుకివ్వగూడదు? ఏ ఆఫీసరుగారి బదిలీకో, ఏ క్లబ్బు వార్షికోత్సవానికో నాటకం వేయడం తప్ప ఒక ఉద్యమంగా నాటక రంగాన్ని గుర్తించడం జరగడంలేదు. అటువంటి గుర్తింపు వెసులుబాటు ప్రభుత్వం మిగతా సంస్థలు కలుగజేస్తే నాటకరంగానికి చాలా ఉపకారం జరుగుతుంది. ఆత్మస్థైర్యంతో పదిమంది ఆదరణపొందేకళను చేపట్టానన్న తృప్తితో నటుడు నాటక ప్రయోగం చెయ్యగలడు. నేటి ఔత్సాహిక నాటకరంగం కేవలం ఉద్యోగాలు చేస్తున్న ఈ నటుల వల్లనే జీవిస్తున్నదంటే అతిశయోక్తి కాదు.

## వృత్తి నాటకరంగాని కిదే తోవ

ఏ నాటకరంగంలోనయినా ఔత్సాహికులస్థాయిలో నాటకం రూపుదిద్దుకొని, పరిణతిని సాధించి—వృత్తి కళాకారుల స్థాయిలో స్థిరపడుతుంది. అమెచ్యూర్ నాటకరంగం 'వస్తువు'ను తయారుచేసే విభాగం అనుకొంటే వృత్తినాటకరంగం సేల్స్ఆఫీసు. సేల్స్ బాగుంటేనే నిర్మాణ విభాగం బ్రతుకుతుంది. అలాగే యిక్కడ ఆరోగ్యకరమయిన 'వస్తువు' తయారయితేనే సేల్స్ బాగుంటాయి. మద్రాసు, బెంగాల్, ఒరిస్సా, మహారాష్ట్రలలో వృత్తి నాటకరంగం నిలదొక్కుకొంటూండగా మనకాదశపట్టలేదు. నానాటికీక్షీణించి పోతున్న పౌరాణిక నాటకాలే యింకా వృత్తినాటకరంగానికి చిహ్నలుగా మిగిలిపోతున్నాయి. నాటకరంగలో ఒక ఉద్యమం కాని ఒక సంప్రదాయంకాని స్థిరపడాలంటే ఆ ప్రయత్నం అమెచ్యూర్ నాటకరంగమే చెయ్యాలి. అయితే దాని గుర్తింపు వృత్తిరంగం ద్వారానే కలగాలి. ఒక మంచినాటకం పదిసార్లు ప్రదర్శింపబడినప్పుడే అది క్రమంగా మంచిరూపు దిద్దుకోగలదు. కాని మన అమెచ్యూర్ నాటకరంగం వృత్తినాటకరంగానికి ఆ వారసత్వాన్ని యివ్వలేకపోతోంది. ఎందుకు? అసలు ఆధునిక నాటకానికి ఆ అదృష్టమే యింకా పట్టలేదుకనుక. అందుకనే "ఆధునిక నాటకరంగం అధ్వాన్నస్థితిలోవుంది". అని చాలామంది అదృష్టవంతులు నోరు చప్పరించే అవకాశం కలుగుతోంది — మన పరిషత్తులవల్ల కలిగే కష్టనష్టాలు ఎలాంటివయినా యిప్పుడిప్పుడు పదిచోట్ల పది పరిషత్తులు వెలసిన కారణంగా ఒక నాటకాన్ని కనీసం ఆ పదిచోట్లయినా ప్రదర్శించడం జరుగుతోంది — ఒక మూల ఒక సమాజం చేసిన మంచి ప్రయోగం పదిమందిచూసే అవకాశం కలుగుతోంది. బాగానేవుంది. అయితే దేశంలో పది పరిషత్తులున్నాయను కుంటే పది ప్రదర్శనలకే పరిమితమౌతుంది. తర్వాత పదకొండవ ప్రదర్శనకి పురస్కారంలేక ఆసమాజం—చాలా బాగా ప్రదర్శించే నాటకాన్నయినా—వదులుకొని కొత్త నాటకాన్ని ఎత్తుకోవలసిన అవసరం కలుగుతోంది. ఒక మంచి నాటకాన్ని పదిమందీ, పదికాలాలపాటు చూసే అవకాశం కలగాలంటే వృత్తి నాటకరంగంలోనే అది సాధ్యం. అయితే ఔత్సాహికులు ఉద్యోగులలో, పనివారో కావడం మూలాన full time artistsకాలేరు. ఎక్కువ ప్రదర్శనలకు ఎక్కువ కాలం వినియోగించలేరు మరి యీ ప్రయత్నం ఎలా జరుగుతుంది? ఈ పిల్లికి ఎవరు గంట కడతారు ?

## స్త్రీ కళాకారులు

పైన చెప్పినవికాక స్త్రీ పాత్రలువేసే కళాకారులు, ఔత్సాహికులకు మరొక తీరని సమస్య. బళ్లారి రాఘవ కాలంనాడు ప్రారంభమయిన "స్త్రీలే స్త్రీ పాత్రలువహించే" సంప్రదాయం య్యిటికి నిలదొక్కుకుంది. కాని దురదృష్టవశాత్తూ నాటకాలలో పాల్గొనడం యింకా గౌరవప్రదమయిన విషయంగా సభ్య కుటుంబాలవారు భావించడంలేదు. వారలా భావించనంతవరకు, వారికా విశ్వాసం కలగనంతవరకు నాటక సమాజాల నైతిక వర్తనలో ఏదోలోపం ఉన్నదన్నమాటే. ఢిల్లీ, కలకత్తా లాంటిచోట్ల ఆంధ్ర సంఘాలలో కుటుంబాలలోని స్త్రీలే నాటకాలలో పాల్గొనడం నాకు తెలుసును. అటువంటి శుభోదర్కమయిన సూచనలు మన రాష్ట్రంలో కనిపించడంలేదు.

ఈపని జరగడానికి నటులలో, కొంత నైతికమయిన శిక్షణ మార్పు కావాలంటే — ఒప్పుకుంటాను. పోతే వృత్తి కళాకారులు మాత్రం యినివరకు కంటె కాస్త ఎక్కువ మందే కనిపిస్తారు. వారిలో మంచి నటనాప్రభావం కూడా కనిపిస్తోంది. అయితే వారిని పెట్టుకునే ఆర్థికస్తోమతు సమాజాలకు కరువవుతోంది. అయినా ఏదోవిధంగా తంటాలుపడుతూనే వున్నారు. స్త్రీపాత్రల్తో

ఒక్కొక్కప్పుడు యిద్దరు ముగ్గురు స్త్రీలతో నాటకాలు ప్రదర్శిత మవుతూనే వున్నాయి. ఈ బాధ, బాధ్యత లెరిగిన రచయితలమీదా ప్రభావం చూపుతుంది. ఈ బాధలనుంచి సమాజాలకు తత్కాలిక మయిన విముక్తిని కలిగించడానికయినా స్త్రీపాత్రలు లేనినాటకాలు వేస్తున్నారు.

## మైకులు

ఇన్ని సాధకబాధకాలు తీరాక యిప్పుడు నాటకశాలల గురించి ఆలోచించాల్సివుంది. నిజంగా ఆరోగ్యవంతమయిన, మంచి వెసులుబాటుని కల్పించే నాటకశాలలు మనదేశంలో మృగ్యం దురదృష్టవశాత్తూ మననటుడు మైకులమీద ఆధారపడేస్థితికి వచ్చేశాడు. అది తప్పనిసరిగా నాటకం ఎఫెక్ట్సుని ఎంతో కొంత మేరకు పాడుచెయ్యక తప్పదు. పైగా నాటకంలో సాధించాలనుకున్న వాస్తవికత ఎదురుగ్గా నిలిచివున్న మైక్రోఫోన్సుతో పోతుంది"... Frequently, such little emotion as the modern actor is capable of dispaying is ruined by mike consciousness, or the frequency of interruption from some members of the audience demanding better utilisation of the services of that honourable agency of distortion of the human voice." అన్నారు. శ్రీ కె. వి. గోపాలస్వామిగారు.

## లైటింగు

మరో పెద్ద యిబ్బంది సరైనపద్ధతిలో లైటింగు లేకపోవడం అసలు నాటకశాలలే లేనప్పుడు వాటిని సరిగ్గా illuminate చేసే లైటింగు ఎక్కడి నుంచి వస్తుంది? ఒకవేళ వున్నా గుండెమీద చెయ్యివేసుకు ఆలోచిస్తే నాటకసమాజాల్లో చాలా మందికి 'స్పాట్' ఎలా వుపయోగించాలో ఎందుకు వుపయోగించాలో' తెలీదు. 'డిమ్మర్స్' ఎప్పుడువాడాలో తెలీదు. ప్రతీనాటక ప్రదర్శనకూ 'లైటింగ్ ప్లాట్' ఒకటి ఉంటుందని చాలా మందికి తెలీదు. ఈ కారణంగా థియేటర్‌లో చాలా గొప్పగా వినియోగం కావలసిన ఒక సాధనం An indirect velicle of expression నిరుపయోగమయిపోయింది.

## సద్విమర్శ

ఈ నాటక రంగానికి పెద్ద లోపం ఆరోగ్యకరమయిన విమర్శ లేకపోవడం. ఈ లోపం యిటు రచయితనీ, అటు నాటక సమాజాలనూ కృంగదీస్తోంది. ఉన్న కొద్దిమంది విమర్శకులలో నిర్మాణాత్మకమయిన దృక్పథం, తాత్విక చింతన, వివేచనకంటె పక్కవాడు బాగుపడుతున్నాడన్న 'ఆంధ్రత్వం' ఎక్కువ కనిపిస్తోంది. క్షమిస్తే - అజ్ఞానమూ తరుచుగా తటస్థపడుతోంది. నాటకమన్నది ఎవరయినాచూసి, ఏమయినా వ్రాయగల సులభమయిన 'వినోద' కార్యక్రమంగా భావింపబడుతోంది. దానికీ ఒక academic approach అవసరం అని పాత్రికేయులుకాని, విమర్శకులుగాని గుర్తించినట్టులేదు. ఏనాడో పురాణం సూరి శాస్త్రిగారు, పరవస్తు యజ్ఞనారాయణశాస్త్రిగారు, శ్రీపాద కామేశ్వరరావుగారి కాలంలో ఆగిపోయిన సాహితీవిమర్శ లేనిలోటు యివాళ ముఖ్యంగా నాటకరంగంలో బాగా కనిపిస్తోంది. సద్విమర్శ ఆరోగ్యకరమయిన నాటకరంగానికి చక్కని బాటలు దిదుతుంది.

## భవిష్యత్తు ఏమిటి?

అయితే యివన్నీ ఏ నాటకరంగంలోనయినా కొద్దోగొప్పో కనిపించే సాధకబాధకాలు. ఎప్పుడూ ఏదో ఒకరూపంలో యివి ఉండనేవుంటాయి.

ప్రారంభంలో చెప్పిన కథలో మొదటిమిత్రుడి దృష్టితో చూసినప్పుడు నేటి నాటకరంగంస్థితి అంత నిరాశాజనకంగా లేదని చెప్పాలి. సమస్యాపూరితమయిన యీ ప్రపంచంలో చాలా సమస్యలకు పరిష్కారమార్గాన్ని చూచించడం కాని, ఆలోచింప జేయడంగాని లలితకళల ద్వారానే జరగాలన్న ఆలోచన, ఆకోరిక యిదివరకటికన్న యిప్పుడు చైతన్యాన్ని కలిగించడానికి, ఒక Consciousness ని ఏర్పరచడానికి ముఖ్యమయిన సాధనమని అటు ప్రభుత్వమూ, యిటు సామాజికులూ గుర్తిస్తున్నారు. ఆధునిక నాటకం యిదివరకటికన్న యిప్పుడు దేశంలో మూలమూలలకూ పోగలుగుతోంది. పై సాధకబాధకాలను తట్టుకొని నిలవకలిగితే అచిరకాలంలో నాటకానికి మంచిదశ పట్టగలదన్న సూచనలు యిప్పుడే కనిపిస్తున్నాయి. పరిషత్తులు పెరిగాయి. ప్రతీ ఊరా ఏవో నాటకోత్సవాలు జరుగుతున్నాయి. ఆర్థికమయిన పురస్కారాన్ని కూడా యీ పరిషత్తులు యిస్తున్నాయి. ప్రజలు క్రమంగా నాటకాన్నిచూసే అలవాటు పడుతున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో Theatre Arts విభాగం ఏర్పడింది. కళాశాలలలో తప్పనిసరిగా నాటకసంఘాలు ఏర్పడ్డాయి. రచయితలకు సాహిత్య అకాడమీ బహుమతులను ప్రకటిస్తోంది. ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం యిటు రచనకు, అటు సమాజాలకు యితోధికంగా ప్రోత్సాహాన్నిస్తోంది. ఉత్సవాలు నిర్వహిస్తోంది. హైదరాబాదులో నాట్య విద్యాలయ వెలసింది శ్రీ అక్కినేని నాగేశ్వరరావు వంటి సాహితీ అభిమానులు 'ఆంధ్రజ్యోతి' వంటి పత్రికలు ద్వారా నాటకరచనకు ప్రోత్సాహం లభిస్తోంది. ఒక మంచి నాటకం వెలువడితే యిదివరకటికన్న యిప్పుడు దానికి గుర్తింపు తప్పక ఉంటుందనే ఆశ కలుగుతోంది అది పదిచోట్ల ప్రదర్శింపబడుతుందనే విశ్వాసం కలుగుతోంది. ప్రజలదగ్గరికి పోగలదనే నమ్మకం కుదురుతోంది.

ఆధునిక నాటకరంగంలో ఒక ఉద్యమం, ఒకకొత్త సంప్రదాయం నెలకొనడానికి ఇదే మంచి సమయమనిపిస్తోంది. ఆ ప్రయత్నం జరిగితే ఆధునిక నాటకానికి ఆరోగ్యకరమయిన చరిత్ర తప్పక ఏర్పడగలదు.

---

# వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమల స్థాపనకు ఆర్థిక సహాయం

వెనుకబడిన ప్రాంతాలలో లఘుపరిశ్రమలు, మధ్యతరహా పరిశ్రమల స్థాపనకు రాయితీపై ఆర్థిక సహాయం అందజేయడానికి భారత పారిశ్రామిక ఆర్థిక సహాయ కార్పొరేషన్ నిర్ణయించింది. ఈ సౌకర్యాల కల్పన ఫలితంగా వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమల అభివృద్ధికి దోహదం కలుగుతుందని ఆశించబడుతున్నది. దిగువ తెల్పిన రాయితీలు యివ్వబడుతాయి.

## వడ్డీరేటు

ప్రస్తుతం విధిస్తున్న $8\frac{1}{2}$ శాతం వడ్డీ, (వడ్డీఅసలు మొత్తాల వాయిదాల సక్రమ చెల్లింపులకు $\frac{1}{2}$ శాతం రిబేటుతో పాటు)కి బదులుగా $7\frac{1}{2}$ శాతం తక్కువ వడ్డీరేటు ($\frac{1}{2}$ శాతం రిబేటుతో పాటు) విధించబడుతుంది.

## ఋణాల తిరిగి చెల్లింపు ప్రారంభకాలం

ఋణం మొత్తానికి చెందిన మొదటి వాయిదా చెల్లింపు సహజంగా మూడు సంవత్సరాల తర్వాత ప్రారంభమవుతుంది అయితే వెనుకబడిన ప్రాంతాలలోని పరిశ్రమల విషయంలో యీ గడువును ఋణం మొదటి దఫా పంపిణీ చేసిన తేదీ నుండి ఐదు సంవత్సరాలకు పొడిగించబడుతుంది.

## ఋణాల తిరిగి చెల్లింపు కాలపరిమితి

సాధారణంగా ఋణ మొత్తాన్ని 10 నుండి 12 సంవత్సరాలలో పూర్తిగా తిరిగి చెల్లించాల్సి ఉంటుంది. ఈ కాలపరిమితిని 15 నుండి 20 సంవత్సరాలకు పొడిగించబడుతుంది.

## సెక్యూరిటీ పరిమితి

ప్రస్తుతం కార్పొరేషన్ 50 శాతం మార్జిన్ పద్ధతిని అవలంబిస్తున్నది. అది 30 నుండి 35 శాతానికి తగ్గించబడుతుంది. మరోవిధంగా చెప్పాలంటే ఈక్విటి : డెబిట్‌ల నిష్పత్తిని 1 : 2 లకు అంగీకరించబడుతుంది.

## ప్రవర్తకుని వాటా

మామూలు విధానానికి బదులుగా పరిశ్రమ స్థాపన ఖర్చులో ప్రవర్తకుని తక్కువ వాటాకు కార్పొరేషను అంగీకరిస్తుంది.

## ఈక్విటీ, ప్రిఫరెన్షియల్ పెట్టుబడి

ప్రతి పరిశ్రమ యోగ్యతనుబట్టి, యితర ప్రాంతాలలో స్థాపించబడిన పరిశ్రమలకన్నా ఎక్కువగా వెనుకబడిన ప్రాంతాలలో నెలకొల్పబడిన పరిశ్రమల వాటాధనంలో అండర్‌రైటింగ్ రూపంలో వాటాధనంతో పాల్గొనడానికి కార్పొరేషన్ సిద్ధంగాఉంది.

## ఇతర చార్జీలలో తగ్గింపు

అండర్‌రైటింగ్ కమీషన్, కమిట్మెంట్ ఛార్జీ, దరఖాస్తులకు చెందిన తిరిగి చెల్లించబడని పరిశీలక రుసుము, లీగల్ ఛార్జీల విషయంలో మామూలు ఛార్జీలలో 50 శాతం తగ్గింపు యివ్వబడుతుంది.

కేంద్రప్రభుత్వ గ్రాంటు, సబ్సిడీ పొందుతున్న వెనుకబడిన జిల్లాలు ప్రాంతాలలోని పరిశ్రమలు, ఐ.ఎఫ్.సి. రాయితీలు కూడ పొందడానికి అర్హమవుతాయి.

పరిశ్రమను నెలకొల్పడానికి అయ్యే మొత్తం ఖర్చు. ఒక కోటి రూపాయలకు మించని సందర్భాలలోనే సాధారణంగా యీ రాయితీలు వర్తిస్తాయి. పెద్ద పరిశ్రమలకు రాయితీలపై ఆర్థిక సహాయం అందజేసే విషయం ప్రత్యేక ప్రాతిపదికపై పరిశీలించడం జరుగుతుంది.

వివిధరాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలలో యిటువంటి సహాయానికి కేంద్రప్రభుత్వం సెలక్టు చేసిన జిల్లాలలో స్థాపించబడిన పరిశ్రమలకు మాత్రమే రాయితీపై ఆర్థిక సహాయం అందజేయబడుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో యిటువంటి రాయితీలు యివ్వడానికి దిగువ పేర్కొన్న జిల్లాలను సెలక్టుచేశారు.

నల్లగొండ, మెదక్, మహబూబునగర్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం, చిత్తూరు, అనంతపురం.

భారత దేశంలో ఇన్కార్పొరేటు చేయబడిన పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలు, రిజిస్టరు చేయబడిన సహకార సంఘాలకు మాత్రమే కార్పొరేషను ఆర్థిక సహాయం అందజేస్తుంది. అందువల్ల పైనపేర్కొన్న రాయితీలు యిటువంటి పరిశ్రమలకు మాత్రమే వర్తిస్తాయి.

వస్తువుల తయారీ, పరిరక్షణ, ప్రొసెసింగ్, షిప్పింగ్, గనులు, హోటల్ పరిశ్రమ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, పంపిణీ, విద్యుచ్ఛక్తికి చెందిన యితర పరిశ్రమలను నెలకొల్పిన, లేక నెలకొల్పదలచిన భారత దేశంలో ఇన్కార్పొరేటు చేయబడిన పబ్లిక్ లిమిటెడ్ సంస్థలు, రిజిస్టరు చేయబడిన సహకార సంఘాలన్నీ కార్పొరేషన్ అందజేసే యీ ఆర్థిక సహాయానికి అర్హమవుతాయి.

జిల్లాలలో

# ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాలు

## అనంతపురంలో ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమాలకు రూ. 61 లక్షలు మంజూరు

అనంతపురంలో నవంబరు 1వ తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంలో ఏర్పాటైన 'తెలుగు వెలుగు' కార్యక్రమానికి జిల్లా కలెక్టరు శ్రీ యల్. సుబ్బయ్య అధ్యక్షత వహిస్తూ జిల్లాలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాలను సమీక్షచేశారు.

రాయలసీమ ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమం క్రింద విద్యకు అధిక ప్రాధాన్యం ఇవ్వవలెనని హెడ్మాష్టరు శ్రీ పి. నంజుండయ్య చెప్పారు. డా. రామచంద్ర తెలుగు సాహిత్యాన్ని గురించి మాట్లాడుతూ తెలుగు భాషాభివృద్ధికి తిక్కన, తిరుపతి వేంకటకవులు చేసిన సేవను శ్లాఘించారు. శబ్ద, సంగీత శాస్త్రములలో తెలుగు భాషకు గల ప్రత్యేకతను గురించి డా. నాగభూషణం ప్రసంగించారు. శ్రీ కొలకలూరి ప్రజలను దేశభక్తి ప్రపూరితులనుగా చేయడానికి నవలలు, గద్యసాహిత్యం వహించిన పాత్రను గురించి మాట్లాడారు, శ్రీ యస్. గంగప్ప తెలుగునాటకం అభివృద్ధిని గురించి మాట్లాడారు. శ్రీ ఎ. వి. చంద్రశేఖరరాజు తెలుగు సంస్కృతిని గురించి ప్రసంగించారు.



ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినోత్సవం సందర్భంగా నవంబరు 1 న అనంతపురంలో జరిగిన తెలుగు వెలుగు సదస్సులో జిల్లా కలక్టరు ప్రసంగించారు.

ఉదయం డా. కోరాడ మహదేవ శాస్త్రి అధ్యక్షతన నాటక విద్యాలయంలో కవి సమ్మేళనం జరిగింది. ఇందులో స్థానిక తెలుగు, ఉర్దు కవులు పాల్గొన్నారు.

## శ్రీకాకుళంలో కవిసమ్మేళనం

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంగా శ్రీకాకుళంలో, భారత ప్రభుత్వ కేంద్ర ప్రచారశాఖ డిప్యూటి డైరెక్టరు అధ్యక్షతన ఒక కవిసమ్మేళనం జరిగింది. ఇందులో సర్వశ్రీ ఎ. యల్. నారాయణాచార్యులు, ఎ. వి. రమణ, టి. వి. శివరావు, యం. వెంకటేశ్వర్లు, డి. కృష్ణదాసు, అచ్యుతరావు, జె. వి. సుబ్బారావు గారలు పాల్గొన్నారు. హైదరాబాదు క్షేత్ర ప్రచారశాఖ ప్రాంతీయ అధికారి శ్రీ బి. యస్. రావు కూడా ఈ కవిసమ్మేళనానికి హాజరైనారు.

శ్రీకాకుళం హాస్టల్ సూపరింటెండెంటు శ్రీ ఏ. ఆర్. కృష్ణ అధ్యక్షతన జరిగిన తెలుగు వెలుగు కార్యక్రమంలో సర్వశ్రీ ఏ. వి. కోటిరెడ్డి, నారాయణాచార్యులు, డి. శేషగిరిరావు, శివరావు, యం. కృష్ణమూర్తి, సుబ్బారావు గారలు పాల్గొన్నారు.

## విశాఖపట్నంలో ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాలు

సమాచార పౌరసంబంధ యాత్రిక విషయాల శాఖ ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం సందర్భంలో విశాఖపట్నంలో ఒక చర్చాగోష్ఠి ఏర్పాటు చేసింది. ఈ సందర్భములో ఏర్పాటైన కవి సమ్మేళనంలో సర్వ శ్రీ పురిపండ అప్పలస్వామి, కె. వి. నరసింగరావు, జి. అచ్యుతరామరాజు, మట్టపల్లి రామకోటి, కల్యాణం వీరాస్వామి, అంగర వేంకట కృష్ణారావు, మసూనా, దట్టి చిన్ని కృష్ణ పాల్గొన్నారు. కవులను జిల్లాపరిషత్తుఅధ్యక్షులు సన్మానించారు

## రాష్ట్రసమైక్యత అవశ్యకతపై కాకినాడలో చర్చాగోష్ఠి

తూర్పు గోదావరి జిల్లా కలెక్టరు శ్రీ యల్. మాలకొండయ్య అధ్యక్షతన, ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం



ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం సందర్భంగా కాకినాడలో ఏర్పాటు చేయబడిన సమావేశంలో శాసన సభ్యులు శ్రీ సి. వి. కె. రావు ప్రసంగించారు.

జరిగింది. సమాచార పౌరసంబంధ యాంత్రిక విషయాల శాఖ, ఆఫీసర్స్ క్లబ్బు కలిసి ఈ ఉత్సవాన్ని ఏర్పాటు చేశాయి. ఈ సందర్భంలో జిల్లా కలెక్టరు ప్రసంగిస్తూ రాష్ట్ర సమైక్యతను కాపాడడం ప్రతియొకరి కర్తవ్యమై ఉన్నదని ఉద్బోధించారు.

ఈ సందర్భంలో ఏర్పాటైన చర్చాగోష్ఠికి శాసనసభ్యులు శ్రీ సి.వి.కె. రావు ప్రారంభోత్సవం జరిపారు. ఈ చర్చాగోష్ఠిలో స్థానిక కాలేజి ఆంగ్ల శాఖాధిపతి శ్రీ జానకీ జాని, ప్రభుత్వ కాలేజి ప్రిన్సిపాలు శ్రీ ఐ. వి. చలపతిరావు. అడ్వకేటు శ్రీ యస్. పార్థసారథి పాల్గొన్నారు,

కవి సమ్మేళనం కూడా ఏర్పాటు చేయబడింది. ఇందులో సర్వశ్రీ పోచిరాజు శేషగిరిరావు, జ్ఞానానంద కవి, రామకృష్ణ భరద్వాజ, వక్కలంక లక్ష్మీపతిరావు గారలు పాల్గొన్నారు.

## ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవంపై చర్చాగోష్ఠి

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భమున నల్గొండలో నవంబరు 1వ తేదీన నాగార్జున కాలేజి ప్రిన్సిపాలు మేజర్ శ్రీ రామమూర్తి అధ్యక్షతన ఒక చర్చాగోష్ఠి జరిగింది. ఈ చర్చాగోష్ఠిలో జూనియర్ కాలేజి ప్రిన్సిపాలు శ్రీ పాపయ్య శాస్త్రి



నెల్లూరు జిల్లా పరిషత్తు హాలులో నవంబరు 1 న ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినోత్సవం జరుపబడింది.

నాగార్జున కాలేజి లెక్చెరర్లు. శ్రీ యుతులు యం. సత్యనారాయణ, శ్రీ చి. మల్లయ్య గారలు పాల్గొన్నారు ఆంధ్రప్రదేశ్, తెలుగు సాహిత్యం, తెలుగు చలన చిత్రాలు అనే అంశాలపైన చర్చాగోష్ఠి జరిగింది.

నగర మునిసిపల్ అధ్యక్షులు శ్రీ పి. రాజరత్నం అధ్యక్షతన ఒక కవిసమ్మేళనం కూడా జరిగింది. నల్గొండ జిల్లాకు చెందిన తెలుగు, ఉర్దు కవులు ఇందులో పాల్గొన్నారు.

## చిత్తూరు జిల్లాలో అభివృద్ధి కార్యక్రమాలకు రూ. 1.50 కోట్లు కేటాయింపు

చిత్తూరులో నవంబరు 1 న ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భములో ఆంధ్రప్రదేశ్ పునరుజ్జీవనంఅనే అంశం పైన జరిగిన చర్చాగోష్ఠిలో, జిల్లా కలెక్టరు శ్రీ బి. వి. రామారావు అధ్యక్షోపన్యాసమిస్తూ రాయలసీమ ప్లానింగు అభివృద్ధి సంఘం ఆధ్వర్యంలో చేపట్టబడిన అభివృద్ధికార్యక్రమాల అమలుకు సహాయపడవలసిందని ప్రజలకు విజ్ఞప్తిచేశారు. తరచుగా కరువు పరిస్థితులకు గురి అవుతున్న జిల్లా ప్రజల సాంఘిక, ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచడానికి ఒక మాస్టరు ప్లాను తయారుచేయబడిందని కలెక్టరు చెప్పారు.



ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంగా నవంబరు 1 న ఖమ్మంలో కవి సమ్మేళనం జరిగింది.

జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ వి. రామస్వామిరెడ్డి ప్రసంగించారు.

తిరుమల తిరుపతి దేవస్థానం ట్రస్టు బోర్డు సభ్యుడు శ్రీ కె. సిద్ధయ్య నాయుడు భాషా రాష్ట్రాల ఉద్యమ చరిత్రను గురించి ప్రసంగిస్తూ సమైక్య రాష్ట్రంలో తెలుగు ప్రజల ఉజ్వల భవిష్యత్తుకై కృషిచేసిన శ్రీ టి. ప్రకాశం, శ్రీ జవహర్లాల్ నెహ్రూలకు జోహారులర్పించారు.

తరువాత జిల్లాపరిషత్తు హాలులో కవిసమ్మేళనం జరిగింది.



ఆంధ్రప్రదేశ్ అవతరణదినోత్సవ సందర్భంగా ఏలూరులో భరత నాట్యాన్ని ప్రదర్శించిన కుమారి రాజనాల నాగమణికి జిల్లా కలెక్టరు మెమెంటోను బహూకరించారు.




## బాపురెడ్డి గేయాలు

సుఖేలా ప్రచురణ
I. C. 85 ఇర్రమంజిల్ కాలనీ　　　　　వెల : 5 రూపాయలు
హైద్రాబాద్-4.

ఇటీవల శ్రీ బాపురెడ్డి రచనలన్నీ నాలుగు సంపుటాలుగా వెలువడ్డాయి. ప్రక్రియా వైవిధ్యాన్నిబట్టి పద్యాలూ, గేయాలూ, గేయనాటికలూ, గద్యకావ్యాలుగా ఈ సంపుటాలను విభజించడం జరిగింది. ఈ సంపుటం ప్రతిభాకోదండరాములూ, ప్రగత్భగదా భీములూ అయిన శ్రీ బోయి భీమన్నగారికి అంకితమియ్యబడింది.

ఈ గేయసంపుటికి పీఠికగా ఆత్మశ్రుతిమీటిన శ్రీ నారాయణ రెడ్డిగారు చెప్పినట్లుగా ఇందులో అలవోకగా వ్రాసినవీ, ఆకాశవాణికి కృతిచేసినవీ, పత్రికలకోసం చెప్పినవీ, మిత్రులకోసంగుప్పినవీ, ఉద్యోగరీత్యా పలికినవీ హృద్యోగరీత్యా చిలికినవీ మొత్తం 70 ఖండములు ఉన్నాయి.

గేయకవితా ప్రియులైనవారందరికీ ఈ గ్రంథం ఆనందాన్ని కలిగిస్తుందనడంలో సందేహంలేదు. పద్యాన్ని తోసిరాజని మొన్న మొన్ననే గద్దెకెక్కిన గేయం నేడప్పుడే వచనపద్యానికి చోటుచేసి తాను వెనక్కి తప్పుకుంది. ఎంత గేయకవిత్వంమీద అభిమానం ఉన్న కవి అయినా నేడు కవిసమ్మేళనాల్లో గేయకవిత్వాన్ని చదవడానికి సంకోచిస్తున్నాడు. అత్యాధునిక కవితారూపమైన వచన కవితరాజ్యం చేస్తోన్న ఈ రోజుల్లో గేయం కేవలం గాయకుల పరమేఅయింది. ఎంత శ్రావ్యంగా కావ్యగానంచేసే కవికైనా ఆర్కెష్ట్రాలేకుండా సభల్లో చదివి రక్తి కట్టించడం కష్టమే అవుతోంది. అందుకే ఈ రోజుల్లో చాలామంది గేయాలు వ్రాయడం మానుకొన్నారు; ఒకవేళ వ్రాసినా వాటిని ప్రచురించే సాహసం చెయ్యడంలేదు. ఆ సాహసం శ్రీ బాపురెడ్డి చేశారు.

నిజానికి పద్యమైనా, వచనపద్యమైనా గేయమైనా కవితకు కేవలం సాధనాలు మాత్రమే. అవే కవిత్వంకాదు. కాని చాలా మంది సాధనాన్నే కవిత్వమనుకుని పొరబడకూడదు. అచ్చమైన కవికి ఇవి మూడూ మార్గనిర్దేశకాలే. వాటి సహాయంతో అతడు తన గమ్యాన్ని చేరుకొంటాడు. శ్రీ బాపురెడ్డి అలాగే గేయాన్ని ఒక సాధనంగా గ్రహించి కవిలా శిఖరాలను అందుకున్నారు. ఈ గేయాలు చదువుతోంటే "కోటి రాగవీణలొకేమాటు మీటినట్లు"టుంది ఇందులోని ప్రతి గేయమూ భావరాగ తాళత్రిపుటీబద్ధమై సంగీతజ్ఞులచే గానంచేయబడితే రసజ్ఞుల మన్ననలందగలదనే విశ్వసింపవచ్చు.

నలభై ఏభై ఏళ్ళలోనే అధునికగేయకవిత అంతరించి పోవలసిరావడం విచారకరమైన విషయం. ఆంధ్రకవిత్వచరిత్రలో పద్యం వెయ్యేళ్ళు రాజ్యంచేసింది పద్యరచనా ప్రక్రియలో అనేక రకాలైన ప్రయోగాలు జరిగాయి. అవి సాధించిన విజయాలు తెలుగు సాహిత్యచరిత్రలో శాశ్వతంగా నిలిచిఉంటాయి. ఆధునిక గేయకవితలో అటువంటి ప్రయోగాలు ఎక్కువగా జరుగకుండానే వచనకవిత అడ్డుతగిలింది. కాలానికి ఎదురీది కవిత్వమే స్వశక్తిగా నిలబడే బాపురెడ్డి వంటి సాహసోపేతులే గేయానికి ప్రాణం పోయాలి.

తెలుగుభాష అజంతభాష అనీ, సంగీతానికి ఆ భాషలొంగినంతగా మరోభాషలొంగదనీ భాషాతత్త్వవేత్తలంటారు, అటువంటి భాషలో సంగీతానుగుణమైన ప్రయోగాలు గేయాల్లో జరగవలసిఉన్నది. అట్టి ప్రయోగదీక్షతో అవిరళకృషి చేస్తోన్న శ్రీ బాపురెడ్డి అభినందనీయులు.

—హిమాంశు

## బాపురెడ్డి గద్యకావ్యాలు

బాపు రెడ్డి గారు గేయ కావ్య, గేయ నాటికా, పద్య కావ్య సంకలనాలు మూడింటి తరువాత ఈ 'బాపు రెడ్డి గద్య కావ్యాలు, వెలువరించారు. దీనితో రెడ్డిగారి 'కవితా చతుర్భుజత్వం పూర్తి అయింది'. మొదటి మూడు సంకలనాల్లో గేయం, పద్యం వుంది కాబట్టి, ఈ 'గద్య కావ్యా' లను అచ్చంగా 'గద్యం' అనుకొనే అవకాశం ఉంది. కాని ఇవి 'గద్య, లు కావు వచన పద్యాలు. 'వచన గేయాలు లేక వచన కవితలు' అనడానికిబదులు 'గద్య కావ్యాలు' అని రెడ్డిగారు కావాలనే పెర్కొన్నట్టు ముందు 'నాల్గు మాటలు' లో చెప్పారు. 'వచనానికీ పద్యానికీ హస్తిమశకాంతరం ఉంది. కవిత ఛందో బంధురం......గేయం, పద్యం, గద్యం, నా దృష్టిలో విభిన్న ఛంద స్స్వరూపాలు. వచనానికి ఛందస్సు లేదు. అందుకే మన పూర్వ కావ్యాల్లో పద్యాలతో గేయాలతోబాటు గద్యాలు వాడినారు. కావి వచనం వాడలేదు. నిజానికి వచన కవితల్లో వ్రాస్తున్నది సంప్రదాయికంగా వస్తున్న గద్యమే' అన్నారు శ్రీ రెడ్డి. ఇట్లా గద్యం ఛందోబద్ధంగా రెడ్డిగారు భావి స్తే, 'పీఠికా పీఠాధిపతి' అని శ్రీ రెడ్డిగారిచే పొగడబడ్డ శ్రీ బోయి భీమన్నగారు ఈ సంకలనానికి 'శ్రుతి' సాగిస్తూ ఛందోబద్ధత తప్ప తక్కిన కావ్య లక్షణాలన్నీ కలిగింది గద్య కావ్యం. గద్య కావ్యాలను పూర్వులు అడ్డంగా వ్రాసేవారు. ఇప్పుడు మనం నిలువుగా వ్రాస్తున్నాం. 'అంతే తేడా' అన్నారు. ఈ రెండభిప్రాయాలకూ లగింపు లేదు. (ఉండే అవసరంకూడా లేదు.) భీమన్నగారన్నట్టు గద్యం ఛందోబద్ధం కాదు. పాద విభజన ఛందోబద్ధతకు ప్రథమ లక్షణం. గద్యానికి ఆ లక్షణం లేదు. గద్యంలో కవిత్వం ఉండవచ్చు, ఉండకపోవచ్చు. అది వేరే విషయం. అట్లాగే ఛందోబంధురం కానిచోట కవిత్వం ఉండదనుకోవటంగూడా విచార్యమే. అదీగాక పూర్వ కావ్యాల్లో ఆశ్వాసాంతాల్లోవి తప్ప మిగిలినవన్నీ వచనాలే. మరొకటి సింహగిరి వచనాలు, వేంకటేశ్వర వచనాలు ఉన్నవి. పాదవిభజన

వీటిలో ఉండదు. సామాన్యంగా గద్య అన్నది సంస్కృత కావ్యాల్లోనూ, 'వచనం' అన్నది తెలుగు కావ్యాల్లోను పర్యాయంగా ఉపయోగించే పదాలు. అంతరం దాదాపు లేనట్టే. పాదవిభజనకు ప్రాధాన్యమిచ్చి 'పద్యత్వం' కల్పించుకొన్న ఈ సంకలనంలోని రచనలన్నీ వచన పద్యాలే. గద్యాన్ని వెనుకటివాళ్లు అడ్డంగా మనం నిలువుగా రాస్తున్నామన్న భావం అస్పష్టం. నిలువుగా అంటే, పాదబద్ధంగా అనుకుంటే తప్ప. భీమన్నగారు 'శ్రుతి' లో విచిత్రమైన అభిప్రాయాలు వినిపించారు. 'శ్రీ శ్రీ పుట్టి సాహిత్యాన్ని......నాశనం చేశారు'. నన్నయాదులువట్టి అనువాదకులే తప్ప మహాకవులు కారు. వేమన పద్యాల్లో, ఎంకి పాటల్లో తప్ప తెలుగులో మూల సాహిత్యం లేదు. ఇవన్నీ సాహిత్య ప్రియులు కొంచెం నిలకడగా ఆలోచించవలసిన అంశాలు.

## బాపు రెడ్డి గద్య కావ్యాలు

శ్రీ జె. బాపు రెడ్డి, సులేఖా ప్రచురణ, హైదరాబాదు.
పు. 34 + 108. వెల రూ. 4.

శ్రీ బాపు రెడ్డి రచన సుకుమారమైనదనడానికి ఈ సంకలనంలోని ఏ ఖండికనైనా ఉదహరించవచ్చు. ఈ సంకలనంలోని పదహారు శీరికల్లోనూ ఎక్కువగా పరిచయాత్మకాలు. ప్రధానంగా 'విదేశ యాత్ర శీర్షికలోనివి. ఐరోపాలోని కొన్ని దేశాల—నగరాల పరిచయం స్థూలంగా లభిస్తుంది. వెనుక శ్రీ పఠాభి'మాత్రా ఛందస్సు'లు అని ఇలాంటి వస్తువుతోటే కొన్ని వ్రాసారు. ఛందస్సులో ఛమత్కృతులు వదిలితే, రెడ్డి గారి ఈ రచనలు ఆ ధోరణికి చెందుతాయి.

ఈ సంకలనంలోని కవితలన్నిటిలోనూ కొంత బరువయింది 'ఒక పుట'. మిగిలినవాటిలో సాగదీసిన లక్షణం కనిపిస్తుంది. అయినా చదువుకోటానికి హాయిగా ఉంటాయి. 'ఏకనామిస్సు సుందరి' ఆర్థిక శాస్త్రీయ పదజాలంతో చమత్కృతి సాధించిన చిత్రరచన. వసంతాన్ని ఓ యూనిట్‌గా తీసుకున్న ప్రేయసీ! నేను చేస్తున్న నీ అధర సుధా కన్‌సంప్షన్' లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీకి ఓ ఎక్సెప్షన్ ఇట్లా సాగుతుంది. 'సంతాన శాస్త్రం' కుటుంబ నియంత్రణ ప్రచారానికి చెందింది. 'మన వలన మరో జీవుడు జన్మించలేకపోతేలేదు ముప్పు, పుట్టిన వాళ్లని సుఖంగా, అభ్యుదయోన్ముఖంగా పోషించలేకపోవడం క్షమించరాని తప్పు'. 'ఆధునికాసురుడు', తాగిన సత్యం' కొంత వ్యంగ్య లక్షణంకల ఖండికలు. 'మనోభిరాముడు' ఒక అందమైన ఖండిక. 'నా కళ్లలో ఆశాకిరణాలు నింపి లోకంనుంచి చీకటిని మరోసారి సాగనంపి నాలో నవజీవన వీణానాదం పలికించాడు. నాకీ లోకంమీద మళ్లీ నమ్మకం కలిగించాడు'. అంటూ ఆశావాదంతో పూర్తవుతుంది. 'రసజ్ఞుని విజ్ఞప్తి' రెడ్డి గారికిగల కవితా దృష్టిని స్పష్టం చేస్తుంది. ఖండికల్లో చమత్కృతి వస్తుప్రస్తుతీకరణవంటి వాటికే తప్ప రసం మొదలయిన వాటికి ఆస్కారం దాదాపుగా లేదు. వాటికోసం రెడ్డిగారు 'నాల్గు మాట'ల్లో చెప్పినట్టు 'అభ్యుదయకరమైన ఇతివృత్తాలు తీసుకుని రస బంధురంగా' చిత్రింపబోయే కథా కావ్యాలకోసం సాహిత్యప్రియులు ఎదురుచూడవలసి ఉన్నది. రెడ్డిగారు తొందరలోనే ఆ అవకాశాన్ని కలిగిస్తారని ఆశిస్తాను.

సంపత్కుమార

## మా రచయితలు

శ్రీ సంజీవ దేవ్, తుమ్మపూడి, గుంటూరు జిల్లా.
శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, మద్రాసు.
శ్రీ డా. దివాకర్ల వేంకటావధాని, హైదరాబాదు.
శ్రీ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి, హైదరాబాదు.
శ్రీ టి. ఎ. పద్మనాభ రావు, దండువారి వీధి, నెల్లూరు.
శ్రీ మేడూరి నాగేశ్వర రావు, జిల్లా పరిషత్ అధ్యక్షులు, గుంటూరు.
శ్రీ సోమసుందర్, పిఠాపురం, తూ. గో. జిల్లా.
శ్రీ కాళోజీ, హనుమకొండ, వరంగల్లు.
శ్రీ కథక్ మిత్ర, శంకరగుప్తం, తూ. గో. జిల్లా.
శ్రీ ఎ. పైడి రాజు, ప్రిన్సిపాల్, ప్రభుత్వ లలితకళల కళాశాల, విజయనగరం.
శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, కారవాన్‌సాహు, హైదరాబాదు.
శ్రీ గొల్లపూడి మారుతీ రావు, ఆకాశవాణి, విజయవాడ.
శ్రీ శశాంక, నానక్‌రామ్ భగవాన్‌దాస్ కళాశాల, హైదరాబాదు.
శ్రీ జి. కళ్యాణసింగ్, హైదరాబాదు.
శ్రీ మహమ్మద్ అబ్దుల్ వహీద్‌ఖాన్, పురాతత్వశాఖ డైరెక్టరు, హైదరాబాదు.
శ్రీ ఎం. ఫణిభూషణ రావు, జర్నలిస్టు, విజయవాడ.




## ఉపముఖ్యమంత్రికి పౌరసన్మానం

నెల్లూరు మునిసిపాలిటి అక్టోబరు 19వ తేదీన ఉప ముఖ్య మంత్రి శ్రీ జె వి. నరసింగరావుకు పౌర సన్మానం చేసింది. మునిసిపల్ అధ్యక్షులు శ్రీ అనం వెంకటరెడ్డి పౌర సన్మానపత్రం సమర్పించారు. మునిసిపల్ ఉపాధ్యక్షులు శ్రీ మొహమ్మద్ హైదర్‌కూడా ఉప ముఖ్యమంత్రికి ఒక సన్మాన పత్రం సమర్పిస్తూ రోడ్డులు భవనముల శాఖ మునిసిపల్ రోడ్డు మరమ్మతులు చేపట్టాలని అభ్యర్థించారు. కృష్ణపట్నం, నాగుల మిట్ట రోడ్డులో లెవల్ క్రాసింగ్‌లవద్ద ఓవర్ బ్రిడ్జిలను నిర్మించాలని కూడా అభ్యర్థించారు. శ్రీ జె. వి. నర్సింగరావు సన్మానపత్రానికి సమాధానమిస్తూ వంతెనల నిర్మాణానికి మంజూరీ ఇవ్వడం జరుగుతుందని హామీఇచ్చారు. నెల్లూరు మునిసిపాలిటీలలో ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ బోర్డు ఇండ్లు నిర్మించే విషయమై సంబంధించిన మంత్రితో చర్చించగలనని శ్రీ జె. వి. నర్సింగరావు చెప్పారు. మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ పుట్ట బలరామరెడ్డి వందన సమర్పణ చేశారు.

## ఇండ్ల స్థలాల పట్టాల పంపిణీ

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు ఉదయగిరి పంచాయతిలో బసినేనిపల్లి సమీపంలో ఆనం సంజీవరెడ్డి కాలనీలో 198 కుటుంబాలు, ఎ. సి. సుబ్బారెడ్డి కాలనీలో 131 కుటుంబాలకు ఒక్కొక్క కుటుంబానికి 5 సెంట్ల భూమి చొప్పున ఇండ్ల స్థలాల పట్టాలను పంచిపెట్టారు

ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగ సభకు సివిల్ సరఫరా శాఖమంత్రి శ్రీ ఎ. సంజీవరెడ్డి అధ్యక్షతవహిస్తూ, జిల్లాలో వెనుకబడిన ప్రాంతంగావున్న ఉదయగిరి తాలూకా ప్రజల శ్రేయస్సుకై శక్తి వంచనలేకుండా కృషి చేస్తానని వాగ్దానం చేశారు.

## ఉచితవైద్య సలహా శిబిరానికి ప్రారంభోత్సవం

గ్రామీణ ప్రాంతాలలో వైద్యనిపుణులు ప్రజలకు ఉచితంగా వైద్య సలహా ఇవ్వడానికి వీలుగా, ఇబ్రహీంపటంలో ఒక వైద్య సలహా శిబిరానికి రవాణా శాఖామంత్రి డా. యం. యన్. లక్ష్మి నరసయ్య ప్రారంభోత్సవం జరిపారు.

ఈ సభకు అధ్యక్షత వహించిన వైద్య ఆరోగ్యశాఖా మంత్రి డా. ఇబ్రహీం అలీ అన్సారీ ప్రసంగిస్తూ ప్రజల సంక్షేమానికై ప్రభుత్వం శ్రద్ధాసక్తులతో కృషిచేస్తున్నదనీ, ప్రభుత్వం కల్పించిన సౌకర్యాలను ప్రజలు వినియోగించుకోవాలనీ చెప్పారు. జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. భోజిరెడ్డి ప్రసంగిస్తూ సాంఘిక సేవచేస్తున్న రోటరీక్లబ్బుకు ప్రభుత్వం కృతజ్ఞత చూపాలని చెప్పారు.



విద్యాశాఖ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు అక్టోబరు 25 న తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆవరణలో స్వర్గీయ ఎస్. గోవిందరాజులు విగ్రహాన్ని ఆవిష్కరించారు. అదే రోజున అదే ఆవరణలో రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ ఆంధ్రకేసరి విగ్రహాన్ని ఆవిష్కరించారు.

## రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి రు. 15 కోట్లు

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు, యిటీవల నెల్లూరులో జిల్లా పరిషత్తు అధ్యక్షుడు, సభ్యులు చేసిన సన్మానికి సమాధానమిస్తూ జిల్లాలు, ప్రాంతం అనే తేడాలు లేకుండా రాష్ట్రములో వెనుకబడిన ప్రాంతాలన్నిటి అభివృద్ధికీ ప్రభుత్వం కృషి చేస్తున్నదని అన్నారు. ఈ దృష్టితోనే రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి వచ్చే బడ్జెటులో రు. 15 కోట్లు కేటాయించాలని ప్రభుత్వం ప్రతిపాదించినదని ఆయన వెల్లడించారు. పంచాయతీ రాజ్ వ్యవస్థ ఏర్పడక పూర్వం ప్రభుత్వం ప్రజల సహకారంతో కార్యక్రమాలను నిర్వహించేదని, అయితే యీ వ్యవస్థ ఏర్పడిన తర్వాత ప్రజలు స్వయంగా ప్రభుత్వ తోడ్పాటుతో నిర్మాణ కార్యక్రమాలను అమలు జరుపుతున్నారని ఉపముఖ్యమంత్రి అన్నారు.

పౌర సరఫరా శాఖ మంత్రి శ్రీ ఎ. సంజీవరెడ్డి, యీ సందర్భంగా ప్రసంగిస్తూ రైతులు తమ ఉత్పత్తులను విక్రయించడానికి వీలుగా ధాన్యం కొనుగోలు కేంద్రాలను ఏర్పాటు చేస్తారని అన్నారు.

## మార్కెటు యార్డుల అభివృద్ధికి రూ. 45 లక్షల కేటాయింపు

ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు యిటీవల సూర్యాపేటలో మార్కెటు యార్డువద్ద ఒక గోదాము నిర్మాణానికి శంకుస్థాపన జరిపారు. ఈ గోదాము నిర్మాణానికి రూ. 41,000 ఖర్చు అవుతుంది. మార్కెటింగు శాఖామంత్రి మార్కెటింగు యార్డులో ప్లాటుఫారం నిర్మాణానికి శంకుస్థాపన జరిపారు.

ఈ సభకు జిల్లా పరిషత్తు అధ్యక్షులు అధ్యక్షత వహించారు. మార్కెటింగు కమిటీ అధ్యక్షులు మంత్రులకు స్వాగత పత్రం సమర్పించారు. ఈ సభకు జిల్లా అధికారులు ఇతర అనధికారులు హాజరైనారు.

## నారాయణ్ ఖేడ్‌లో పాలశీతల కేంద్రం

మెదకుజిల్లా కలెక్టరు శ్రీ ఎన్. చక్రవర్తి యిటీవల నారాయణ్ ఖేడ్ పంచాయతీ సమితి సర్వసభ్య సమావేశంలో రాబీ ప్రణాళికలోని వివిధ అంశాలను గూర్చి వివరిస్తూ రూ. 5.2 లక్షల ఖర్చుతో నిజాంపేట–నారాయణ్ ఖేడ్ ప్రాంతంలో త్వరలోనే పాలశీతల కేంద్రాన్ని నిర్మిస్తారనీ, కేర్ సంస్థ యీ కేంద్రానికి అందజేసే ఆర్థికసహాయంగూర్చి తుదిరూపంఇవ్వబడిందనీఅన్నారు

## ఆంధ్రప్రదేశ్‌లో 23 లక్షల ఎకరాల బంజరు భూమి పంపిణీ

వ్యవసాయశాఖామంత్రి శ్రీ కాకాని వెంకటరత్నం యిటీవల శ్రీకాకుళంలో బహిరంగ సభలో ప్రసంగిస్తూ రాష్ట్రంలో 23 లక్షల ఎకరాల బంజరు భూమిని భూమిలేని హరిజనులు, గిరిజనులు, యితర వెనుకబడిన తరగతుల ప్రజలకు ప్రభుత్వం పంపిణీ చేసిందని వెల్లడించారు. ఈభూములను సేద్యంచేయడానికి వీలుగా ప్రభుత్వం శాయశక్తులా కృషిచేస్తున్నదని కూడా అన్నారు. అయితే ప్రజలు, భూముల ద్వారా ప్రయోజనం పొందినవారు, యితర అభ్యుదయవాదులు ఈ సందర్భంలో తమ పాత్రను నిర్వహించనిపక్షంలో ఆశించిన సత్ఫలితాలు అందడం సాధ్యంకాదని ఆయన పేర్కొన్నారు. రైతులు అధిక దిగుబడి రకాల విత్తనాలను ఉపయోగించి, అధికోత్పత్తిని సాధించాలని ఆయన కోరారు. సేద్యపు నీటిపారుదల సౌకర్యాలనుగూర్చి మంత్రి ప్రస్తావిస్తూ రాష్ట్రమంతటిలో శ్రీకాకుళం జిల్లాలో ఎక్కువ సంఖ్యలో చెరువులు ఉన్నాయనీ, సేద్యపు నీటిపారుదల వసరుల మరమ్మతు, అభివృద్ధి నిర్వహణలకు ప్రభుత్వం రు. 20 లక్షలు మంజూరు చేసిందనీ అన్నారు. గిరిజన సంక్షేమ పథకాల గూర్చి ప్రస్తావిస్తూ భూమిలేని గిరిజనులకు భూముల పంపిణీ చేయడం, నీటిపారుదల వసరులు కల్పించడం, ఆశ్రమ పాఠశాలలు ప్రారంభించడం, రోడ్ల నిర్మాణం మొదలయినవి అమలు జరుపుతూ ప్రభుత్వం తమవంతు పని నిర్వహిస్తున్నదని మంత్రి అన్నారు.



పశ్చిమ గోదావరి జిల్లా వాణిజ్య మండలి అధ్యక్షులు శ్రీ నేరెళ్ళ రాజు, హైదరాబాదు వరద సహాయక నిధి నిమిత్తం నవంబరు 1 న ఏలూరులో జిల్లా కలెక్టరుకు రూ 1,000ల చెక్కు అందజేశారు.

## హరిజన కాలనీకి శంకుస్థాపన

ఆర్థికశాఖామంత్రి శ్రీ కె. విజయభాస్కరరెడ్డి, ఇటీవల నంబూరులో హరిజన కాలనీకి శంకుస్థాపనచేశారు. జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ యం. నాగేశ్వరరావు వీధిదీపాలకు ప్రారంభోత్సవం జరిపారు.

మధ్యతరహా నీటి పారుదల శాఖామంత్రి శ్రీ నారపరెడ్డి విజయభాస్కర కాలనీవాసులకు ఇండ్లస్థలాలపట్టాలు పంచిపెట్టారు.

ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు జిల్లా కలెక్టరు శ్రీ యం. వెంకటరత్నం అధ్యక్షత వహించారు. బీద ప్రజలకు 35,000 ఎకరాల భూమి పంచిపెట్టడం జరిగిందనీ, 66 గ్రామాలలో 5,000 ఇండ్లు నిర్మించడం జరుగుతుందనీ కలెక్టరుచెప్పారు.

## పంచాయతీ భవనానికి ప్రారంభోత్సవం

పౌరసరఫరా శాఖామంత్రి శ్రీ ఎ సంజీవరెడ్డి ఇటీవల రాజవోలులోను, ఆత్మకూరు సమితిలోని కరటంపాడులోను పంచాయతీ భవనాలకు ప్రారంభోత్సవంచేశారు.

మంత్రిగారు ఆత్మకూరులో జరిగిన బహిరంగసభలో ప్రసంగిస్తూ, వెనుకబడిన ప్రాంతం అభివృద్ధికి అన్నివిధాల సహాయం చేయడం జరుగుతుందని హామీ ఇచ్చారు. ప్రజలు, అభిప్రాయ భేదాలను విస్మరించి ప్రాంత అభివృద్ధికి పాటుపడాలని ఉద్బోధించారు. నెల్లూరు జిల్లాలోని కావలి, ఉదయగిరి, ఆత్మకూరు తాలూకాలు అభివృద్ధిపథంలో పురోగమిస్తున్నందుకు హర్షం వెలిబుచ్చారు.

ఈ బహిరంగ సభకు జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ గోపాలకృష్ణారెడ్డి అధ్యక్షత వహించారు.

## వీధి దీపాలకు ప్రారంభోత్సవం

చిత్తూరు జిల్లాకలెక్టరు శ్రీ బి.వి. రామారావు ఇటీవల పుంగనూరు తాలూకాలోని నంజంపేట గ్రామంలో వీధి దీపాలకు ప్రారంభోత్సవం చేశారు.

## రైతుల సమస్యల పరిష్కారానికి మంత్రి ఉద్బోధ

చిత్తూరు జిల్లా నల్లగడ్డలో ఇటీవల ఏర్పాటైన రైతుల మహాసభలో రాష్ట్ర రెవిన్యూ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రసంగిస్తూ రెవిన్యూ అధికారులు వెంటనే ప్యాసుబుక్కులు తయారుచేయాలని చెప్పారు ఈ సమావేశంలో జిల్లాకలెక్టరు శ్రీ బి.వి. రామారావు ఇతర అధికారులు పాల్గొన్నారు. ఈ సందర్భంలో రైతులు భూములకేటాయింపు రెవిన్యూ విషయాలకు సంబంధించి మంత్రికి కొన్నివందల అర్జీలు సమర్పించారు. కొన్ని అర్జీల విషయమై అక్కడికక్కడే నిర్ణయాలు తీసుకొని ఉత్తర్వులు జారీచేయడం జరిగింది. జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ వి. రామస్వామిరెడ్డి మున్నగువారు కూడా ఈ రైతు మహాసభలో ప్రసంగించారు. బంగారిపాలెం సమితి అధ్యక్షులు శ్రీ ఎ. రాజారెడ్డి అందరికీ స్వాగతం చెప్పారు.



ఉపముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు నవంబరు 14న హైదరాబాదుజిల్లాలోని ఆల్వాల్‌లో బాలలగృహానికి ప్రారంభోత్సవం చేశారు.

## ఇండ్లస్థలాల పట్టాల పంపిణీ

అనంతపురం జిల్లా కలెక్టరు శ్రీ యల్. సుబ్బయ్య 1970 అక్టోబరు 26వ తేదీన తెత్రకలు గ్రామంలో హరిజన కుటుంబాలకు 18 ఇండ్ల స్థలాలపట్టాలు పంపిణీచేశారు. లోకసభ సభ్యులు శ్రీ యస్. నారాయణప్ప ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు అధ్యక్షత వహించారు.

జిల్లా కలక్టరు కొరియట్ల గ్రామంలోకూడా హరిజనకుటుంబాలకు 40 ఇండ్లస్థలాలకు పట్టాలు పంచిపెట్టారు. పట్టాలు పొందిన వారు త్వరలో ఇండ్లు కట్టుకోవాలని కలక్టరు ఉద్బోధించారు.

## వక్తృత్వపోటీలో ఖానాపూర్‌కు అగ్రస్థానం

సామాజిక అభివృద్ధి వారోత్సవాల సందర్భంగా ఆదిలాబాదు జిల్లా పరిషత్తు హాలులో జిల్లా స్థాయిలో జరిగిన బాలికల వక్తృత్వ పోటీలో ఖానాపూరులోని జిల్లాపరిషత్తు హైస్కూలు విద్యార్థిని కుమారి సరోజినిదేవి ప్రథమ బహుమతి పొందింది. జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ జి. నరసింహారెడ్డి గెలుపొందిన విద్యార్థికి రూ. 100లు నగదు, రెండు పుస్తకాలు బహుమతి ఇచ్చారు.

## ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమల స్థాపన జపాను పారిశ్రామికవేత్తల తోడ్పాటు

వాణిజ్యశాఖామంత్రి శ్రీ పి. అంకినీడు ప్రసాదరావు ఇటీవల గుంటూరు ప్రెస్‌క్లబ్బులో ప్రసంగిస్తూ సిలోన్‌కు ఏటా 13,000 టన్నుల మిర్చి 10,000 టన్నుల చక్కెర పశుగ్రాసం



ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు నవంబరు 14న మహబూబ్‌నగర్‌లో రెడ్‌క్రాస్ భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

ఎగుమతిచేయడానికి అవకాశంవుందని చెప్పారు. ఆగ్నేయ ఆసియాలో భారతదేశ వస్తువులకు మంచి మార్కెటు వుందని ఆయన చెప్పారు.

ఈ దేశాలలో ప్రస్తుతధరలు, పరిస్థితులదృష్ట్యా, వేరుసెనగ నూనె, విద్యుద్వస్తువులు, సిల్కుచీరలు, గృహనిర్మాణ పరికరాలు, పసుపు, మున్నగువాటికి మంచి గిరాకీవుంది.

ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు స్థాపించడానికి జపాను దేశ పారిశ్రామిక వేత్తలు ఉత్సాహంచూపుతున్నారు. ఇక్కడ ఏర్పాటు చేసే పరిశ్రమలలో భారతీయులను భాగస్వాములుగా చేర్చుకొని సాంకేతిక విషయాలను మనకు తెలియచేయడానికి వారు సంసిద్ధతను వెలిబుచ్చారు. రాష్ట్రంలో టిటేనియం డెయాక్సైడు, అమ్మోనియం సల్ఫేటు పోలిథెలీన్ కాగితం వుత్పత్తి చేయడానికి మంచి అవకాశా లున్నాయని కూడా ఆయన చెప్పారు.

## అనకాపల్లిలో ఆటోమేటిక్ టెలిఫోన్ ఎక్చేంజికి ప్రారంభోత్సవం

కేంద్రప్రభుత్వ కమ్యూనికేషనుల సహాయక మంత్రి ప్రొఫెసర్ షేర్‌సింగ్ అక్టోబరు 26వ తేదీన అనకాపల్లిలో 400 లైనులుగల ఆటోమేటిక్ టెలిఫోన్ ఎక్చేంజికి ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్రంలో 500 టెలిఫోన్ ఎక్చేంజిలు వున్నాయి. టెలీ కమ్యూనికేషను విషయములో ఆంధ్రసర్కిలు గణనీయమైన ప్రగతిని సాధించిందని ఆయన అన్నారు.

గుంటూరు, విజయవాడ, హైదరాబాదు–బొంబాయి, హైదరాబాదు–మద్రాసు, హైదరాబాదు–రామచంద్రాపురం, హైదరాబాదు-విజయవాడ, విజయవాడ–మద్రాసుల మధ్య 1972 నుంచి క్రమేణా ట్రంక్‌డయలింగ్ యస్.టి.డి. సౌకర్యాలు కల్పించ బడుతాయని కేంద్రమంత్రి చెప్పారు.

సికింద్రాబాదులోవున్న 200 లైనుల టెలెక్స్ ఎక్చేంజి 300 లైనులను పెంచడానికి విశాఖపట్నంలో 50 లైనుల టెలెక్స్ ఎక్చేంజీని స్థాపించడానికి తలపెట్టబడిందని ఆయన వెల్లడించారు. రాష్ట్రంలో దూరప్రాంతాల టెలీకమ్యూనికేషనులు అభివృద్ధిపర చేందుకు ఈ చర్యలు తీసుకొంటున్నారని ఆయనచెప్పారు. మైక్రో వేవ్‌లింకులు, ఓపెన్ వైర్ సిస్టమ్ కోక్షియల్ కాబిల్సు ఏర్పాటు చేయబడుతాయని కూడా ఆయనచెప్పారు. ఈ పథకం అమలు జరిగినతరువాత తూర్పుతీర ప్రాంతంలోవున్న కలకత్తా మద్రాసు నగరాలలో హైదరాబాదుకు కమ్యూనికేషను సౌకర్యాలు ఏర్పడుతా యని ఆయన చెప్పారు. అంతకుముందు పోస్టుమాస్టరు జనరల్ శ్రీ వి.పి. కాటేకర్ ప్రసంగిస్తూ ఆంధ్రప్రదేశ్‌లో టెలీకమ్యూని కేషనులు బాగా అభివృద్ధిచెందినాయని చెప్పారు.

## ఇండ్లస్థలాలకు అదనంగా రు. 5 లక్షలు మంజూరు

సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ డి. పెరుమాళ్లు గత అక్టోబరు 27వ తేదీన గుడివాడకు 15 కిలోమీటర్లదూరంలో ఉన్న గురజలో ప్రసంగిస్తూ షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలవారికి యిండ్లస్థలాలను కేటాయించడానికి కృష్ణాజిల్లాకు రూ. 5 లక్షల అదనపు గ్రాంట్లను ప్రభుత్వం మంజూరుచేసిందనీ, జిల్లాలలో సాంఘిక సంక్షేమశాఖ దీనికి రూ. 5 లక్షలు ఖర్చుచేసిందనీ అన్నారు.

గ్రామంలో 53 షెడ్యూలు తెగల కులాల కుటుంబాలకు పట్టాలు పంపిణీచేశారు. వారికి యిండ్లస్థలాలు కేటాయించడానికి



కరీంనగర్‌లో నవంబరు 1న ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవ సభలో నగర ప్రముఖులు అనేకమంది పాల్గొన్నారు.

ప్రభుత్వం రూ. 15,000ల ఖర్చుతో 2.53 ఎకరాలభూమి సేకరించింది.

1948లో ఒక కోటి రూపాయలుగా ఉన్న సాంఘిక సంక్షేమ శాఖ బడ్జెటును రూ. 8 కోట్లకు పెంచారని షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల కుటుంబాలవారికి యిండ్లునిర్మించే నిమిత్తం ప్రభుత్వం యీ సంవత్సరం రూ. 50 లక్షలు మంజూరు చేసిందని మంత్రి వెల్లడించారు. ప్రభుత్వ ఆర్థిక వనరులు పరిమితంగా ఉన్నందున బడుగువర్గాల యిండ్లస్థలాల నిమిత్తం భూములు యివ్వాలని మంత్రి భూస్వాములకు విజ్ఞప్తిచేశారు.

## హరిజనవాడలో పౌరసౌకర్యాల ఏర్పాటుకు హామీ

అక్టోబరు 30వతేదీన ఈ మడుగు గ్రామంలో జరిగిన హరిజన దినోత్సవానికి నెల్లూరు జిల్లా, కొవ్వూరు సమితి అధ్యక్షులు శ్రీ కె. వెంకట్రామరెడ్డి అధ్యక్షత వహిస్తూ హరిజనవాడకు త్వరలో రోడ్డువేయబడుతుందనీ, త్రాగునీటి బావి నిర్మించబడుతుందనీ సామాజిక రేడియోసెట్టు కొరకు భవనం నిర్మించబడుతుందనీ చెప్పారు.

## అభివృద్ధి పనులకు మహబూబాబాదు సమితిచే నిధుల మంజూరీ

మహబూబాబాదు పంచాయతీ సమితి యొక్క ఆర్థిక సంఘం సమితి అధ్యక్షులు శ్రీ వీరయ్య అధ్యక్షతన ఇటీవల సమావేశమై వ్యవసాయం కొరకు రూ. 22,000లు పశుగణాభివృద్ధి కొరకు రూ. 20,000 సాంఘిక విద్యకొరకు రూ. 2,000లు మంజూరు చేసింది.

## నిమ్న తెగల ప్రజల హాస్టళ్లకు కొత్తగూడెం సమితిచే రూ. 50,000 లు మంజూరు.

ఇటీవల కొత్త గూడెం పంచాయతీసమితి శ్రీవి. హెచ్. కాళయ్య అధ్యక్షతన సమావేశమై నిమ్న తెగలకు చెందిన విద్యార్థుల కొరకు కొత్త గూడెంలో కాలేజీ హాస్టలు నిర్మాణానికి రూ. 30 000లు పెనుబల్లిలో నిమ్నతెగల బాలుర హాస్టలు కొరకు రూ. 20,000లు మంజూరుచేసింది.

## చిత్తూరులో గిరిజన సంక్షేమానికి నిధుల మంజూరు

చిత్తూరు జిల్లాలోని గిరిజన కాలనీలో 1970-71 సంవత్సరంలో, డీనోటిఫై చేయబడిన గిరిజనుల యిండ్ల సహాయానికి రు. 5,000 లు షెడ్యూలు తెగలకు రు. 22,000 లు మంచినీటి బావుల త్రవ్వకానికి రు. 25,000లను రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసింది.

జిల్లాలో షెడ్యూలు తెగలకు నాగటి పశువుల సరఫరాకు రు. 3,000ల మొత్తానికి కేటాయించారు.



ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు నవంబరు 14.న వనపర్తిలో నేత్ర శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు.

## సోమశిల ప్రాజెక్టు సత్వర నిర్మాణానికి విజ్ఞప్తి

రాష్ట్ర మధ్యతరహా నీటిపారుదల శాఖామంత్రి శ్రీ ఆర్. నారపరెడ్డికి యిటీవల పొదలకూరులో జరిగిన సన్మాన సభలో సమితి అధ్యక్షుడు శ్రీ కె. రమణారెడ్డి మంత్రికి స్వాగతం చెప్పుతూ పెన్నారు-బుడ్వేలుకాలువ నిర్మాణం, సోమశిల ప్రాజెక్టు నిర్మాణం పనులను త్వరితగతిని చేపట్టాలని విజ్ఞప్తి చేశారు. దానితో రాపూరు తాలూకాలోని మెట్ట భూములకు నీరు లభిస్తుందని ఆయన పేర్కొన్నారు. పౌర సరఫరా శాఖామంత్రి శ్రీ ఏ. సంజీవరెడ్డి సభకు అధ్యక్షత వహించారు.

## హరిజనులకు గృహాలు

చంద్రగిరి సబ్ కలక్టరు శ్రీ సి. సత్యనారాయణరావు యిటీవల పులిచర్ల పంచాయతీ సమితిలోని కాకాల, దామలచెర్వు గ్రామాల్లో 51 హరిజన కుటుంబాలకు యిండ్లనిర్మాణానికి రు. 100ల చొప్పున పంపిణీ చేశారు.

ఈ మొత్తాలను యిండ్ల నిర్మాణానికి వినియోగించుతుని ప్రభుత్వం యిస్తున్న గ్రాంట్లను సద్వినియోగం చేసుకోవాలని హరిజనులకు ఉద్బోధించారు.

## విశాఖపట్నంలో ఆటోటెలెక్స్

కేంద్ర కమ్యూనికేషన్ శాఖా స్టేట్ మంత్రి అచార్య షేర్‌సింగ్, అక్టోబరు 27వ తేదీన విశాఖపట్నంలో ఆటోటెలెక్స్ నిర్మాణానికి లాంఛన ప్రాయంగా ప్రారంభోత్సవం చేశారు. 50 లైన్స్ ఉండే యీ టెలెక్స్, 1971 ఫిబ్రవరినాటికి పని ప్రారంభిస్తుంది ఆంధ్రప్రదేశ్‌లోని టెలెక్స్‌లో యిది మూడవది. దక్షిణ మండలములో తొమ్మిదవది. దీని జోనల్ కేంద్రం మద్రాసులో ఉంది.

## గుంటూరులో జాతీయ పొదుపు సంస్థలో రూ. 30 లక్షల పెట్టుబడి

సినీ నటకులు, జాతీయ పొదుపు సంస్థ సంఘ ఉపాధ్యక్షు లయిన శ్రీ యన్. టి. రామారావు జాతీయ పొదుపు పక్షోత్సవాల సందర్భంలో గుంటూరులో ఏర్పాటైన బహిరంగ సభలో ప్రసంగిస్తూ, ఈ పక్షంరోజులలో గుంటూరు ప్రజలు జాతీయ పొదుపు ఉద్యమ సంస్థలో రు. 30 లక్షలు పెట్టుబడి చేసినందుకు వారిని అభినందించారు.




రాష్ట్ర జాతీయ పొదుపు సంస్థ సలహామండలి ఉపాధ్యక్షుడూ, చలనచిత్రనటుడూ అయిన శ్రీ ఎన్.టి. రామారావు గుంటూరులో నవంబరు 6 న జాతీయపొదుపు సమావేశంలో ప్రసంగించారు.

---

జాతీయ పొదుపు ఉద్యమాన్ని కార్మికులు, ఫ్యాక్టరీవర్కర్లు, స్కూలు పిల్లలు బాగా ప్రచారంలోకి తీసుకొని రావాలి. ప్రతి కుటుంబానికి జాతీయ పొదుపు అకౌంటు వుండాలి. ప్రతి ఒక్కరూ తాము సంపాదించిన మొత్తంలో కొంత డబ్బును ఆదాచేయాలి-అని శ్రీ ఎన్. టి. రామారావు చెప్పారు.

ఈ సభకు అధ్యక్షత వహించిన చేనేత శాఖామంత్రి శ్రీ ఎ. భగవంతరావు ప్రసంగిస్తూ, ప్రభుత్వం సంక్షేమ కార్యక్రమాలను అమలు జరపడానికి వీలుగా ప్రజలు జాతీయ పొదుపు సంస్థలో పెట్టుబడి చేయాలని వినతి చేశారు.

## కానాపూర్ కాలువకు నీరు విడుదల

మధ్యతరహా నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ ఆర్. నారప రెడ్డి, యిటీవల పెన్నారు నదిపైగల సంగం ఆనకట్ట దక్షిణ భాగం ప్రధాన తూము ద్వారా కానాపూర్ కాలువలోనికి నీటి పారుదలకు ప్రారంభోత్సవం చేస్తూ 11 మైళ్ల 9 ఫర్లాంగుల మేరకు నిర్మాణం పని పూర్తయిన యీ కాలువ ద్వారా పొదలకూరు పంచాయతీ సమితిలోని వెలిగంపాలెం వెంకటాచలం పంచాయతి సమితి లోని గొల్లకందు కూరు, సజ్జాపురం, వెల్లండి గ్రామాలలో 1004 ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించే ఆరు చెర్వులకు నీరు లభిస్తుందని అన్నారు.

పౌర సరఫరా శాఖా మంత్రి శ్రీ ఎ. సంజీవరెడ్డి యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

## మార్కెటింగ్ యార్డుకు శంఖుస్థాపన

మార్కెటింగ్ శాఖా మంత్రి శ్రీ రామచంద్రరావు కల్యాణి, గత ఆదివారంనాడు నల్లగొండ జిల్లా నకిరేకల్లులో మార్కెటింగ్ యార్డు షెడ్డుల నిర్మాణానికి శంఖుస్థాపన చేశారు. రు 50,000ల ఖర్చుతో వాటిని నిర్మిస్తున్నారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ రంగారెడ్డి ప్రసంగిస్తూ రైతు సంఘాలను ఏర్పాటు చేయాల్సిన అవసరాన్ని గూర్చి క్రమబద్ధం చేయబడిన మార్కెట్లు అన్నింటిలో గిడ్డంగులను ఏర్పాటు చేయాల్సిన అవసరాన్ని గూర్చి నొక్కిచెప్పారు.

## వంతెనకు ప్రారంభోత్సవం

చేనేత పరిశ్రమ, సహకార ఫ్యాక్టరీల శాఖామంత్రి శ్రీ ఎ భగవంతరావు యిటీవల రేపల్లి సమితిలోని నంగాటి రేవులో ప్రసంగిస్తూ అముదాలపల్లి లిఫ్ట్ఇరిగేషన్ పథకం త్వరలోనేచేపట్టబడుతుందని అన్నారు.

రెండు లక్షల రూపాయల ఖర్చుతో నిర్మించబడిన నంగాడి రేవు వంతెనకు మంత్రి ప్రారంభోత్సవం చేశారు

## కృష్ణాజిల్లాలో హరిజనుల కొరకు 2,400 ఇండ్ల నిర్మాణం

కృష్ణా జిల్లాలో హరిజనుల పునరావాసం కొరకై ఇండ్లు నిర్మించేందుకు ఆ జిల్లాలోని పంచాయత్ సమితి అధ్యక్షులు ఒక పథకాన్ని రూపొందించారు. ఒక్కొక్క ఇంటికి రు. 1500లు ఖర్చు పెట్టి మొత్తం 2,400 పక్కా ఇండ్లు నిర్మించడానికి పథకం తయారు చేయబడినది. ప్రభుత్వము ఇందుకొరకు రూ. 12 లక్షలు మంజూరు చేసింది. పంచాయతీ సమితి అధ్యక్షులు హరిజనుల సంక్షేమం పట్ల శ్రద్ధవహిస్తున్నందులకు వారిని కృష్ణా జిల్లా కలెకరు శ్రీ సి. యన్. శాస్త్రి ప్రశంసించారు.

## యువజన కర్షకుల సమావేశానికి ప్రారంభోత్సవం

రాష్ట్ర విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు, గత శుక్రవారం నాడు శ్రీకాకుళంలో ఆంధ్రప్రదేశ్ యువజన కర్షకుల సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 1956-60 లో మెగావాట్ల నుండి నేటికి 900 మెగావాట్లకు పెంచడం జరిగిందని, అదే కాలంలో గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడినసంఖ్య 618 నుండి 7200కు పెరిగిందని మంత్రి వెల్లడించారు వ్యవసాయం నిమిత్తం కొన్ని అటవీ భూములను పంపిణీ చేస్తారని ఆయన అన్నారు.

అంతకుముందు వ్యవసాయ శాఖామంత్రి శ్రీ కాకాని వెంకటరత్నం వ్యవసాయ వస్తు ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు.



PRINTED BY THE DIRECTOR OF PRINTING GOVT OF ANDHRA PRADESH, AT THE GOVT CENTRAL PRESS HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION PUBLIC RELATIONS & TOURISM ANDHRA PRADESH HYDERABAD

